# విజ్ఞప్తి.

సీ॥ విరజాజిపువ్వులఁ బరిహసింపఁగఁజాలు
రమణీయమృదుశరీ రములతోడ
ననసుధారసముక న్నను స్వచ్ఛమై కడు
దాక్షిణ్యములను చి త్తములతోడ
ధరణిపైనున్న భూ తశ్రేణి నేవేళఁ
దమయట్లుగను మంచి తలఁపుతోడ
నలచతుర్దశలోక ములనైన వడకించు
ననఘపాతివ్రత్య బలముతోడఁ

తే॥ గీ॥ బతియె దైవంబటంచు భా వమునఁ దలఁచి
సూక్ష్మమైనను గన్నెత్తి చూడనట్టి
పరమసాధ్వీమతల్లుల చరణసేవ
యొర్వఁగలవారి నెల్ల ధన్యులనొనర్చు.

సాధ్వీతిలకము వీరరసావతారము నగు వీరమతీదేవి చరిత్రము శ్రవ్యకావ్యముగ వ్రాసినపిదప నొకపతివ్రతకథ దృశ్యకావ్యముగ వ్రాయవలెనని నేను దలంచితిని. మానవతి, స్త్రీసాహసము, సతారాం లోనగు నాటకములను జూచితిని. కాని యందలి కథాకథనము హారమునందలి పువ్వులవలెఁ బొందిపొసఁగియుండక యందందు విఱుపులు పెక్కులుగలిగి చక్కఁగా నడువకయుఁ గొన్నియెడల నౌచిత్యమునకు దూరమయ్యును, నుండుటవలన నీరూపకమున నితివృత్తమంతయు నూతనముగఁ గల్పింపఁబడినది. పతివ్రతలుగ

నుండుటకుఁదోడుగ, ననుపమానసౌందర్యవతులుగనుండు వరవర్ణినీవంశసముల్లకుఁ బ్రపంచమునఁ దటస్థింపఁగల విపత్తులును, వానిని మహాధైర్యముతో వారలెదుర్కొని స్వగౌరవపావనత్వముల నిలువఁ బెట్టుకొను తెఱంగులును భిన్నభిన్నముఖముల నిందుఁ జూపఁబడినవి.

ఈగ్రంథమున హాస్యరసముండిన బాగని రాజకన్యయగు పద్మావతీదేవి, కాలవైపరీత్యమున వెంగిసెట్టియింటఁ బెరుఁగుచుండె ననియు, నామెవివాహసందర్భమున వెంగిసెట్టి యొక్కవత్సరము లలితపురరాజ్యమును జయసింహమహారాజునుండి గ్రహించి పాలించినట్లును గల్పింపఁబడినది. మానవత్వాదిరూపకములలోఁ జోరుఁడు నిర్వహించుభాగము చౌచిత నెక్కుడుగఁ గూర్చుచుఁ గథకుబిగువు గల్పించి సుత్తిగాఁడుబల్లిగాఁడును నిషవృషభిల్లులు నిర్వహించినట్లు మార్పఁబడినది. అయినను యంకమున నొక్కసందర్భమునఁ దప్పఁ దక్కిన నాటకకథయంతయు నూతనముగఁ గల్పింపఁబడినది.

నేనురచించిన రామాయణనాటకమునందు సంస్కృతనాటకలక్షణములననుసరించి యంకవిభజన మొనరింపఁబడి పూర్వసాంప్రదాయములకనుగుణముగనుండునట్లు కథ వ్రాయఁబడినది. ఇందలికథ “షేక్స్పియరు” మతమునసరించి యంకములుగను, రంగములుగను, విభాగింపఁబడినది. కథావిభాగమునందును గథాకథనమునందును సౌలభ్యము కూర్చుటనుబట్టి పలువురుకవులికాలమున నీమతమునను సరించి వ్రాయుచున్నందున నీమార్గము నవలంబింపఁబడినది.

నాటకమునందలి ప్రస్తావము కేవలమజాగళస్తనప్రాయముగఁ జూపఁబడి ప్రదర్శింపఁబడునపుడు గగనకుసుమత్వమునవహించు నీకాలమున విస్తరముగవ్రాయ నేటికని యొకటిరెండుమాటలతో ముగించితిని.

ఈచిన్నిగ్రంథమును నాయిలువేలుపగు శ్రీ కామేశ్వరీదేవి మృదుపదారవిందములసన్నిధి నర్పించుకొనుచున్నాను. వ్యయప్రయాసములకోర్చి యీపొత్తమునుముద్రించిన నాచిరమిత్రుఁడు శ్రీయుత. గాడిచర్ల-మధ్వమునిరావుగారియెడ నేనెంతయుఁ గృతజ్ఞుఁడ నగుచున్నాను.

ఇందేదేనిగుణలేశమున్న గ్రహించి యనుగ్రహింతురని విద్వదగ్రేసరులఁ బ్రార్థించి,

విన్నవించు,

కవిసింహ. డి. రాజశేఖర శతావధాని.

ప్రొద్దుటూరు
1—1—1926



# కథాసంగ్రహము.



లలితపురాధీశ్వరుండగు జయసింహునకుఁ జంద్రసేనుఁడను నొకపుత్రుఁడుండెను. అతఁడు విద్యాభ్యాసమొనరించి యుక్తవయస్కుఁడయినంతట నొకనాఁడు తనితండ్రి వివాహమునుగూర్చి ప్రస్తావించెను. కాని బుద్ధితెలిసినది మొదలు స్త్రీలనినను వివాహములనినను జంద్రసేనునకు గిట్టుటలేదు. అందున నతఁడు వివాహమాడ నొల్లనని తండ్రికి నివేదించుకొనెను. తండ్రి మిక్కిలివిచారపడెను. ఇంతలోఁదల్లియువచ్చి పలువిధముల నతనికి బోధించెను చంద్రసేనుఁడామెమాటనుగూడఁ బాటింపనందునఁ దండ్రికోపించెను. చంద్రసేనుఁడెట్లో కడకుఁబరిణయమగుటకు సమ్మతించి, కన్యనుమాత్రము తానుస్వయముగఁజూచి నిర్ణయించెదనని చెప్పి దేశయాత్రకై వెడలెను.

నానాదేశములను బట్టణములనుదిరిగి యెందును దగినపడుచునుగానక విసివి వెనుకకుమరలివచ్చువాఁడై చంద్రసేనుఁడొకనాఁడు లలితపురరాజ్యమునందలి సోమపురసమీపోద్యానమున విడిసెను. మాళవదేశాధీశ్వరునిపుత్రికయై కాలవైపరీత్యమునఁ దలిదండ్రుల నెడఁబాసివచ్చిన పద్మావతీదేవి సోమపురమున వెంగిసెట్టి యనువైశ్యగ్రామణియింటఁ బెరుఁగుచుండెను. ఈమె పురుషులనినఁ గన్నెత్తిచూడదు. చంద్రసేనుఁడుద్యానమున విడిసిన దినము పద్మావతీదేవి చెలులతోనచ్చటికివెళ్ళి విహరించుచుండ నామెకును జంద్రసేనునకును ననురాగమంకురించెను.

చంద్రసేనుఁడు స్వపురమునకరిగి తండ్రికిఁ బద్మావతినిగుఱించి విన్నవించెను. జయసింహుఁడు వెంగిసెట్టినిబిలిపించి కన్యనిమ్మని కోరెను. వెంగిసెట్టి నీళ్లునమలి కాలయాపనముచేయుచు నొకవత్సరము లలితపురరాజ్యమును దనయధీనముచేసినఁ బద్మావతినిత్తునని యొట్టకేలకు వచించెను. జయసింహుఁడు నందులకుసమ్మతించి, చంద్రసేనునకు వివాహమొనరించి లలితపురరాజ్యమును వెంగిసెట్టికర్పించి, భార్యాపుత్రులతోడను గోపలితోడను మగధకు వెళ్ళి తనసోదరియింటనుండెను.

కొంతమాసములైనపిదపఁ బద్మావతీచంద్రసేనులు దేశసంచారమొనరింపఁదలఁచి మగధవిడిచి మధురాపురమునకై వెడలిరి. మార్గమునఁ గ్రూరసత్వములచే ననేకబాధలుపడి యొకదినముసాయంతనముగునప్పటికి మధురాపురముచేరి, యూరివెలుపలనున్న భువనేశ్వరాలయమునొద్దఁ బద్మావతినినిలిపి, తాము వసింప నొకగృహమునరయుటకై చంద్రసేనుఁడు పురిలోనికరిగెను. ఇంతలోఁ గళావతియనుకాంత పద్మావతినిసమీపించి చంద్రసేనుఁడు తనకుబంధుఁడనియు నతఁడు తనయింట నుండెననియుఁ దెలిపి పద్మావతీదేవిని దోడ్కొని తనసౌధమునకువెళ్లెను.

రాత్రి పదిగంటలగునప్పటికి మేడపైగదిలో విశ్రమించియుండిన పద్మావతీదేవిని మధురాపురప్రధానామాత్యునితనూజుఁడు జగన్మోహనుఁడు సమీపించి నీతిలేనివిధమునఁబలుకరించెను. పద్మావతి యెన్నియోనీతులుపదేశించెను. ఫలము లేకపోయెను. జగన్మోహనుఁడు కామాంధకారము కన్నులఁగప్పి య్యామెను గౌఁగిలింపసమీపించెను. అప్పుడు చేయునదిలేక పద్మావతి గుప్తఖడ్గముచే నతనితలదీసెను. తెగిపడినశిరమును మొండెమును గ్రిందఁ

బలిచినగుడ్డలోముడిచి యామె గవాక్షముగుండ బయటికిఁ ద్రోసి వైచెను. పురరక్షకభటులామార్గమునఁబోవుచు మూటవిప్పిచూచి జగన్మోహనునిదుర్మరణమునుగూర్చి రాజునకెఱిఁగించిరి. రాజును వెడలివచ్చి కళావతీసుందరులనువిచారించి, చెఱసాలలోనున్న చంద్రసేనునిరప్పించి, మేడపైనున్న పద్మావతినిబిలిపించి, నడచినసత్యము నెఱింగి, కళావతీపరిచారికలకందఱకుఁ గఠినశిక్షవిధించి యామెను దేశమువిడిచిపొమ్మని యాజ్ఞాపించెను. పద్మావతీచంద్రసేనులను దనగృహమునకుఁబిలిచికొనిపోయెను. పద్మావతీచంద్రసేనులు రెండుదినములచటనిలిచి విదేహపురమునకేగిరి. చంద్రసేనుఁడా యూరిరాజునొద్ద విదేశాంగమంత్రిగ నియమింపఁబడెను.

విదేహపురబాహ్యప్రదేశమునఁ గాళికాలయమొకటియుండెను. ఒకసోమవారమునాఁటిసాయంకాలము పద్మావతి హైమవతీదర్శనమునకై పోవుచుండెను. విదేహపురసేనానాయకునికుమారుఁడు మదనుఁడనువాఁడామెనుజూచి కొండొకవిధమునఁ బలుకరించెను. సామవాక్యములును నీతులును వినిపించుచుండునఁ బద్మావతి, మదనునిబిలిచికొనిపోయి, కాళీపూజయైనపిదప విగ్రహము నెదుట నమస్కరింపుమనిచెప్పెను. అతఁడు నమస్కరించుతఱిఁ దలుపులు మూసివచ్చి యిల్లుచేరెను.

కొన్నాళ్ళకుఁ జంద్రసేనుఁడు రాజకార్యార్థమంగదేశమునకు వెళ్లెను. ఒకనాఁటిరాత్రి పద్మావతి నిద్రించుచుండ, నిసవుకు భిల్లులు, మదనునిప్రోద్భలమున, నామెను మంచముతోడ నెత్తికొని తమకోనకు వెళ్లఁజొచ్చిరి ఇంతలోఁ బ్రాతఃకాలమయ్యెను. పద్మావతి మేలుకన్నెను. భిల్లుల నదలించెను. వారు మంచమదించిరి. చీఁకటినివిరియఁజేసి యప్పుడప్పుడు రోదసినాక్రమించుచున్న లేవెలుఁగునఁ బదియాఱుకళలతోభాసిల్లు చంద్రబింబమునంటి పద్మా

వతీ దేవిముఖము వారికన్నుల నాకర్షించెను. అప్పుడు హారుసేనాధీశునితనయుఁడగు మదనునియాజ్ఞ నొకించుక సేపుమఱచి చేశోభవుఁడగుమదనుని యాజ్ఞకు వశులైరి. పద్మావతియెడఁ దమమరులు చూపుచుఁ బిచ్చియెత్తినట్లు పలుతెఱఁగుల వదరసాగిరి. పద్మావతికేమిచేయుటకును దోఁపలేదు. కడకాలోచించి భిల్లులతో "మీరిరువురును గతిసముగఁబోరుఁడు. ఎవ్వఁడు బ్రతికిమిగిలివచ్చునో వానికుటీరమునకు నేనువచ్చెద"ననిచెప్పెను. వారామాటకొడఁబడి పోరిరి. కాని పరస్పరఖడ్గఘాతముల నిరువురునుమడిసిరి.

పద్మావతి యచ్చోటనాలసింపక లభించినమార్గమునఁ బ్రయాణమొనరించి కొన్నాళ్లకుఁ బుష్పపురముచేరెను. స్త్రీవేషము సకలాపదలకు మూలమని పురుషవేషమును ధరించెను. అప్పుడు పుష్పపురరాజకన్యయగు లీలావతికి స్వయంవరము జరగుచుండెను. ఆయూరిరాజునకు సంతానములేక లీలావతియొక్కతెయే పుత్రికయయినందున, సంతకాఱుమాసములుపూర్వమారాజు లోకాంతరగతుఁడైయుండినందునను బుష్పపురరాజ్యము లీలావతివరించినవానికే రావలసియుండెను. ఆనాఁడచ్చటికిఁ బలువురురాజన్యకుమారులు వచ్చిచేరిరి. లీలావతి వచ్చినిలిచెను. పట్టపుటేనుఁగుతొండమునకుఁ బుష్పహారము నొసఁగిరి. అయ్యది రాజపుత్రులనందఱను దాఁటి పురుషవేషమునఁ బ్రేక్షకులలో నొక్కయెడ నిలిచియుండిన పద్మావతికంఠమునఁ గుసుమదామము వైచెను. సభ్యులు హర్షించిరి. పద్మావతీలీలావతులకుఁ బరిణయము మహావైభవముతో జరగెను.

పద్మావతి తనచిత్రపటమును, నగరద్వారమునఁ గట్టించెను. కొన్నాళ్లకు యశోవతీజయసింహులును, మధురవాణీజయకేతనులును, జంద్రసేనుఁడును, మదనుఁడును బుష్పపురమునకు వచ్చిరి.

పట్టాభిషేకోత్సవము జాటఁబడెను. అందఱు పరస్పరదర్శనముల నానందించిరి. మదనుఁడు మంచిబుద్ధిగలవాఁడై పద్మావతీదేవికిభర్తయై జీవితశేషమును గడపెను. పద్మావతీలీలావతులిరుప్రక్కలనుండఁ జంద్రసేనుఁడు పుష్పపురరాజ్యాధీశుఁడు గావింపఁబడెను. కతిపయ దినములలోఁ జంద్రసేనుఁడు లలితపురమున స్వరాజ్యలాభమునుఁ గాంచి సుఖముననుండెను.

స్వ _ స్తి _ స్తు.



# ఈ నాటకమునందలి ముఖ్యపాత్రలు.



## పురుషులు.

జయసింహుఁడు—లలితపురాధీశ్వరుఁడు.

చంద్రసేనుఁడు—అతనిపుత్రుఁడు. (కథానాయకుఁడు)

విశారదుఁడు—జయసింహునిమంత్రి.

వెంగిసెట్టి—సోమపురమువైశ్యుఁడు.

వెంకటసెట్టి—అతనిమేనల్లుఁడు.

కవి—వెంగిసెట్టి యాస్థానమునకువచ్చిన విబుధుఁడు.

సేనాధిపతి—లలితపురముననుండువాఁడు.

సింగముసెట్టి—వెంగిసెట్టిబావ.

జగన్మోహనుఁడు—మధురాపురమున మంత్రికుమారుఁడు.

విజయసింహుఁడు—మధురాపురాధీశ్వరుఁడు.

మదనుఁడు—విదేహపురసేనాధీశునికుమారుఁడు.

సుత్తిగాఁడు, బల్లిగాఁడు } విదేహపుర పరిసరారణ్యమునందలి భిల్లులు.

సుగుణసారుఁడు—పుష్పపురమునందలిమంత్రి.

సుబ్రహ్మణ్యసోమయాజి—పురోహితుఁడు.

1-2-3-4 రాజులు—స్వయంవరమునకువచ్చినవారు.

పూర్ణచంద్రుఁడు—పురుషవేషముననున్న పద్మావతి...

జయకేతనుఁడు—మాళవనృపాలుఁడు. పద్మావతితండ్రి.

భటులు—

## స్త్రీలు.

యశోవతి—జయసింహునిభార్య.

పద్మావతి—(కథానాయిక).

కీరవాణి } పద్మావతిచెలులు.
చతురిక }

భిల్లికన్య—మధురాపురపరిసరారణ్యముననుండు నాటవికకన్య.

కళావతి—మధురాపురమందలి వేశ్య.

వెంకమ్మ—మధురాపురమందలి బ్రాహ్మణస్త్రీ.

సుందరమ్మ—కళావతీపరిచారిక.

లీలావతి—పుష్పపురరాజకన్య.

మధురవాణి—పద్మా:    ,,



కామేశ్వర్యై నమః

# పద్మావతీవిజయము.

---

## నాంది

మ॥ పతియే దైవమటంచు భక్తిరహియింపన్ బతిఁ గొల్చి యొండొక్కఁడు
ప్రతి రారాజయినన్ దృణంబని మదిన్ జింతించుచున్ నీతితో
క తనున్ సోఁకిన ద్రుంచి, భూభరము తగ్గన్ జేయు సాధ్వీమణి
ప్రణతిన్ బ్రోచు గిరీంద్రనందన చిరైశ్వర్యంబు మీకిచ్చుతన్.

(నాంద్యంతమున సూత్రధారుఁడు పుష్పాంజలిచల్లి.)

గుణగ్రహణపారీణులగు నోసభాసదులారా! కళానిధానములై సుప్రసన్నములై నవవికసితారవిందసుందరములై చిఱునవ్వు లొలికించు మీముఖబింబముల దర్శించు భాగ్యముగలిగి నేనానందాంబుధి నోలాడుచున్నాను. పెక్కుమాటలచే మీకాలమును బరిక్షింపక యొకటిరెండునిమిషములలోఁ గార్యమునివేదించుకొని మీసెలవు గైకొందును.

సీ॥ రచియించెఁ దొల్లి విక్రమతీచరిత్ర వెం
కటశాస్త్రి కడుఁ గౌతుకమున మెచ్చ
పఠియించెఁ గలమాజుఁ బృథ్వీపాలచరితంబు
విరచించుచోఁ గవిపండితులర

వాప్రియఁగా నేర్చి రా ॥ మాయణమును నాట
కములుగా రసస్వాదు ॥ వముపనర్ప
లిఖయించె మేలిశై ॥ లిని బాలకులునుతుల్
సలుపఁగా శ్రీహరి ॥ శ్చంద్రచరిత

తే॥ గీ॥ మాచరించె ననేకశ ॥ తావధాన
ముల విబుధకోటులెల్ల నౌ ॥ దలలనూఁప
నాతఁడు శతావధానిపం ॥ చానన కవి
సింహబిరుదాంచితుఁడు రాజ ॥ శేఖరుండు.

నూతనసంవిధానములతో నీకవిచేఁ గల్పింపఁబడిన పద్మావతీవిజయమను పతివ్రతకథ నేఁడిచ్చటఁ బ్రదర్శింపఁబడుచున్నది. విజ్ఞులందఱు రసాస్వాదనాతత్పరబుద్ధులరై నాటకరాజమునీక్షించి యానందింతురని కోరుచున్నాను.

(నిష్క్రమించును.)





కామేశ్వర్యై నమః

# ద్యావతీవిజయము.

## ప్రథమాంకము.



ప్రథమరంగము :—లలితపురము—జయసింహనృపాలుని హార్మ్యము—జయసింహచంద్రసేనులుందురు.

జయసింహు:—నాయనా! చంద్రసేనా! యభ్యసింపవలసిన విద్యలు పూర్తియైనవి. నవయౌవనోదయమునైనది. చుట్టుపట్టులఁగల రాజన్యచంద్రులు,

ఉ॥ "ఆకమలాసరోరుహద ♦ ళాయతలోచనఁబోలు రూపరే
ఖాకమనీయగాత్రలగు ♦ కన్యల నర్పణసేయువార మె
ట్లో కరుణించివియ్యమున ♦ కొప్పుకొనంగదె" యంచుఁబల్మఱున్
నాకడకంపుచుండెదరు ♦ నాయన! యెందఱొ రాయబారులన్.

అవకాశము గల యప్పుడు వారలు పంపుకొనిన యీ చిత్రపటములఁ బరీక్షించి మనకులశీలగౌరవములకుఁ దగిన యొక కన్యను నీవిందేఱికొందువేని సత్వరము నీకుఁ బాణిగ్రహణోత్సవము జరపెద.

చంద్ర :—అయ్యా! నీ వాత్సల్యమునకు మేరలేదు. నే నిప్పుడు యుక్తవయస్కుఁడనగుట యథార్థము. నేఁడు గాకున్న రే



వైన నీవిషయమై నన్ను నీవు ప్రస్తావింతువని కూడ నేనెఱుంగుదును. కాని యదేటికో బుద్ధి తెలిసినదిమొదలు స్త్రీలనినను వివాహములనినను నాకేమాత్రము సమాధానము కాదు. ఈవిశాల ప్రపంచమున నెవ్వఁడెన్నియొండ్లు చదివినను దుదిఁ గాంచని విద్యలున్నవి. శక్తివంచనలేక విద్యాభ్యాసమొనర్చి విద్యానంద మనుభవింపఁ దలఁచి యున్నాను. దేవా! వివాహముఁ గూర్చితప్ప నీ యిచ్చకువచ్చిన పనికి నన్ను నియోగింపుము. నీ పాదమునఁ జూపుము. శిరమున ధరించి విధేయుఁడనై వర్తించెద.

జయ:—ఇంకేమి నియోగించుట? నీ భావమిట్టి విపరీతపుఁ ద్రోవఁ బోవునని యేనాఁడైనఁ దలఁచియుండలేదు. అయ్యో! యీ ప్రపంచమున నీకేమికొదవ? విస్తారమగు రాజ్యముగలదు. అంతయో యింతయో విద్యగలదు. యుక్తవయస్కుఁడవు నైతివి. పెండ్లిపేరఁటము లొనరించుకొని తోడివారలలో నింతపేరును బ్రతిష్ఠయుఁగలిగి వర్తింపక విపరీతపు మార్గము నవలంబించుచున్నావు. ప్రపంచమంతయు శ్రేష్ఠమని కొనియాడు గార్హస్థ్యమునే నిందించుచున్నావు.

సీ॥ అకొనియేతెంచు ♦ నతిథి దైవంబంచుఁ
జిత్తానఁ నెంచి పూ ♦ జింపవచ్చుఁ
బ్రాణంబునకుఁ బ్రాణ ♦ పదములై వర్తించు
బహుళాప్తబంధులఁ ♦ బడయవచ్చు
సముదారమంగళా ♦ చారవర్తనములు
జపములు దీక్షతో ♦ జరపవచ్చు
నేకమనస్కుఁడై ♦ యెపుడుభోగములొంది
ఘనసౌఖ్యములఁజూఱఁ ♦ గొనఁగవచ్చు

తే॥గీ॥ నన్నియుండ వంశమునిల్పు ♦ నట్టిపుత్రుఁ
బడసి పుణ్యలోకములకు ♦ నడుపవచ్చు
నట్టిగార్హస్థ్యమునుమాని ♦ యకట! వట్టి
బ్రహ్మచర్యముఁగొననెట్లు ♦ భ్రాంతిపడితొ?

ఇన్నాళ్లుచదివించియు నీకు సదసద్వివేకము గలుగనందులకుఁ జింతించెద.

చంద్ర:— తండ్రీ! తేనెఁబూసినకత్తులు గోముఖవ్యాఘ్రములు తృణావృతకూపములు చక్కెరపూఁతవిసంబులు నైన స్త్రీజనంబుల నెవ్వాఁడైన నమ్మఁదగునే? అయ్యో!

సీ॥ కాలకూటాభీల ♦ కాలఫణులుగాని
చక్కనిమెఱుఁగుకీ ♦ ల్జడలుగావు
యమునిభీకరకేత ♦ నాంబరములుగాని
జిలుఁగుఁబయ్యెదచెఱం ♦ గులునుగావు
మిసమిసమనుపెద్ద ♦ విసపుముద్దలుగాని
కమనీయవదనబిం ♦ బములుగావు
హృదయంబులనుజీల్చు ♦ నీటెపోటులుగాని
తళుకారువాలుఁజూ ♦ పులునుగావు

తే॥గీ॥ భూరివజ్రంబు గఱగించి ♦ పోసినట్టి
కఱకుఁదున్కలు హృదయముల్ ♦ గావుగావు
మూర్తినొందిన పాపపుఁ ♦ బ్రోవులైన
వెలఁదులనునమ్మ మగవారు ♦ వెఱ్ఱివారు.

జనకా! స్త్రీలమాట తలపెట్టినంతనె నాదేహము జలదరించును. అంతటి యనృతము సంతతి మోసము మఱియొక్క

జాతిలోఁ గనుపింపవు. అకటా! స్త్రీజాతి మోహావేశమునఁ బుట్టి మోహావేశమునఁ బెరిఁగినది.

జయ:—నాయనా! నీవేదియో దుర్భ్రాంతిలోనుండి యిట్లుపలుకచుంటివే కాని యించుక యాలోచించిన నీ యభిప్రాయము కేవలము నిరాధారమని తెలియఁగలవు. వివాహములు సన్మానార్హములు గావనియు విశేషించి స్త్రీజాతి యంతయు దుశ్శరిత్రముగల దేయనియు నీవుతలంచుట పొరపాటు. వివాహములును స్త్రీలు నీదినమురాలేదు. సాధారణమనుజులమాట యట్లుండనిమ్ము. ఋషులును దేవతలును విశేషించి త్రిమూర్తులును వివాహమాడియుండలేదా? వారుమనవలెఁ దెలివి గలవారు కారా?

చంద్ర:—మనవలెనే కాదు. మనకన్న నూఱంతలు వేయంతలు గూడ బుద్ధిశాలురగుటయే నిశ్చయము. బుద్ధిశాలురును బరమపావనులునుగూడ. అది నేను గాదనను

జయ:—అట్లయిన వారు స్త్రీలనేల గౌరవింపవలె? ఏల వివాహమాడవలె?

చంద్ర:—అది నేను విన్నవించుకొనలేను. వారు తదేకదృష్టితో స్త్రీల లోపములఁ గనిపెట్టియుండకపోవచ్చును.

జయ:—తదేకదృష్టితోఁ గనిపెట్టియుండక కాదు. స్త్రీలు దయాదాక్షిణ్యాద్యుత్తమగుణములు గలిగి పురుషప్రకృతి యందలి లోపములు మాన్పి గుణము హెచ్చింతురనుతలంపుతో.

చంద్ర:—అట్లయిన ఋషులయొక్కయు దేవతలయొక్కయు స్త్రీలలో సౌందర్యపతివ్రతాత్వములుగలవారెవరు? నీముందఱ నేనీవిషయములఁగూర్చి విన్నవించుకొన జంకుచుంటినే కాని తారా

దేవి ప్రవర్తనమును నహల్యాదేవి చెడునడవడియు నీవెఱుఁగనివికావు. దేవతాస్త్రీలు మొదలు కట్టకడపటి మనుష్యస్త్రీలవఱకెంతచూచినను నొక్కరియెడనైన మంచి కనఁబడదు. దౌర్మార్గము వారికిఁ బుట్టుకతోఁ బుట్టినది.

సీ॥ చిన్నారికూఁకటి ♦ కన్న మున్నఁగఁగల్గు
నెఱనీటువగలచే ♦ మెఱయుగుణము
తళుకునిద్దంపుఁజూ ♦ పులకు మున్నఁగఁగల్గె
దుః మోసగించు టా ♦ టోటువిద్దె
గొనబారుమైమెఱుం ♦ గులకు మున్నఁగఁగల్గుఁ
గల్లలాడుటలోనఁ ♦ గౌశలంబు
బొమ్మమెఱుంగుసొ ♦ రునకు మున్నఁగఁగల్గు
సమదోగ్రచిత్తచాం ♦ చల్యగరిమ

తే॥గీ॥ యౌవనోదయమున కెన్ని ♦ యబ్దములకొ
మున్నుగాఁగల్గు బహుళసం ♦ భోగవాంఛ
కట్ట! వసియింతురే? తెల్వి ♦ గలుగువార
లాఁడుప్రతిమ వసించు గే ♦ హమునసైన.

అందున నీకాలపుస్త్రీలఁ జూచిన గుండియ లదరును. అయ్యో!

సీ॥ తలపైఁబొదలుపెన్నె ♦ ఱులఁగత్తరించి సుం
దరియోర్తు ముందు ముం ♦ గురులఁ బెంచు
బుగ్గలనెఱుపు మో ♦ మునఁ దెల్లపౌడి రాచి..
తలవాకిటను జేరి ♦ నిలుచునొకతె
యుంగంబులెల్లఁగా ♦ నంగరా జిలుఁగుదు

పద్మావతీ విజయము.

ప్వాలువల్వు ధరియించి ♦ మెలఁగునొకతె
గజ్జెలగుజ్జుమట ♦ కరణి సొమ్ములుదాల్చి
గునగుననొక్కర్తు ♦ గునిసినడచు

తే॥గీ॥ ముక్కుగలవారలెల్లర ♦ ద్భుతమునొంద
బుగులుకొను సువాసనలను ♦ బూయునొకతె
పైసొగసులిట్టులున్నను ♦ వర్తనమున
వారనారులుమేలు ము ♦ ష్మాణు తండ్రి!.

ఇట్టివారిలోనిఁక సద్వర్తన మెచ్చటిది?.

జయ:—అట్లేటికి? మనకుఁదెలిసియె యొక సహస్రమున కెక్కుడుగ మంచిస్వభావముగల స్త్రీలుందురు.

చంద్ర:—వారందఱు మంచిస్వభావముగలవారని యేమినమ్మకము?.

జయ:—లేకేమి? సీతామహాదేవియుఁ జంద్రమతీ దమయంతులును శచీదేవియు రుక్మిణీసత్యభామాద్రౌపదులును సుభద్రామిత్రవిందలును వీరును వీరివంటి పతివ్రతాతిలకము లెందఱు లేరు? వీరిగుణసంపదను గణించి మనము భక్తిచూపవలదా?

చంద్ర:—(చిఱునగవుతో) వారందఱుఁ బురాణకాంతలుగదా?

జయ:—అనగాఁ బ్రాచీనకాలపువారనికదా? అయినమాత్రమున నేమి?

చంద్ర:—పురాణములలోఁ జెప్పఁబడినవారని నా భావము.

జయ:—కేవలముదాత్తగుణము గలవారగుటచే మహర్షులు వారి దివ్యచరిత్రములఁ గీర్తించియున్నారు. వర్తనమునుబట్టి మనము వారిని శిరమునఁ దాల్పవలసియుండెను.

చం:—నామనవి యట్లుకాదు. పురాణములు కవికృతములు.

జయ:—అట్లయిన నన్నియుఁ గల్పితములందువా?

ప్రథమాంకము.

చంద్ర:—ఏలకాఁగూడదు?

జయ:—మహాకవులెప్పుడు నన్నృతమాడరు.

చం:—కవులనృతమాడుదురని నేఁగూడఁ జెప్పను. కాని వారు నిరంతరమును గొన్నినీతు లుపదేశింపఁ దలంచి లోకము చొప్పున నాయికానాయకుల సృష్టించి పాత్రములఁ దత్తదనుగుణముగఁ బోషించుకొనుచు జరగకున్నను జరగినదానికన్న విషయముఁబలపఱచి భావనాబలముపెంపునఁ జిత్రించి కావ్యప్రపంచముల సృష్టించి జీవకళలు వెదఁజల్లుచుందురు. ఆమహాసామర్థ్యముకతమున.

సీ॥ గ్రచ్ఛపాదలనైన ♦ ఘననందనములుగా
భావించునట్లు చె ♦ ప్పంగనేర్తు
నందనవనముఁ గో ♦ రింపడొంకగమార్చి
కళలెల్లఁదుడిచి త్రొ ♦ క్కంగనేర్తు
కూటిపేదనుబట్టి ♦ "కోటీశుఁడితఁడ"ంచు
నెంతయుఁబైకి నె ♦ క్కింపనేర్తు
క్షోణీంద్రుఁబట్టి భి ♦ క్షుకునిగాఁగల్పించి
పాతాళమునకుఁ బం ♦ పంగనేర్తు

తే॥గీ॥ నందిఁబందిని బందిని ♦ నందిగాఁగ
మార్చి ప్రతిసృష్టిచేయు బ్ర ♦ హ్మలు సుకవులు
నైంద్రజాలికుకుంచెయ ♦ ట్లలరు కలము
ద్రిప్పినంతనె లోకముల్ ♦ దిరుగుచుండు.

ఇతఁడు లన్నృతమాడిన నయ్యది యసత్యమనిపించుకొనును. కవుల కల్పన లసత్యములనుటకు వీలుపడదు. కాని కల్పన

లనిమాత్రము చెప్పక తప్పదు! స్త్రీలను త్రిభువన మోహినులుగా వర్ణించువారును గలరులే. హేయభాజనలుగా నిందించువారును గలరులే.

జయ:—నాయనా! స్త్రీజాతిని నీవు గర్హించువిధమువినఁగా మిక్కిలి చింతయగుచున్నది. ప్రపంచమున స్త్రీజాతిలేక యొక్క పురుషజాతియేయున్న మగవారందఱు మృగప్రాయులై యొకరితోనొకరు గుమ్ములాడుకొని యెప్పుడో యంతమొంది యుందురు. అయ్యో! ప్రపంచానుభవము చాలమి నట్లు పలుకుచుంటివే కాని వివాహముఫలదను వీటిఁడియుండునే?

సీ॥ "అయ్యోడునే? దేవుఁ ♦ డా! పెండ్లి నాకం"చు
వయసుమీఱినవాఁడు ♦ వనటనొందు
"నయ్యయో! బ్రహ్మచ ♦ ర్యముదీఱు సుముహూర్త
సమయమెప్డని బ్రహ్మ ♦ చారివగచు
"యనుబాధ మేలు స ♦ న్న్యాసంబుకన్న ని
య్యాదిదుర్భరమ"ని స ♦ న్న్యాసి మిడుకుఁ
దలిరాకుననుఁబోండ్ల ♦ చెలిమిచే సుఖమొందు
భోగులఁబొడఁగాంచి ♦ యోగి గుందుఁ

తే॥గీ॥ జాతమని "పెండ్లియాడెదే? ♦ తాత!"యనిన
నపుడుచచ్చు వృద్ధుఁడుగూడ ♦ నట్టెలేచి
"యిత్తురా?"యనుఁగాని "నా ♦ కేటిక"నఁడు
వనితలేని జీవితము ని ♦ ష్ఫలము తండ్రి!.

నాయనా!

తే॥గీ॥ మహితబహుభాగ్యవిభవసా ♦ మ్రాజ్యమున్న
నాఁడుదిక్కులేనిగృహము పే ♦ రడవిసుమ్ము

కడుపుగంజికి లేకున్నఁ ♦ గాంతయుండు
నడవియే స్వర్గమట్లు సౌ ♦ ఖ్యాకరంబు.

చంద్ర:—తండ్రీ! విషక్రిమిన్యాయమున సందులోఁబడ్డవారికేదేని సుఖలేశము గనఁబడినఁ గనఁబడవచ్చునేమోగాని యంతకువేయంతలు కష్టములు చుట్టికొనియున్నవి.

సీ॥ గడియించుభారమం ♦ గడికేఁగుభారంబు
కొనడిభారము తెచ్చు ♦ కొనడిభార
మతిథిసంఘముతాక ♦ యాప్తులమూఁక బి
చ్చాళ్ళయేటవలఁ జు ♦ ట్టాలపోటు
వస్త్రాలవిలువ యా ♦ భరణాలవిలువ వై
ద్యులవిల్వ పిదపన ♦ ర్థులవిలువయు
నిలుఁగాచుభయము వ ♦ స్తులఁగాఁచుభయము నం
గనఁబ్రోచుభయము జ ♦ గంబుభయము

తే॥గీ॥ పుత్రకులభయమివియెల్ల ♦ మూఁగి ధీర
చిత్తులకును సంసారము ♦ చీయటంచు
నవల సన్న్యాసమే "సై" య ♦ టంచుఁదోఁప
మిగులదుస్సహమగు గృహ ♦ మేధిబ్రతుకు.

జయ:—చంద్రసేనా! నీకట్టిబాధలు భయములు లేవుకదా? సమస్త ధనధాన్యసమృద్ధమగు నీలలితపురసామ్రాజ్యమే నీయధీనమునఁగలదు. వేలకువేలు భటులుగలరు. సర్వసౌఖ్యములను నీ వనుభవింపవచ్చును. నీవొక చక్కనిచుక్కనుబెండ్లాడి యిరువురల్లారుముద్దుగ సంసారమొనర్చుచు బిడ్డపాపలఁగనినఁ జూడవలెనని నాకును నీతల్లికి నెంతయో కోరికగలదు.

చంద్ర:—ఉండవచ్చును. అయ్యది నాకు సమాధానమై యుండవ లయుఁగదా?

జయ:—అట్లయిన నీచిత్తము మాఱదా?

చంద్ర:—మున్నుండు మాఱునేమోకాని యిప్పటికట్లే తోఁచుచున్నది.

జయ:—అయ్యో! చివరకింతటి మూర్ఖ్యమునకుఁ బాలుపడితివి!

మ॥ "అకలంకంబగు రాజ్యసంపద లమే ♦ యంబైన భోగంబు లుండి కుమారుండొకఁడుండ వానికిని బెం ♦ డ్లిఁకఁ బేరఁటంబుఁ బొనర్పక వంశోద్ధరణంబు చేయఁజనఁడీ ♦ పాపాత్మకుండ"ంచు నన్నకటా! లోకులు నిందలాడునటు చే ♦ యఁ బూనితే? పుత్రకా!

సీ॥ "కొడుకకటా! పుట్టు ♦ వడుగయ్యె"ననుచు రేఁ
బవలొకరీతి నేఁ ♦ బలవరింపఁ
"దనకన్నకాన్పుకే ♦ దశగల్గె"నని తల్లి
కడుపుమంటలచేతఁ ♦ గ్రాఁగుచుండ
"మానేర్పుచదువు లీ ♦ మాడ్కిఁ వమ్మయ్యెనే"
యని గురులేవేళ ♦ నడలుచుండ
"మనవానికీరీతి ♦ మూర్ఖ్యంబుగల్గవ
చ్చునె"యంచు బంధులె ♦ ల్లను దపింప

ఆ॥వె॥ "సంతరించువంశ ♦ మకట! పుణ్యము సెడు
ననుచుఁ బితరులెపుడు ♦ వనట్ఁ గుంద
బ్రహ్మచర్యమూని ♦ పాపఁడా! యిరీదఱు
గొంతు నలుప నీకు ♦ కోరదేల?

కొడుకనుపేరుకతమునఁ జేరఁదీసినపాపమున నాకే నీనిర్ణయ

మింత హృదయదాహకముగానుండ నవమాసములు మోచి కని పెంచి పెద్దచేసి నీకై ప్రాణముఁబట్టికొనియుండు త్వదేక పుత్రిక నీజనని యీవార్తఁ దెలిసి యెంతపరితపించునో యోజింపవైతివే? అయ్యో! నిన్నేమనవలె? (ఇంచుక తాళిదృష్టిమార్చి) అయ్యో! యన్నట్టులామె యిచ్చటికే వచ్చుచున్నది. నాయనా! తల్లిపైఁగలప్రీతిచేనైన నీవుమూర్ఖతనుమానుము.

ప్రవేశము యశోవతి.

చంద్ర:—జననీ! నమస్కరించుచున్నాను.

యశో:—కల్యాణమగుఁగాక. నాయనా! యీదినము కన్యానిశ్చయ మొనరించుటకై నీతో మాటాడఁగోరి నీజనకుఁడిందువిచ్చేయుటయు, నేనిప్పుడిందువచ్చునప్పటికి నీవు చింతించుచు నిలుచుండుటయు నీతండ్రి నిట్టూర్పుపుచ్చుచుండుటయుఁ జూడ నాహృదయము కలఁతనొందుచున్నది. అన్నా! నీవవినయ మొనరింపలేదుకదా?

చంద్ర:—అమ్మా! హృదయపూర్వకముగ నవినయలేశము మీయిరువురయెడఁగలనైన నేనొనరింపఁజాలను. కాని వివాహవిషయమై నామనస్సునకంగీకారముగాకున్న నాసంగతి తండ్రిగారికి నివేదించుకొంటిని. ఆయనమనస్సు కలఁతనొందినది.

యశో:—నీవట్టినిర్ణయమునకున్న నాయనమనస్సొకటియే కాదు. నామనస్సుకూడఁ గలఁతనొందును.

చంద్ర:—అది నేనెఱుంగుదును. కాని యేమిచేయనచ్చును? ఎంత దూరము ప్రయత్నించినను నామానసమనుకూలవిధమునకు రాకున్నది.

యశో:—నాయనా! నీవు సంసారసుఖములనుభవించి కులోద్ధారకుఁడవు కావలెనని మాకెంతయుఁ గోరికకలదు. నీవు వివాహమువలదని పట్టుపట్టియున్నావు.

చంద్ర:—తల్లీ! యనాలోచితబుద్ధినై మౌర్ఖ్యమున నేను బట్టుపట్టియుండలేదు. ఎంతదూరముయత్నించినను మనస్సొప్పకున్నది. నేనేమిచేయుధును? గార్హస్థ్యము నాకుగిట్టకున్నది.

యశో:—అన్నా! సకలాశ్రమములయందును గృహస్థాశ్రమమెక్కుడని పూజ్యులు వక్కాణించుచుందురు. లోకమునందలిజనులలో నెంకతెందఱేయేయాశ్రమమున నిలిచియున్నారని విచారింతుమేని తక్కినసమూఁడాశ్రమములయందుకన్న గృహస్థాశ్రమమున నెక్కుడుసంఖ్యజనులున్నారని తేటపడకపోదు. జనులలో నెక్కుడుభాగమా యాశ్రమమును స్వీకరించుటలో దానిగురుత్వము గోచరింపకపోదు.

చంద్ర:—నీవుచెప్పినది సముచితమే. కాని జనబాహుళ్య మవలంబించినమతమే యెల్లప్పుడును శ్రేష్ఠమని చెప్పుటకు వలనుపడదు. తదితరానుకూలాంశములతోఁ జేరినప్పుడవలంబకుల సంఖ్యకుఁ బ్రాధాన్యము గలుగుచుండును.

యశో:—అది యట్లుండనిమ్ము. వివాహమననేమి?

చంద్ర:—బ్రహ్మచర్యాశ్రమానంతరమున స్త్రీపురుషులు పరస్పరప్రేమచే మనసులుగలసి కొంతకాలమట్లే యొండొరులసౌఖ్యమునకై పాటుపడ నిశ్చయించుకొని కలియుట వివాహము.

యశో:—దాని యుద్దేశము?

చంద్ర:—సంసారసౌఖ్యముల ననుభవించుట.

యశో:—సంసారసౌఖ్యముల ననుభవించుటయే యంధుఁ బరమావధి కాదు. కులముద్ధరించుకుమారునిఁ బడయుటయు నతిథిపూజనము లొనరించి, లోకముసేవించుటయు దాని ప్రధానోద్దేశములు. "గురుపాదంబులుగొల్చి విద్యాసంస్కారముఁ బడసి బ్రహ్మచర్యము నడిపి పురుషుఁడు గుణవతియు వయోవతియు ననురూపకులగోత్రియు నగు కన్యను సకలార్యబంధుజనసమక్షమున వివాహమాడవలయును. కష్టసౌఖ్యముల సమముగాఁ బంచుకొని సంసారసుఖముల ననుభవింపవలయును. పుత్రోత్పత్తి యయినంతనే తలిదండ్రులిరువురు శ్రద్ధాసామర్థ్యములా బాలుని యభివృద్ధికై వినియోగింపఁ బడవలయును. బాలుఁడు యుక్తవయస్కుఁడయినంతట గృహస్థాశ్రమమునఁ బ్రవేశింపఁజేసి తామొనరింపవలసిన యతిథిసత్కారాదులతఁడొనరించునట్లు నియోగించి వానప్రస్థమును జేకొనవలయు" నని మహర్షుల యభిప్రాయము. ఈవిధమున వివాహము కేవలము పూజ్యమును విడనాడరానిదియు నగు కర్మమని స్ఫుటపడును. గృహస్థాశ్రమమున మానవసేవ చక్కఁగా జరపవలెననుట ప్రధానోద్దేశము.

చంద్ర:— అవివాహితుఁడై ప్రజాసేవచేసిన నేటికంగీకరింపఁ గూడదు?

యశో:—పుత్రోత్పత్తియో?

చంద్ర:—పుత్రోత్పత్తి యొనరించి పున్నామనరకమునుండి తప్పించుకొనవలసినదే. కాని నాలుగాశ్రమములును సమానముగా శ్రేష్ఠములు. అట్లగుట బ్రహ్మచర్యముననే నిల్చి కాలము గడపుటయుఁ దప్పుగాదు.

యశో:—కాదు. కాని కరుణామయుఁడగు భగవంతుఁడీ ప్రపంచము ను సృష్టించియున్నాఁడు. ఇప్పటికీ ప్రపంచము వృద్ధిదశనే యున్నది. ఒకవేళఁ బ్రపంచములోనివారందఱు వివాహము లు మానుకొనినఁ గొంతకాలమునకయ్యది నిలిచిపోవును. అప్పుడీశ్వరుని కోరికకు మనము ప్రతికూలముగ నడచినవా రమగుదుము.

చంద్ర:—ప్రపంచాభివృద్ధియో తన్నాశమో నాయొక్కనితలనే నిలుచునదికాదు. ఒకవేళ నందఱును వివాహములుమాని ప్రపంచమంతయు నిర్మనుష్యమైన నంతటితో వచ్చెడిలోప మేమున్నది? సోమసూర్యమండలములందును ననంతకోటి నక్షత్రమండలములందును జనులున్నారా? భూతప్రపంచము నిలిచిపోయినను విశ్వమునకొక లోపమురాదు.

యశో:—అదియు నొకపక్షముగనే యున్నది. కాని యాశ్రమము లన్నిఁటిలో బ్రహ్మచర్యము కష్టతమమైనది. సాంతముగ దా నిని దృఢదీక్షతో ననుష్ఠించినవారరిది. విశ్వామిత్రపరాశరా దులే నిదర్శనము. మఱియెచ్చటనేని బ్రహ్మచర్యముగోరి పైవైచుకొనినవారిఁ గంటిమా?

చంద్ర:—అట్లేటికమ్మా! చంద్రవంశోద్భవులగు రాజన్యుల కెల్లఁ దలకట్టై కురువంశాభరణమగు మహాత్ముఁడు భీష్ముఁడు బ్రహ్మచారిగదా? అంబాదేవియు వేదవతియు బ్రహ్మచా రిణులుగదా? ఇట్టివారెందరైన నుందురు.

యశో:—నాయనా! యాయర్థన విషయము వేఱు. కేవలము శపథ ము నెపమునఁ దండ్రికోరిక పండింపఁదలఁచి యమ్మహాను భావుఁడట్లుచేసెను. అంబాదేవియు వేదవతియు నొరులపైఁ

గల యార్యులచే నట్లయిరి. బ్రహ్మచర్యమును వలచివలచి పైపై చుకొనినవారు లేరు.

చంద్ర:—లేకపోవచ్చును. కాని యమ్మా! వివాహములవలన నరులు లేనిపోనికష్టములఁ దగులుకొందురు. ప్రపంచము నొక్కమాఱు తదేకదృష్టితోఁ జూతుమేని

తే॥గీ॥ కాంత మంచిగుణంబులు • గలిగియున్నఁ
బరమదుర్మార్గుఁడగుచుఁ దత్ప • తియొసంగు;
మగఁడు మంచివాఁడగుచోట • మగువమంచి
గానముగలదాచు ధర నొసఁ • గూడుటరిది.

విపరీతగుణములుగల స్త్రీపురుషులమైత్రి యెప్పటికిని సుఖావహము గాఁ జాలదు.

యశో:—నీవు చెప్పినదిసత్యము. తెలిసినంతవఱకు రూపవతిగను సూక్ష్మమతిగను గుణవతిగను సౌభాగ్యవతిగను నుండు నుత్తమ కన్యనే విచారింతము. అట్టికన్యలభించిన నొప్పుకొందువా?

చంద్ర:—ఎట్లొప్పుకొందును? నాకుఁ దెలిసినంతలో స్త్రీలలో గుణవతులుండుట యసంభవము. ఆసందేహమే నన్నింతదూరము బాధించుచున్నది.

యశో:—నాయనా! యట్లనరాదు. ప్రపంచమున నొక్కస్త్రీజాతి యంతయు దుష్టమై పురుషజాతియంతయు శ్రేష్ఠమై యుండలేదు. స్త్రీలు స్వాభావికముగాఁ గోమలశరీరలు. అతికోమలవర్తనలు. వారలయెడ దయాదాక్షిణ్యాది మహాగుణములుమెండు. ప్రాణమునకన్న మానమెక్కుడనియెంచి ప్రాణమును దృణప్రాయముగఁజూచి త్యజించి త్యజింపఁగల నారీమణులెందరేనిఁ గలరు. పరుండని సూర్యునైనఁ గననొల్లని

యమూర్ఖంపశ్యలీలోకమున నున్నారన నీవేదియో భ్రాం
తితో స్త్రీజాతిని దూషించుట భావ్యముగాదు.

చంద్రి:—అమ్మా! నీమ్రోలఁ బెక్కుమాటలాడఁజాల. కాని స్త్రీ
లయెడ నాకునమ్మకముకుదురకున్నది.

సీ॥ అడుగిడఁ బాదంబు ♦ లవియునోయనఁగ మం
దమరాళరాజయా ♦ నముల నడచి
పల్లెత్తుమాటైనఁ ♦ బలుకలేదీచాన
యన మెలమెల్ల మా ♦ టాడుచుండి
కన్నెత్తి పెరవారిఁ ♦ గననోపదీకాంత
యనఁగ నెల్లప్పుడా ♦ స్యంబువంచి
కడపదాటఁగఁ గాలు ♦ గదలింపఁజాలదీ
చెలియనలోనె వ ♦ సించుచుండి

తే॥గీ॥ వలపు వడెనేని బహుళదు ♦ ర్వారధైర్య
మున జలధులేమదాఁటి య ♦ వ్వలకుఁబోదు
రట్టి మోసగత్తెలఁ గూడు ♦ నధమనరుని
రంప చెడు రాయిపోఁకిన ♦ కుండకరణి.

అంతయేటికి? మనస్సులలోఁబుట్టు సంకల్పములు పుట్టినవిపు
ట్టినట్లచ్చొత్తి కనఁబఱుపఁజాలు నవరూపపు యంత్రములు
లభించిన నొక్కొక్క కాంతతల కొక్కొక్క యంత్రమును
గట్టియుంచిన నూటికి నూఱు పాళ్ళను స్త్రీలమానసముల
నెట్టిదుస్సంకల్పములుదయించుచుండునో తెలిసికొన వీలుం
డును. "నాయంతకుమాత్రము స్త్రీలఁజూచిన నొడలెల్ల
దహించుకొని పోవుచుండును.

యశో:—కుమారా! మనస్సులోనియుడుకు నోకించుకతగ్గించుకొని మాటాడుము.

జయ:—యశోవతీ! యింకఁజాలింపుము. వానిమనస్సు సందేహాపరంపరలు గ్రమ్ముకొని మంచికిఁజోటీయకున్నది. వాఁడిప్పాడాడినమాటలు క్షమార్హములుగావు. నీవు స్త్రీజాతికి జేరినయొక ప్రాణివనికూడవాఁడు మఱచియున్నాఁడు. వానినిందావాక్యములు నీకుమాత్రమెట్లు సోఁకకపోవును? ఇఁకనీవు సంభాషింపకుము. నాయానగలదు.

యశో:—(చిఱునవ్వుతో)వాఁడు మౌర్ఖ్యమూనియున్న మనము కోపింపవచ్చునా? అతనిహృదయమునునేను గ్రహించుచుంటిని కాని తెలిసితెలియక వాఁడాడినమాటలకై నాకుఁగోపము గలుగలేదు. (చంద్రసేనునిదిక్కై) నాయనా! చక్కఁగానాలోచించుకొనుము. నీమనస్సుతిరిగినప్పుడే తెలుపుము.

చంద్ర:—(స్వ)హాదైవమా! నేను ఘోరపాతకమొనరించితిని. కఠినములేగాక నిందాభూయిష్ఠములగు పలుకులుపలికి కోమలచిత్తయగు నాతల్లిని మిక్కిలినొప్పిపెట్టితిని. (నమస్కరించి)జననీ! నేనపరాధిని. వాదమునిలుపుకొనవలెనని యాతురమున నల్పబుద్ధినై నీమోలఁ బలుకరానిమాటలు పలికితిని. నేనెంతటి కఠినశిక్షకైనఁ బాత్రుఁడ.

యశో:—బిడ్డా! తొందరతో నీవాడినమాటలకునాకావంతయుఁగోపములేదు. పశ్చాత్తప్తహృదయుఁడవగునీవెవ్వరికైనక్షంతవ్యుఁడవు.

జయ:—కుమారా! చింతింపకుము. లెమ్ము.

చంద్ర:—అయ్యో! మతిలేకయట్లాడితినేకాక నాతండ్రిని నిన్నును గన్నవారుస్త్రీలు. నన్నుఁగన్ననీవు స్త్రీవి. సృష్టిప్రారంభము నుండి నేటివఱకు సర్వము సర్వము స్త్రీపురుషమయము.

తండ్రీ! నాకన్నులకుఁగట్టిన గాఢాంధకారము తొలఁగినది. నాహృదయమున జ్ఞానదీపమును వెలయించితివి. నేనిదేపయ నించి యొకకన్యను స్వయముగఁజూచివచ్చి మీయిరువుర సమ్మతిఁబడసి పరిణయమయ్యెద. నన్ను మన్నింపుము.

యశో:—చంద్రసేనా! యట్లేచేయుదువులెమ్ము. ప్రొద్దైనది. భోజనమొనరింతువురమ్ము.

ప్రథమరంగము.

ద్వితీయరంగము. సోమపురోద్యానము.

చంద్రసేనుఁడు ప్రవేశించి

సీ॥ సుకుమారగుణము హె ♦ చ్చుగనున్నకామినీ
మణులందు ధైర్యాది ♦ గుణములరిది
ధైర్యాదిగుణము లెం ♦ తయుఁగల్గుచెలులయం
దతికమ్రమైన యొ ♦ య్యారమరిది
యొయ్యారమున్న మ ♦ హోత్పలాక్షులయందుఁ
జిత్తమ్ముఁగరఁచు సౌ ♦ శీల్యమరిది
సౌశీల్యమలరు నా ♦ సతులందనన్యసా
ధారణంబయిన సౌం ♦ దర్యమరిది
తే॥గీ॥ పరమసౌందర్య ధన్యలై ♦ వఱలునట్టి
వెలఁదులందున నిశ్చల ♦ ప్రేమమరిది
యొక్కగుణముండుచోట నొం ♦ డొక్కటుండ
దకట! యెటులేర్పఱింతుఁగ ♦ న్యకను నేను?

భరతఖండమున నెన్ని దేశము లన్నియుఁజూచితి. దర్శింపఁదగ్గ రాజకన్యల నెందఱనోచూచితి. ఒక్కగుణమున్న నొండొక గుణముండదు. ఇంతకును గుణవతియు రూపవతియు నగు

## ప్రథమాంకము.

కాంత పురుషునియదృష్టమువలన లభింపవలసిన దేకాని యితరముకాదు. ఎవ్వతెయోయొకకన్యనుజూచి నిశ్చయించియుండునని నాతలిదండ్రులుత్సుకతతో వేచియుందురు. వారికాశాభంగముగలిగింపవలెనన్న నాకుఁజింతాకరముగానున్నది. ఏమిచేయవచ్చును? ఈపర్యటనమునమిక్కిలి యలసటగలిగినది. ఇచ్చటనీయారామమెంతయు మనోహరముగనున్నది.

చ॥ అలలుగఁగూడి మందమగు ♦ యానములన్ మునుమున్నసాఁగి శీ
తలమయిమేనికిన్ గలుగు ♦ తాపముదీర్చి యమోఘసౌఖ్యమున్
గొలిపి ప్రపంచమున్ మఱచి ♦ కూరుకునొందఁగఁ జేయఁజాలు నీ
మలయసమీరపోత సుకు ♦ మారపరంపర లెట్టివారికిన్.

ఈరసాలవృక్షముకడ నొకించుక సేపు విశ్రమించెద. (పరుండును.)

ప్రవేశము. చతురిక.

ఉ॥ ఈవనసీమలోఁబురుషు ♦ లెవ్వరునుండఁగఁగూడ దన్న నెం
దే వెడలంగఁబోలు; నిటు ♦ లేటికటన్నను మావయస్య ప
ద్మావతి తో ప్రవనైన మగ ♦ మానిసిఁజూచిన నుంతయోర్వఁగాఁ
బోవదు; పూరుషాకృతిని ♦ బొల్చెడుచిత్రముఁ జూడ దెన్నఁడున్.

ప్రవేశము. పద్మావతి-కీరవాణి.

పద్మా:— తే॥గీ॥ పుష్పరాజంబులగు మల్లె ♦ పూలచేత
భువనమోహనమైన పూఁ ♦ బొదలచేతఁ
బొదలపైఁ రొదలిచ్చు తు ♦ మ్మెదలచేత
నీవనంబందగించు రా ♦ కేందువదన!

చెలులారా! యుద్యానముఁ బ్రవేశించినంతనే నాయెడమ కన్నదరుచున్నది.

చతు:— నేఁడునీకుఁదగినవరుఁడు లభించునేమో?

కీర:— ఇది మిక్కిలిశుభసూచనము.

పద్మా:—చెల్లులారా! మీయొగతాళిమాటలు చాలింపుఁడు.

చతు:—చాలించి మనమిపుడు చేయవలసిన ముఖ్యకార్యమేమున్నది?

పద్మా:—మనముకోసి తెచ్చిన మల్లియలు హారములుగఁ గట్టుదము.

కీర:—అట్లు చేయుదము. మల్లికాహారములు మౌక్తికహారములఁ దృణీకరించుచుండును.

పద్మా:—అవును. ముత్తియపుసరములు కాంతి కేకాని యనన్యసాధారణమగు మార్దవమును ధావళ్యమును బుగులుకొనివచ్చు సువాసనయు మల్లికాహారముల కగ్రగణ్యత్వము నొసంగును.

చతు:—ఈదండలమధ్యభాగము నలంకరించుటకుఁ గెందామరలున్న బాగుండును.

కీర:—సరోవరమున కేగి తెచ్చెదను. (వెళ్లి తెచ్చుచున్నది.)

చతు:—సఖీ! యీపద్మంబులఁ దిలకింపుము. కోమలమగు రక్తిమ గలిగి శతసంఖ్యదళములచేఁ గొమరుమిగిలి మనోహరవలయాకారంబునఁ బువ్వులదొరసానులన వన్నెకెక్కియున్నవి.

పద్మా:—నాహారమిప్పుడే పూర్తియగుచున్నది. కమలమునుగూడఁ బొందించుచున్నాను. మౌక్తికపుహారమునందలి రత్నపతకము వలె నీకెందమ్మి యెంతసొగసుగ నిమిడియున్నదో చూడుఁడు.

చతు:—నాహారముగూడ సిద్ధమైనది.

కీర:—మీరిరువురు నేర్పరులు. నాహారమిప్పుడు పూర్తియగుచున్నది.

చతు:—వీని నేమి సేయుదము?

పద్మా:—నాహారము నీసహకారశాఖకిఁ దగిలించుచున్నాను. (వేయుచున్నది.)

చతు:—నేనీసహకారము నాశ్లేషించిన మాలతీలతకర్పించెద. (వేయుచున్నది.)

కీర:—మీయిరువురహారములచే నలంకరింపఁబడిన మాలతీసహకారములు క్రొత్తగాఁ బెండ్లియయిన వధూవరులవలె శోభిల్లు

చున్నవి. ఇఁక నాహారము నేమి సేయుదును?

చతు:—ఈపొదరింటివాకిట వ్రేలాడ వేయుము. అప్పుడీపొద పచ్చ తోరణముగట్టిన కల్యాణగృహమువలె నందగించును.

కీర:—అట్లేటికి?, నీహారము మాలతిమెడను వైచితివి. నాహారమును బద్మినికిచ్చెదను.

చతు:—సరోవరమున వేయుదువా యేమి?

కీర:—లేదు. నిజమైనపద్మిని కొసంగెద. ఇదిగో మనప్రాణసఖి పద్మా:

చతు:—అట్లయిన నయ్యది మిక్కిలిరాణించును.

పద్మా:—పాపమింతసేపు కష్టపడి కట్టితివి. నీవుంచుకొనుము.

కీర:—నేను నీకొఱకేకట్టితిని. ఈహారమునకన్న నాకు నీవే యెక్కు-డు. (వేయుచున్నది.)

చతు:—పద్మావతీ! మనకీరవాణియొసంగిన హారముధరించి, నీవు మాలతిని ధిక్కరించి క్రొత్తపెండ్లికూఁతురువలె రాణించుచున్నావు.

కీర:—అవును. నాకునట్లె తోఁచినది. కాని యీమె యేమనుకొనునో యని తెలుపమానితిని.

చతు:—ఏమనుకొనును? ఎన్నాళ్లుకన్యయైయుండును? ఇప్పటికే యీమెకుఁ దగినవరునిఁ దేవలయునని యీమెతండ్రిగారు తొందరపడుచున్నారు.

పద్మా:—(నిట్టూర్పుతో) చతురికా! యేటికిప్పుడామాటలు? వివాహవిషయమై నాకుఁగలయభిప్రాయము నెన్నిమాఱులో మీకుఁ దెలిపియుంటిని.

కీర:—తెలిపియుంటివికాని యట్లే నిర్ణయించుకొందువా?

పద్మా:—ఇప్పటికట్లే చేసినట్లే.

చతు:—మగవారియెడ నేవేని గొన్ని లోపములుండవచ్చును. కాని మనముమాత్రము వానినంతగా మనసున నుంచుకొనరాదు.

పద్మా:—నీవుచెప్పినది సమంజసముగలేదు. వివాహమున కేమిప్రధానము?

చతు:—నిష్కలుషమయిన యనురాగము.

పద్మా:—అదియెట్లుకలుగును?

చతు:—గుణములపోలికచేతను బరస్పరసద్భావసద్వర్తనముల చేతను సాధారణముగ మైత్రిజనించును.

పద్మా:—విపరీతగుణవర్తనములు గలవారికిఁ బొత్తు పొసఁగునా?

చతు:—ఎట్లుపొసఁగును? పరస్పరానుకూలగుణవర్తనమే మైత్రికాధారము.

పద్మా:—అది నీవంగీకరింతువేని మగవారికి నాడువారికి భూమ్యాకాశముల కున్నంతదూరము. దక్షిణోత్తర ధ్రువములకున్న మర్యాద. అయ్యో! నమ్మి నమ్మి మగవారిని నమ్మియా యిప్పుడు చెడినదిచాలక యింకనుహీనస్థితికి రావలయును? వారు మనకొనరించిన యపకారములిప్పుడే కాదిఁక, వేయిజన్మములకైన మఱపునకుఁ రావు. విశేషములేటికి? ఒక్కసాధారణాంశమును దెలిపెద నాలకింపుఁడు. విద్య జ్ఞానదాయకముగదా? అది పురుషులకు మేలును స్త్రీలకుఁగీడును నొనరించునా? అమృతమొకనికి దీర్ఘాయువునిచ్చి మఱియొకనికిఁ బ్రాణహానియొనర్చునా? స్త్రీలకు విద్యవలదను పురుషులవృత్తము దీనిఁబట్టి తెలిసికొనవచ్చును.

కీర:—అవును. పురుషులించుకయుదారచిత్తమునఁ బ్రవర్తించియుండిన నుభయపక్షములకును గౌరవావహముగనుండియుండును.

చంద్ర:—(స్వ) ఈమందమారుతప్రసారణమున నేను మైమఱచి

నిదురించితిని. ఒక్కచిత్రము. ఒకానొకకన్య నాతోడవా దించి వివాహితుఁడనగునట్లు నన్నంగీకరింపఁజేసినట్లు స్వప్న ము గలిగినది. సర్వప్రయత్నములు వదలుకొని పురమునకుఁదు రలిపోవుచున్న నాకీస్వప్నముతో నేమి ప్రయోజనము?

చతు:—ఈదిన మొకవింతకథ వినియుంటిని. మీకుఁ దెలిసియుండ వచ్చును.

కీర:—ఏమివింటివి?

చంద్ర:—(స్వ)ఏమిది? కోయిలలయెలుంగులా? కావు.మృదుమధు రవచనములవలె నున్నవి.

చతు:—ఒకరాజకుమారుఁడు వివాహమాడనొల్లక తుదకుఁ దనతల్లి మనస్సునొచ్చునని యెట్లో సమ్మతించి కన్యనుమాత్రము స్వ యముగఁజూచివచ్చి పరిణయమయ్యెదనని బయలుదేరెనఁట.

కీర:—ఇది కేవలము చిత్రముగనున్నది.

చతు:—చిత్రమెట్లగును? మనపద్మావతియు నారాజకుమారునిఁబో లినదేకదా? అతఁడు స్త్రీలయెడ భేదభావమువహించె. ఈమె పురుషులమొగమైనఁజూడదు.

కీర:—ఆరాజకుమారుఁడెవ్వఁడు?

చతు:—మన లలితపురాధీశ్వరుఁడగు జయసింహమహారాజుగారి పుత్రుఁడు.

చంద్ర:—(లేచిచూచి)ఈపొదరింట ముప్వురు బాలికలు సంభాషిం చుచున్నారు. నన్నుఁగూర్చినప్రస్తావముచేయుచున్నారు. నే నిందుండునది వారెఱుఁగరు. ఒకనిమిషమిందుండి యేమేమి మాటాడెదరో వినియెద.

పద్మా:—జయసింహమహారాజుగారికిఁ గుమారుఁడొక్కఁడేకదా?

కీర:—అవునేకపుత్రవిషయము. ఆమహారాజు చాల విచారపడును.

చతు:—వివాహమునకు సమ్మతింపనని గట్టిగాఁ జెప్పినఁ బద్మావతీ దేవి బంధుపుత్రు నొప్పవలదా?

పద్మా:—నీయనుతాపవచనము లట్లుండనిమ్ము. కాని యువరాజు చంద్రసేనునిది తప్పుగాకున్నను కేవలము పొరపాటనిమాత్రమని పించుకొనక పోదు. ఇచ్ఛయున్న వివాహమాడవలయు. లేదా మానవలయు. తల్లియొత్తిడిపై నతఁడేల మెత్తపడవలయును? ఆయన యట్లుచేసియుండఁగూడదని నాకుఁదోఁచుచున్నది.

చంద్ర:—(స్వ) అదిగో స్త్రీలకెప్పుడు నాత్మస్తుతియుఁ బరనిందయు సహజము. ఈబాలిక యప్పుడేనన్నుఁ దప్పుపట్టనారంభించినది. అయిన నీమెవచించు కారణముమాత్ర మంతదుర్బలముగ లేదు. కానిట్టు చూచెద.

చతు:—లోకానుభవమెక్కుడుగాఁగలవారు సమంజసముగుసమాధానమొసంగినప్పుడు కొండికవా రభిప్రాయమును మార్చుకొనుటలోనేమితప్పు? మహారాజ్ఞి సరియైన సమాధానమొసంగియుండును. కుమారుఁడామెసదోబ్ధను శిరసావహించియుండును. నచ్చఁజెప్పిన నీవుమాత్రము భావముమార్చుకొనవా?

చంద్ర:—(స్వ) ఈబాలిక యొకింత యాలోచనాశక్తిగలదిగ నున్నది. సరియైన సమాధానమునొసంగినది.

పద్మా:—నాభావమంతసులభముగ మారునని నేనుదలంపను. ఏటికందువా? మగవారు మగువలపై నారోపించు దోషము లొకటిరెండే. మగువలు మగవారియెడ నిరూపించునవి కోటానుకోట్లు. ఎన్నికయేటికి? ప్రపంచమున నెన్నిదోషములుగల వన్నియుఁబురుషులపైనున్నవి. మచ్చునకొకటిరెండు తెలిపెద.

సీ॥ నరహత్యచేయుట ♦ పరవృత్తిగాఁబూని
ధనముసంపాదించు ♦ మనుజుఁడొకఁడు

లేచినదాది రే ♦ ల్నిదురించువఱ కస
త్యములాడిజీవించు ♦ నధముఁడొకఁడు
ధనకాసులొడ్డి జూ ♦ దములాడి కోల్పోయి
కన్నగాఁడగుచు నొ ♦ క్కరుఁడుబ్రదుకుఁ
బ్రశ్న చెప్పుచుఁబుత్ర ♦ ఫలమిత్తునని బూట
కపువేసమూని యొ ♦ క్కఁడునటించు
తే॥గీ॥ భూతవైద్యుండనని వచ్చి ♦ బొంకునొకఁడు
న్యాయవాదినటంచు న ♦ న్యాయవాది
యగుచు వర్తించునొక్కఁడో ♦ యతివ! పురుష
జాతివలె హీనజాతి యీ ♦ జగతిఁగలదె?

చతు:—పురుషులలో దుర్వర్తనముగలవారు లేరని చెప్పను. కాని యందఱట్టివారుమాత్రముగారు. మనమందఱనిందింపరాదు.

కీర:—అవును. వారిలో నెందఱో మనకు వందనీయులున్నారు.

పద్మా:—ఇప్పుడు మనము మాటాడునది ప్రత్యేకవ్యక్తుల గుఱించి కాదు. జాతిసామాన్యముఁ గూర్చి. ఒకవేళఁ బ్రత్యేకవ్యక్తుల చరిత్రము లెత్తుకొన్నను మహామహులుగఁ బరిగణింపఁబడువారు చేసిన దోసములే కొండంతలైయున్నవి.

సీ॥ పరమవిష్ణ్వంశసం ♦ భవుఁడైన పరశురా
ముండు తల్లినిఁదుద ♦ ముట్టఁజేసె
భీమసేనుఁడు ధర్మ ♦ విదుఁడయ్యుఁ దోఁబుట్టు
వులనునూఱ్వుర నసు ♦ వులకుఁబాపె
సజ్జనుండనెడునా ♦ పాజిహాక్తండ్రితో
సమరంబుచేసి దా ♦ జ్యంబుఁగొనియె
నాగయాజుడ్డీనుఁ ♦ డతిలోభియై రాజ్య
సంపాదనమునకై ♦ జనకుఁజంపెఁ

ఆ|వె|| గంసుఁడొక్కమాఱు ♦ కసుగందులనుబట్టి
క్రూరబుద్ధి యగుచు ♦ గొంతు నఱకెఁ
నతివ! పురుషుకన్న ♦ నటవీస్థలములందు
మెలఁగునట్టి క్రోలు ♦ పులియమేలు.

మాతృహంతకులును బితృహంతకులును భ్రాతృహంతకులును భార్యాహంతకులును శిశుహంతకులును బురుషులలో నున్నారు. ఇంతటి నేరములొనరించిన స్త్రీనొక్కదానినిజూపుఁడు. ఊరక వ్రాతమన చేతిలోనిదని తాళపత్రములనుగంటమును గైకొని యిచ్చకువచ్చినట్లు స్త్రీలనిందించి వ్రాసిరి. కాని యాశాస్త్రపురాణములే స్త్రీలువ్రాసియుండినమగవారి రంగెట్లు బయలుపడియుండునో తెలిసియుండును.

కీర:—నిక్కమువచించిన మనయాఁడువారిలోమాత్ర మసత్ప్రవర్తనము గలవారు లేకపోలేదు.

చతు:—ఎక్కుడుగఁగూడ నుండవచ్చును.

పద్మా:—అవునవును. పురుషులే యేపాపమెఱుంగని శుద్ధబుద్ధావతారమూర్తులు.

సీ|| సీతామహాదేవిఁ ♦ జెఱఁగొనిచనిన రా
వణదైత్యపతి మగ ♦ వాఁడుగాఁడె?
ద్రౌపది గర్వాంధు ♦ డై పట్టినట్టి దు
ష్టుఁడు కీచకుఁడు పూరు ♦ షుండుగాఁడె?
యింద్రాణిపై మోహ ♦ దృష్టి నిగిడ్చిన
నహుషుండు పురుషుండ ♦ వంగరాఁడె?
వీరవతీదేవిఁ ♦ గోర్కి పైఁబడిన లా
ల్దాసు పూరుషుఁడొచుఁ ♦ దనరలేఁడె?
తే|గీ|| యకట! "నౌరోజు" పండుగు ♦ లందు రాజ

పుత్రసీమంతినుల మాన ♦ ములహరించు
వఞ్చకును బూరుషుఁడుగాఁడె? ♦ యకట! పురుషు
లాచరింపని పాపమీ ♦ యవనిఁ గలదె?.

లోకమునవారినందఱ బిడ్డలవలెఁజూచి యేలవలసిన మహాపురుషులకే యిట్టిదౌర్మార్గము పుట్టియుండ నేఁకవిద్యాగంధమావంతయులేక మోఁటుఁదనముపైనైచికొనియున్నస్త్రీలలో నెక్కడనో మహాసముద్రమందలి ద్వీపములవలెనొకరిరువురు సద్వర్తనముగలవారుండిన నద్దానిఁగొండంతచేసి శిలాక్షరమొనరించుట న్యాయమా? నేనుస్త్రీల దుర్వర్తనము సమర్థించుచున్నానని తలఁపఁగూడదు. మగవారు గురిగింజల వలెఁదమతప్పులు తామెఱుంగరనిమాత్రముచెప్పుచున్నాను.

చంద్ర:—(స్వ)వీరుమువ్వురు రూపవతులుగను బుద్ధిశాలినులుగను గనఁబడుచున్నారు. పద్మావతియను బాలిక పురుషులన్న మనసునిండుగ విరోధించునదియైనను నొకించుక యావేగములో మాటాడునేకాని చెప్పెడువిషయములు మాత్రము శ్రద్ధమై వినఁదగియున్నవి.

పద్మా:—మఱియొకటి వినుఁడు. పురుషులెంతహీనముగ గ్రంథములలో వర్ణించియున్న నట్టివారినే యగ్నిసాక్షికముగఁ బెండ్లియై పెండ్లాడిన నిమిషమునుండియు భక్తిసూపు స్త్రీలను వారెట్లు పేళ్ళుపెట్టుచున్నారో చూడుఁడు.

సీ॥ పల్లెత్తుమాటాడ ♦ భయమొందియుండెడు
తోయజానన "వట్టి ♦ దొంగ" యండ్రు
మనసుమర్మములేక ♦ మాట్లాడుచుండెడు
కమలాక్షి "గయ్యాళి ♦ గంప" యండ్రు
ఇంటిలోఁబనిసేసి ♦ యొంటిఁగూర్చుండు సుం

దరి "వంటయింటిపె ♦ ద్దమ్మ" యందు
తచటనే ఝొక్కింత ♦ యటునిటుఁ దిరుగాడు
వాసతి "గంటల ♦ ధాసర" ంద్రు
తే।గీ॥ పొరుగు చెలియొద్దకొకమాటు ♦ పోవునట్టి
యతివ "వేయిండ్లపూజరి" ♦ యంద్రు ముందు
నూయి వెన్కనుగోయియట్ల ♦ చాయయయ్యె
నకట! మగవారి చెల్మి దుః ♦ ఖాకరమ్ము.

ఇది యింటిలోనివిచారము. ఇంతమాత్రమైన వారియడుగులకు మడుఁగులొత్తుచుండవచ్చును. ఇట్టియనన్యగతికలగుస్త్రీలయెడ మగవారెట్లు వర్తించుచున్నారో యెఱుంగుదురా?

సీ॥ రంభలవంటి భా ♦ ర్యలమాని వేశ్యలఁ
గదిసి కాంతలఁగంటఁ ♦ గనని వారు
ద్యూతమాడ ధనంబు ♦ దొరకమి సతులనో
రదిమి సొమ్ములకుఁదా ♦ రాడువారు
తాగుడభ్యాసమై ♦ తద్దయుఁగైపు నె
క్కొనఁగభార్యలఁ బడఁ ♦ గొట్టువారు
"పుట్టింటఁ దెమ్మని సొ ♦ మ్మనువిత్తమ" నియెప్డుఁ
గులకాంతలను గొంతు ♦ నలుపువారు
తే।గీ॥ నింకఁజెప్పఁగరాని యె ♦ న్నెవిధముల
వెన్నవం[illegible] తాంగుల ♦ వెతలఁ బెట్టి
పురుషులకటా! యెమ్ములు ♦ గొఱుకుచుంద
రనయమతివలు గోడుగో ♦ డునను నేడ్వ.

కట్టా! యిట్టి పురుషులమాట యేలతలపెట్టెదరు.

చంద్ర:—ఇవినిక్కమ[illegible] మగవారియెడనున్న లోపములే. లోపములేటికి? తప్పు[illegible] ఇవిపురుషులయెడ విపరీతములుగావు. ఈ

ప్రశ్నము లెదురుగవచ్చి నన్నేయడిగినను సమాధానము చె
ప్పుటకు వీలు లేదు.

కీర:—కొందఱు పురుషులిట్లు చరించుచుందురనుటలో సందేహ
ము లేదు.

చతు:—నరులోకనీతికి లోఁబడవలెను. నీతిలేక చరించిన స్త్రీజాతి
గాని పురుషజాతిగాని గర్హణీయమే.

పద్మా:—ఇప్పుడు నాగరకమని యొకటివచ్చినది. అది తెచ్చిపెట్టిన
మార్పులును విపత్తులును వివరింప సాధ్యముగాదు. చెడువా
డుకలకుఁ బురుషజాతి నిమిషమున లోఁబడుచుండును.

సీ॥ పొగచుట్టగాల్చి యా ♦ పొగచేత దేవుఁడి
చ్చిన మంచిగాలిని ♦ జెఱచుటకును
జనులెల్లనొకటిప్తే ♦ యని చేరి భుజియించి
కులశీలములుమంటఁ ♦ గలుపుటకును
రాత్రులొంటరిగాఁగ ♦ ద్రాక్షారసముగ్రోలి
యొడలెఱుంగక నిద్ర ♦ నొందుటకును
పెద్దమానిసులంచుఁ ♦ బేరొంది పలుమాఱుఁ
జీట్లాడి ధనమువె ♦ చ్చించుటకును
తే॥గీ॥ నివియెగాకింకభూమిలో ♦ నెన్నిగలుగు
నన్నిదుర్వర్తనములూని ♦ యలరుటకును
నొక్కమగజాతికే తగి ♦ యుండుఁగాన
మగువలకు మగవారి న ♦ మ్మంగనగునె?.

ఇంతయేకాదు. శ్రద్ధమైవినుఁడు.

సీ॥ క్రొత్తగా రేవున ♦ కుఱ్ఱబోయివచ్చిన
ముగుదలట్టులు తలల్ ♦ బోడిసేసి
యుల్లికిఁ బైవఁబో ♦ ట్టున్నట్లు చొక్కాయ

షైనఁజొక్కాయలె ♦ న్నేనిఁదాల్చి
తలలపైఁబెద్దగం ♦ పలమూయుచందాన
నాయతంబైన కు ♦ ళ్లాయఁబెట్టి
నటనమాడెడు వార ♦ నారులక్రియఁగాళ్ళ
మడమలదాఁకఁజ ♦ ల్లడములూని
తే॥గీ॥ పీడకెల్లఫుఁ గాళ్ళకు ♦ జోడు దొడిగి
క్రమగత వర్ణాశ్రమాదిధ ♦ ర్మములువదలి
స్వేచ్ఛవర్తించుమగవారి ♦ నెడదయందు
విశ్వసించెడు వారలు ♦ వెఱ్ఱివారు.

చంద్ర:—(స్వ)ఇదియెవ్వరికైనఁగాదనరాదు. మగవారి దుర్వర్తనములచేనాఁడువారికిఁగూడ నెన్నియోబాధలున్నవి. చూడఁజూడనామనస్సున వీరలయెడ నీసువోయి వీరిసంభాషణము నింకను వినవలెనని కుతూహలమగుచున్నది.

చతు:—పద్మావతీ! నీవువచించినది నిక్కము. కాని మనముండునది ప్రపంచము. భిన్నరుచులుండకపోవు. కావునఁ బురుషులును స్త్రీలు నెట్లో సరిపెట్టుకొని కాలము గడపుటమేలు.

పద్మా:—అది వారివారి యిష్టముననుసరించి యుండును. కానిమగవారిట్లు చేసిరని మనము నక్లేచేయుట తప్పు.

సీ॥ మగవారు మనల న ♦ మ్మరటంచుఁబలుసిగ్గు
దిగనాడి యెపుడు ♦ వర్తింపఁదగదు
వారికి మనపైఁగృ ♦ పాదృష్టిలేదంచు
నలవారితోడఁజో ♦ రాటతగదు
పురుషులు మనలనె ♦ ప్పుడుబాధసేతురం
చెంచి కోపంబు వ ♦ హింపఁదగదు
వారలు మనగౌర ♦ వముఁజూడరని యాత్మ

గౌరవంబును వీడ • మేరగాదు

తే॥గీ॥ పురుషులెంతదుర్వృత్తిని • మఱఁగియున్నఁ
బ్రాణములుపోవునపుడైన • నావగింజ
యంత దుర్వర్తనముపొంత • కరుగరాదు
ప్రాణమునకన్నమానమే • భవ్యతరము.

కడకుఁ బ్రాణముపోవునంతటిస్థితికి వచ్చినను స్త్రీలుతమపాతి
వ్రత్యమును గాపాడుకొనవలెను. ఇది పురుషులు మెచ్చుకొ
ని మన చరిత్రములను గ్రంథరూపమునఁ బొగడవలెనని కా
దు. పెండ్లాడినవారు పాతివ్రత్యమును నాడనివారు బ్రహ్మ
చర్యమును దప్పక రక్షించుకొనవలెను.

చతు:—అదిచాల శ్రేష్ఠమైనది. ఎవ్వరైన నామోదింపఁ దగినయ
భిప్రాయము.

చంద్ర:—(స్వ)ఆహా! తొలుదొల్తనీపద్మావతియెడ నించుకవైమన
స్యముండెను. కాని చూడఁజూడ నాకుఁబూజ్యభావము గలు
గుచున్నది. ఒక్కమాఱు వీరినిఁ జూడవలెనని యున్నది.
పోయి దర్శించెద, (నడచును. పద్మావతియుఁ జెలులును ని
లుతురు. చంద్రసేనుఁడు సమీపించి) లతాంగులారా! మీ
సల్లాపముల కడ్డువచ్చితినేమోయని శంకించుచున్నాను.

చతు:—అయ్యా! స్త్రీలున్నచోటికిట్లు మీరురావచ్చునా?

చంద్ర:—కాంతామణీ! కన్యల సందర్శించుటయు వారితోభాషిం
చుటయు మన దేశమునఁ దప్పులుగఁ బరిగణింపఁబడవు.

చతు:—మీదేయూరు?

చంద్ర—లలితపురము.

చతు:—మీపేరు?

చంద్ర:—చంద్రసేనుఁడందురు.

చతు:—(సందేహముతో) జయసింహ మహారాజుగారి....

చంద్ర:—అవును. వారిపుత్రుఁడనే.

పద్మా:—చతురికా! మహారాజుగారిపుత్రుఁడు సమీపించియుండఁ గూరుచుండుమనియైనఁ జెప్పుటకుఁ దెలియలేదా?

చతు:—మన్నింపుము. చెప్పుచున్నాను.

చంద్ర:—అవసరము లేదు. తొందరపడకుఁడు. మీరెవ్వరు?

చతు:—మేమందఱము సఖులము.

చంద్ర:—ఎవ్వరికి?

చతు:—నాకీమెసఖి. ఈమె యామెకు సఖి. ఆమెనాకుసఖి. ముగ్గురముఁ బరస్పరమొకరికొకరము సఖులము.

చంద్ర:—చమత్కారముగఁ బలికితివి. మీనామమధురాక్షరములు విననిత్తురా?

చతు:—నాపేరు చతురిక.

చంద్ర:—తక్కినవారు?

కీర:—నన్నుఁ గీరవాణియందురు.

చంద్ర:—ఆబాలికామణి?

చతు:—ఆమె పద్మావతీదేవి. ఈయూరిపెద్దసెట్టిగారి కూఁతురు.

చంద్ర:—ఈమె వైశ్యకన్యయా?

చతు:—కాదు రాజకన్యయే. మాళవదేశాధీశ్వరుని పుత్రిక. కొన్నియేండ్లకుఁబూర్వ మీామెయు నీమెతలిదండ్రులును గొందఱు బంధువులును బయనముసేయుచు మార్గమున సరయూనదియందొక పడవనెక్కి పోవుతఱిఁ బ్రవాహము పైనుండి వచ్చుటవేఁ గలము బోరగిలఁబడి యందఱు నేటిలోఁబడిరఁట. పద్మావతిమాత్ర మెట్టులో ప్రాణములతో గట్టుచేరినదఁట. చేరిపితరులవియోగమున దుఃఖించుచుండ నామార్గ

మునఁ బోవుచు నీయూరిపెద్దసెట్టిగారీమెనుజూచి యాదరిం
చి వెంటఁబిలిచికొని వచ్చిరఁట. ఈమె జననీజనకులఁగూర్చి
యేమియుఁ దెలియదు. పుట్టువుచే రాజకన్యయై వైశ్యగృ
హమునఁ బెరుఁగుచున్నది.

చంద్ర:—చతురికా! విషాదజనకంబగు మీరాజకన్యచరిత్రము వి
ని చింతిల్లుచున్నాను. ఉత్తమక్షత్రియవంశప్రభవ యగుట
నే యీమెకిన్ని యనర్ఘగుణము లలవడియున్నవి.

చతు:—మిమ్మింతదూరము తెచ్చిన కార్యమేదియో మేమెఱుంగ
వచ్చునా?.

చంద్ర:—దేశసంచారమొనరించి మరలి పురంబునకేగువాఁడనై
యీయుద్యానము నీక్షించివచ్చి విశ్రమించితిని. నేనుమేలు
కొనునప్పటికి మీరిచట మాటాడుచుంటిరి. మిమ్ముఁజూచిపోఁ
దలఁచి యిటువచ్చితిని.

చతు:—మాసంభాషణమున నెన్నిలోపములున్న నుదారబుద్ధితో
మన్నింపవలెను.

చంద్ర:—చతురికా! నేను భేదభావముతోఁ రాలేదు. మీసంభాషణము
నంతయుఁ జక్కఁగా వినియున్నాను. అభిప్రాయభేదములుం
డవచ్చును. నాయంతకేమో స్త్రీలనివఁగేవలము విరుద్ధభావ
మున మెలంగువాఁడను. అందుకేమి? ఎవ్వరితలంపు వారిది.
అదియట్లుండుఁగాక. మీరందఱువివాహితలే కదా?

చతు:—అవును. ముగ్గురము నవివాహితలమే. (కీరవాణిని జూపి)
మాకిరువురకును వరనిశ్చయమయినది. పద్మావతిమాత్రమిం
కను వివాహమున కంగీకరింపలేదు.

చంద్ర:—నేనువిన్నంతలో నీమె సహేతుకముగ మీతోఁజర్చించి
నది. వయస్సునఁ బిన్నదైనను దెలివితేటలుగలదానువలెఁ గనుచు.

మీరందఱు చక్కఁగభాషాణవనోనరించినవారనితలంచెద.

చతు:—మేమందఱ ముక్షరాస్యలమే. మాపద్మావతి ప్రత్యేకశ్ర ద్ధవహించి కావ్యజ్ఞానముగడించి ముగ్ధముగ్ధగఁ బద్యముల ల్లఁ గలదు.

చంద్ర:—కేవలము శ్లాఘనీయము. (స్వ) ఈమెమనోహరమూర్తి నాహృదయమున కమితానందము గూర్చుచున్నది.

ఉ॥ చూచినచో మరల్చఁదన ♦ చూపులఁ నొండొకవైపు నేనునుఁ
జూచినఁ దానునాదెసకుఁ♦జూడ్కి నిగుడ్చుఁలతాంగిమోమునుఁ
జూచిన నిండుభాగ్యమది ♦ సొంపెసలారెడు జాడ తోఁచెఁనా
హా! చపలాయతేక్షణల ♦ కర్థపు సిగ్గొక భూషణంబగుఁ.

(ప్రకా) చతురికా! సమ్మతమేని మీభర్తృదారికతో నొకించుక సేపు మాటాడఁగోరుచున్నాను.

చతు:—పద్మావతీ! వినలేదా?

పద్మా:—సకలకళావిశారదుఁడగు నాయనముందల నేనేమిమాటా డఁగలను?

చంద్ర:—నాయెడ నేజంకును వహింపఁ బనిలేదు. అభేదభావమున వర్తింతము.

పద్మా:—చతురికా! యంగీకరించితి ననుము.

చంద్ర:—సంతోషము.(స్వ) ఆహా! నేనసమానభాగ్యోదయుఁడను.

మ॥ కలకంఠంబుల కాకలీధ్వనుల సిం ♦ గారంబుఁ బోనాడి వీ
నులవిందై యొనతేనిసౌఖ్యభరముఁ ♦ నూల్కొల్పు నీలేమ లేఁ
బలుకుల్ నేవినినంత మ్రోఁగె శ్రవణ ♦ ద్వంద్వంబునఁ నాకు ను
జ్జ్వలచేతోభవపుష్పచాపమధుర ♦ జ్యావల్లికాటంకృతుల్.

ఆహా! యీముగ్ధాశిరోమణి యనురాగతరళములగు తొలిచూపులును మధురాతిమధురములగు తొలిపలుకులును మహేం

ద్రుని త్రైవిష్టపసామ్రాజ్యభోగములనైనఁ దృణీకరింపఁగలి
గియున్నవి. (ప్రకా) కాంతామణీ! యన్నింటికన్న మధురమై
నదేది?

పద్మా:—అవ్యాజము నిష్కలుషము నగు ప్రేమ.

చంద్ర:—ఎన్నికష్టములలోఁ దగుల్కొనినపుడైన నేది మనుష్యుల
ను రంజింపఁజేయును?

పద్మా:—అనుకూలదాంపత్యము.

చంద్ర:—స్త్రీలమానము నెవరు కాపాడవలెను?

పద్మా:—స్త్రీలే కాపాడుకొనవలెను. ఇతరులపై నాధారపడఁగూడదు.

చంద్ర:—స్త్రీలకు భూషణములన్నింటిలో నుత్తమమైన దేది?

పద్మా:—పాతివ్రత్యము.

చంద్ర:—చక్కగాఁ జెప్పితివి. సంతసించితిని.

పద్మా:—మీకడఁ గొన్నియంశములు దెలిసికొనవలెనని యున్నది.

చంద్ర:—అవశ్య మడుగవచ్చును.

పద్మా:—అన్నింటికన్న బలమైన దేది?

చంద్ర:—సత్యము.

పద్మా:—మిక్కిలి సులభమైన దేది?

చంద్ర:—దయ.

పద్మా:—నరున కెప్పుడు మహోత్కృష్టసుఖము గలుగును?

చంద్ర:—స్వధర్మము ననుష్ఠించినపుడును బరోపకారము చేసినప్పు
డును.

పద్మా:—జనులు దేనినిజూచి మిక్కిలిభయపడవలెను?

చంద్ర:—పాపమును జూచి.

పద్మా:—వ్రతములలో శ్రేష్ఠమైన దేది?

చంద్ర:—అహింసావ్రతము.

పద్మా:-ఆనందమైనది.

చతు:-మేమందఱము సంతసించితిమి. దైవజ్ఞులీమెత్రిమంతురా లయి మహారాజపత్నియగునని సెలవిచ్చియున్నారు.

చంద్ర:-ఎట్టియున్నతపదవికైన నర్హురాలే.

మ॥ పులకండంబులమేలమాడి కపురం ♦ బుఱమించి యాతేనెసో నలనిందించి సుధఁఱజయించి బహుళా ♦ నందంబుగల్గించి మీ పలుకుల్ వీనులవిందులై పరఁగె నో ♦ పద్మాస్యలారా! మిముఱ దలఁపఱమానఁ బురంబుచేరినను మి ♦ త్రశ్రేణిలో నుండినఱ.

పద్మా:-(స్వ) అప్పుడే యితఁడు పయనించునేమో.

చంద్ర:-లతాలలితాంగులారా! మీయొద్ద సెలవుగైకొనవలెన న్న నాకు విచారము గలుగుచున్నది. కార్యత్వరచే నీవిష యమై చెప్పుకొనవలసివచ్చినది.

చతు:-అప్పుడే వెళ్ళఁదలఁచితిరా?

చంద్ర:-వెళ్ళకతప్పదు.

చతు:-(ప్రత్యేకము పద్మావతితో) రాజకుమారునకు హారమున ర్పింతమా?

పద్మా:-నీయిష్టము.

చంద్ర:-నేను మిమ్మొడఁబాసివెళ్ళినను నామనసుమాత్రము మీ యెడనే వర్తించుచుండును.

చతు:-మీయెడ నెంతయుఁ గృతజ్ఞలము. పద్మావతి మీకుఁ గు సుమహారము నర్పింపఁదలఁచి యున్నది.

పద్మా:-నేనెప్పుడు చెప్పితినే?

చతు:-అట్లయిన మహారాజకుమారునకు హారమొసంగుట నీకి ష్టముకాదా?

పద్మా:-అవశ్యమిమ్ము. నేనేటికి వలదందును?

చంద్ర:—నవకిసలయకోమలములగు మీహస్తములతో నల్లిచిన్న వస్తువునొసఁగినను మహాభాగ్యమని స్వీకరించి దానిని బ్రాణపదముగఁ జూచుకొనెద.

చతు:—అన్నింటిలో నీవుకూర్చినహారము మిక్కిలియందముగ నున్నది. కావున మహారాజకుమారునకు దానినొసంగుము.

పద్మా:—నీవేయొసంగుము.

చతు:—ఆయన భేదభావము లవమైన లేక మనతోఁగలసిమెలసి వర్తించుచున్నాఁడు. అట్టిచో నీవిట్లాడవచ్చునా? మఱియును నీవుగట్టినహారమును నీవిచ్చుటయే బాగు.

పద్మా:—ఏమోనాకుఁ దెలియదు. (తలవంచుకొని హారమునిచ్చును. చెలులు హర్షధ్వనులొనరింతురు).

చంద్ర:— (తీసికొని) పద్మావతీ! ప్రీతిపూర్వకముగ నీవొసంగిన యీకల్యాణమల్లికాదామమునకు నాహృదయసమీపమునఁ దావొసంగెద. (ధరించుచున్నాఁడు. అప్పుడు చిఱుగాలిచేఁ బైనుండి పుష్పములు రాలును. అవి పద్మావతీచంద్రసేనులపయిఁ బడును.)

చతు:—మహారాజకుమారా!

చ॥ పొలఁతులమిన్నమాచెలియుఁ ♦ బూరుషవర్యుఁడవీవు నెయ్యము
న్నలిపితిరంచు నూవృశులు ♦ సంతసమొందినమాట తెల్పఁగా
వలయునె? గాలితాఁకుడులు ♦ పస్వఁగ నీలతికాంగనాళి మీ
తలలనుబుష్పముల్ గురిసి ♦ తద్దయు మోదముఁజూపుచుండఁగన్.

చంద్ర:—నీయాదరమునకు నేను గృతజ్ఞుఁడనగుచున్నాను. కల్యాణులారా! నాకిఁక సెలవు.

చతు:—దైవానుగ్రహమునఁ బునర్దర్శనభాగ్యము గలుగుఁగాక.

చంద్ర:—నాకు మిక్కిలి యపేక్షణీయము.

చతు:—అందఱము నిలుతుము.

చంద్ర:—మంచిది. నిలువకుఁడు. (నిష్క్రమించును. పద్మావతి చంద్రసేనునివైపు చూచుచుండును.)

చతు:—పద్మావతీ! ఇచ్చటనిలుచుండి చేయునదేమి? ఆదెసఁబారిజాతసుమబృందము లందములై యున్నవి. వానిని గోసికొని యింటికిఁగొనిపోవుదమా?

పద్మా:—చతురికా! నాకేమో....(అనియర్ధోక్తితో నూరకుండును.)

చతు:—నీకేమి? వివాహమును గోరినవరుఁడును లభింతురు.

పద్మా:—చెలీ! నీవుమాటాడకుము. నాకలసట జనించుచున్నది.

కీర:—అట్లయిన నింటికివెళ్ళుదము. కొంచెముసేపు విశ్రమింతువు.

చతు:—పద్మా! నిక్కముగ నీవలసినట్లున్నావు. రేపుమాటాడుకొనవచ్చును. ఇప్పుడింటికి వెళ్ళుదము పద.

పద్మా:—కానిమ్ము. (అందఱునిష్క్రమించుచున్నారు.)

ద్వితీయరంగము.



# పద్మావతీవిజయము.

## ద్వితీయాంకము

—o—

ప్రథమరంగము. జయసింహునిహర్మ్యమున నొకభాగము.

(జయసింహుఁడు-మంత్రివిశారదుఁడు నుందురు.)

జయ:—విశారదా! సెట్టి వచ్చియున్నాఁడా?

విశా:—చిత్తము. త్వరలో నిచ్చటికి రానున్నాఁడు.

జయ:—అతని నెచ్చటఁగలియుదము?

విశా:—ఇయ్యదియే ప్రశస్తమైన స్థలము.

జయ:—పద్మావతి యితనియింటఁ బెరుఁగుచున్నను గులమున రా కన్నియయగుట మనకార్యమున కనుకూలము.

విశా:—కాదామఱి? నిస్సందేహముగా.

సేవకుఁడు:—మహారాజుగారికి దిగ్విజయమగుఁగాక. ఒకసెట్టివచ్చి యున్నాఁడు.

విశా:—ప్రవేశపెట్టుము.

సేవ:—చిత్తము (అనివెళ్ళును.)

వెంగిసెట్టియు వెంకటసెట్టియుఁ బ్రవేశించుచున్నారు.

వెంగి:—దండములు. (వెంకటసెట్టితో) అబ్బే! రాజుగారికి దండ ముపెట్టుకో.

జయ:—కూర్చుండుఁడు. మీకు క్షేమమేకదా?

వెంగి:—[illegible]ఇట్టు[illegible]ము. తమకు తెలని[illegible]ముంది? యాపారాలు [illegible] అవ్తే మానుకోలాక ఆళ్ళే అఘోరిస్తాఉన్నాము [illegible]లకాడ.

విశా:—(స్వ) దండుగు విధింతురని భయపడినాఁడు కాఁబోలు.

జయ:—మీాకేమి లక్ష్మీపుత్రులు.

వెంగి:—ఆలా సెలవిస్తే కష్టం. యాపారమంటే బోసిక్కు. ధరలు మండగించి బారసారా లుడిగినాయి. అప్పుసప్పులియ్యకపోతే అల్లరోళ్ళతో ఱెడద. ఇస్తే రాబట్టుకోవడం కష్టం. నలుగురిదగ్గర నాలుగుదస్కాలు నిలిసిపోతే యాపారస్తుని పనేమిసాఁగుతుంది అంటా. ఏముంది లేండి. ఈకాలాల్లో యాపారాలుసెయ్యాలసిందేలా. ఉగాదిపంచాంగాల్లోసూస్తేనాకురెండు మాఅబ్బిగాణికి మూాడు.

విశా:—ఏమిటివి?

వెంగి:—సెప్పకేం మహాప్రభువులూ! నాకు రెండుకందాయాలు మావానికి మూాడుకందాయాలు సున్నలు.

జయ:—సెట్టిగారికిఁ బిల్లలెందఱో?

వెంగి:—పలినోరిదయత్తో ఏంకొదవలేదండి! (లెక్కించుటనభినయించి) మొత్తముమీాంద యెరశి పుట్టిన్నిద్దుము సంతానం.

జయ:—అనఁగా నెందఱు?

వెంగి:—పుట్టిఅంటే యిరవై. యిద్దుముఅంటే రొండు. యెరశి పుట్టిన్నిద్దుముకు ఇరవైరొండు.

వెంకట:—ఇరసై మూాడు కదూ?

వెంగి:—దేవరపాదాలకాడ, సరిగా సెప్పాల' నేను మనివి జేసుకుంటా. పెద్దెంగిసెట్టి. సిన్నెంగిసెట్టి. నడిపెంగిసెట్టి. బాలెంగిసెట్టి. ఎంతమందైరి?

విశా:—నలుగురు.

వెంగి:—పెదబంగారు. సినబంగారు. నడిపిబంగారు. బాలబంగారు. ఈడికో?

విశా:—ఎనమండ్రు.

వెంగి:—పెదపోలి. సినపోలి. నడిపిపోలి. బాలపోలి. ఇప్పుడో?

విశా:—పండ్రెండుగురు,

వెంగి:—ఈళ్ళంతా మొగోళ్లు. ఇంకఆడోళ్ళను సెలవిస్తా. పెద్దమ్మి. సిన్నమ్మి. నడిపమ్మి. బాలమ్మి. ఈడికో?

విశా:—పదునాలుగురు.

వెంగి:—పెద్దమ్మణ్ణి. సినమ్మణ్ణి. నడిపమ్మణ్ణి. బాలమ్మణ్ణి. ఇప్పుడెందఱు?

విశా:—ఇరువదిమంది. అనఁగా నీవుచెప్పినట్లు పుట్టెడుమంది.

వెంగి:—ఇంగా ఉండేవాళ్లో. పెద్దపెద్దమ్మి. సిన్నసిన్నమ్మి. ఈడికో?

విశా:—ఇరువదిరెండుమంది. ఇక్కడికి సరిపోయినది. ముగిసినదా?

వెంగి:—ఇరవై రొండనేలెక్క ముగిసింది. పిల్లోళ్ళింగా ఉండారు. బాలనడిపమ్మి. నడిపిబాలమ్మి. ఇప్పుడోలెక్కశై.

విశా:—ఇదువదినలుగురు. ఇంకెందఱుగలరు?

వెంగి:—ఇంగాయిట్నే ఆలోసిస్తే ఒకరిద్దరైనా ఉంటారు. ఇంత తొందరగా సెప్పమంటే కష్టంగదా? బాబూ!

జయ:—(స్వ)పద్మావతిపేరు రాలేదు.

విశా:—జ్ఞప్తిచేసికొనుఁడు. ఎందఱుందురో?

వెంగి:—ఇప్పటికింతేలేండి. ఉంటే యింగా ఒకరిద్దరుంటారు. లోగాలెక్కలోకి ఒకరిద్దరు జారిపోయింటారు.

విశా:—మీకుఁ బద్మావతియను కూఁతురున్నదా?

వెంగి:—మీకెట్లుతెలుసునో?

విశా:—తెలియదు. ఊరక యడిగితిని.

వెంగి:—తెలివి లేనిపెంకెపిల్ల. దూఁబఱదిండి. ఆమెమాటేంటికి?

విశా:—ఆమె మీపోషణముననే యున్నదికదా?

వెంగి:—ఆ. ఏముండడం లేండి. అదేఉండడ్డం.

జయ:—ఒక ముఖ్యవిషయముగూర్చి మీతో మాటాడవలసియున్నది.

వెంగి:—సిత్తం. ఏంయిసయమో? (వెంకటసెట్టితో) సరీగా కూకో అజ్జే.

వెంకట:—కూకున్నాలే. (అనివెనుకకు జరుగుచున్నాఁడు.)

జయ:—విశారదా! సెట్టిగారికావిషయము నెఱిఁగింపుము.

విశా:—చిత్తము. (అనివెంగిసెట్టితో) ఏమియు లేదు. మీపద్మావతిని మహారాజుగారి కుమారునకొసఁగి వివాహముచేయింపవలెను.

వెంగి:—(భయము నటించుచు) అబ్బో! యెంతమాట! యెంత మాట!

జయ:—పరిహాసముకాదు. సత్యముగ నడుగుచున్నాము. మావాఁడు తొలుత వివాహమాడనొల్లక కట్టకడకెట్టులో సమ్మతించి దేశసంచారమొనరించి తగినకన్యనుగోరుకొందునని చెప్పివెళ్లి యెందును దగినపడుచుఁగానక తుదకు లలితపురమునకువచ్చువాఁడై మార్గమున సోమపురమున మీయుపవనమున విశ్రమించెనఁట. అచట మీపుత్రికనుగాంచి యామెను బెండ్లాడ సమ్మతించియున్నాఁడు. ఆవిషయమును బ్రస్తావించుటకే మిమ్మింతదూరము రావించితిమి.

వెంగి:—తమ్మరిడత్తరువైత్తే యేయిమ్మెక్కైతే మాత్రమేమీఅంటా. వచ్చినందుకు సింతలా. రావాలిసినోళ్ళమే. పోవాలిసినోళ్ళమే. కార్యం సకపడునోలేదో అంటని సింతసేయడమే.

విశా:—భయపడ కేమున్నది? మీరంగీకరించిన క్షణమున నే దైవ జ్ఞులరావించి ముహూర్త నిశ్చయముగావించెదము.

వెంగి:—ఇవాహసందర్భం. ఇంతతొందరైతే యెట్లా?అంటా. అం టే ఒక్కమాట. కులమింటికోతి అని యాడన్నా రాజుల యిండ్లలోనే తగినపడుసును సూసుకోకూడదా?అంటా.

విశా:—పద్మావతియు రాజకన్యయే కదా? అందునను జంద్రసేనుఁ డామెనుదప్ప నితరకన్యలఁ గన్నెత్తియైనఁ జూడఁడు.

వెంగి:—ఇంగేంలా. మాపడుసు బోపెంకెది. మరిసితప్పిఅయినా మొగోళ్ళమొగాన మొద్దులుపెట్టేదికాదు. ఇంటినుంచి బైటి కెల్తే మొగోణిపేరైన సెవన పడకూడదు. అందుకే యీయి సయంలో ఇట్లాఅంటని సెప్పుకోలాకుండాఉన్నా. ఏమంటే పలినోరు ఏమిసెప్పినా యింటారని మనివిసేసుకోవడమే.

విశా:—మీరుచెప్పునది సత్యమే కావచ్చును. ఏమిచేయవలెను. ఏ ట్లో యామెను సమ్మతింపఁ జేయవలెను.

వెంగి:—అదేకుదరనిబారము అంటా. ఆడనే మన బాణాలు సాగంది. ఏంటకి? బండికట్టిస్తా. పలినోరేవచ్చి కొంచెంపలకరిచ్చి సూ డండి. అన్నీమనుసుకొస్తాయి.పిల్లయేమాత్రంమెత్తపడేదికాదు.

విశా:—ఆవిషయమై మీరింతదూర మాలోచింప వలసినది లేదు. మీరంగీకరించినఁ దనకాక్షేపములేదని పద్మావతి తెలిపినదఁ ట. అందులకే మిమ్మింతగ నడుగుచున్నాము. ఏమియు సం శయింపకుఁడు. మహారాజుగారి కుమారుఁడొక యింటివాఁ డైన నదియపద్ధివేలు.

వెంగి:—సంశయేమేంటికి? అట్లాటిమర్యాదలు మనయింట పుట్టనే లా. ఏమిసెయ్యాలనుఅని ఆలోసిస్తావున్నా. మీరుకోరినప్పు డేమిసెప్పడానికి యీలులాకుండాఉంది. ఏమిరా అబ్బే! యెం

కటకట్టా!

విశా:—అతఁడు మీ కేమి కావలెను?

వెంగి:—మాయక్క కొడుకు. మానల్లుఁడుకావాల్ను. యీణిమొగంసూసే నేను నీళ్ళునములుతాఉండేది. దేవున్నెత్తిన పూవు తప్పినా మాలో మానరికాలు తప్పకూడదు.

విశా:—అందులకేమి? మీకుఁ బంగ్రెండుగురు పుత్రికలున్నారు కదా? అతఁడు కోరినదానినిచ్చి వివాహము సేయుఁడు.

వెంగి:—అబ్బో! అట్లయితే యింగనేమి? ఈడు కొంచెంనీళ్ళల్లో మునిగినోడు కాడు. మీరు మహారాజులు. ఇంతదూరంసెప్పేటప్పుడు యినకపోతే మాటకదూ? ఏంసెయ్యాల? మనసు గట్టిసెయ్యాలసిందే.

విశా:—అట్లుచేయుఁడు. ఈసందర్భమున మీకు విశేషలాభముండును.

వెంగి:—లాభమెవరికికావాలనండీ! తమకార్యం కుదిరితే అంతే సాలు.

జయ:—ఏమైనఁ దెలిసికొనఁదగిన విషయములున్న నడుగుఁడు.

వెంగి:—గోత్రిసూత్రాల్లు సూడొద్దండీ?

విశా:—మహారాజుగారిది గాధేయసగోత్రము. మీపడుచుది?.

వెంగి:—మాపడుసుకు మాగోత్రిమే. పెండ్లికులగోత్రిము.

విశా:—సరి. గోత్రములు సరిపోయినట్లే.

వెంగి:—ఇంగేముంది? కట్నాలమాటే.

విశా:—మీకియ్యవలసిన కట్నములన్నియు సమయమునఁ దప్పక యిప్పించెదము.

వెంగి:—ఇవాహము వర్తకాశారప్రకారం మాయింట్లోనే జరగాల. కర్చు వెచ్చములు మీగౌరవానికి తగ్గినట్టుండొద్దండీ!.

జయ:—వివాహమునకుపలసిన సొమ్మంతయు బొక్కసమునుండి మీకుఁబంపెదము.

వెంగి:—ద్రవ్యమేంటికిలెండి.

విశా:—మరేమి కావలయును?

వెంగి:—పెద్దసంబంధం. మీతోపాటుండొద్దూ? మాకు యింకాశ మలు శానానే ఉండాయి. పిల్లను సమూధానపరుసుకోవాల. అ బ్బిగాడింగా కొతుకుతానే ఉండాడు. మాబావగారినొప్పించు కోవాల. ఇంట్లో ఆఁడోళ్ళను సవరిచ్చుకోవాల. మాకట్టాలిం గా ఉంటాయిలేండి.

విశా:—అయిన మీరింతకుఁ గోరునదియేమి?

వెంగి:—ఎక్కువేమిలా. ఇప్పుడుమీరుండేకాడ్కి మమ్మెల్ను తే వాలనని.

విశా:—ఎప్పుడు వియ్యమందితిరో యప్పుడు సమస్థితికి వచ్చినట్లే కదా?

వెంగి:—ఆలాసెలవైతే యెట్లా? ప్రభువులూ! ఇప్పుడంటే యిష్ట పడిన మాటలు. అంటే మాటవరసకుసెప్తా. రేపొద్దున పిల్లకు పిలోణికి అతక్కపాయ. ఇబ్బందిగదండీ?

జయ:—(స్వ) అమంగళము శాంతించుఁగాక.

విశా:—అట్లయిన మీకేమికావలెను? కోరుఁడు.

వెంగి:—యేలినవారేమనుకోకుంటే.

జయ:—నేనెందుల కనుకొందును. అవశ్యముడుగుఁడు. సందేహింప కుఁడు.

వెంగి:—ఎక్కువేంలా. మీరిప్పుడు సేస్రేరాజ్యం నాకిప్పించాలనని.

విశా:—రాజ్యము? ఏమికోర్కియిది!

వెంగి:—అట్లా సిత్తగించకూడదండి. మీరు మహారాజులైకొన్నా

యుచున్నాము. నీవితనిపక్షమున రాజ్యకార్యములఁ జూచుకొ

నుచుండుము.

విశా:—చిత్తము. ఆజ్ఞానుసారము వర్తించెద.

వెంగి:—మీయాముద్రయు రాజదండము నితని వసముసేయండి.

జయ:—మంచిది.

వెంగి:—ఈయాడాదంతా మీరు మీసంసారాలు యీదేశంలో ఉండకూడదు. ఉంటే పజలుమాటయినరు. నగళ్ళల్లోసామ్ము మీరే కొండబోండి. అమ్మణ్ణి పిల్లోడుకూడ మీయెంటనే. మాయింట్లో మొకటిసంవత్సరం అల్లెంగిల్లెంపెట్టే మామూలు లా.

జయ:—సరి. అట్లే చేయుదుము. మేము మగధకు వెళ్ళెదుము.

వెంగి:—మీయిష్టం. సెలవైతే వస్తా.

జయ:—మంచిది. (అందఱునిష్క్రమించుచున్నారు.)

ప్రథమరంగము.

ద్వితీయరంగము. - లలితపురమున సభాభవనము.

విశారదుఁడు ప్రవేశించి.

అకటా! జయసింహామహారాజుగారూరువిడిచిపోయినదిమొదలు రాజ్యమంతయు దీపముదీసిన యింటివలెఁ దేజోహీనమైయున్నది. ధర్మములన్నియు వ్యత్యస్తముగ జరగుచున్నవి. ఉద్యోగులఁ గొందఱఁ దీసివేసియుఁ గొందఱఁ ద్రోసివేసియు నున్నారు. అయ్యో! సింహాసనమునఁ గూర్చుండుటకైన యోగ్యత వలదా? అందులకుఁ దగిన వేషభాషణములు వలదా? బొక్కసములోని ధనము ప్రజోపయోగకార్యముల కుపయోగిం

పఁబడుటయేలేదు. పూజ్యులగు పండితు లాస్థానమునకు వచ్చి నప్పుడు. మాటవైన సరసముగ నాడరాదా? పూర్వమునుండి యుఁ గవులకును బండితులకును న్యాసంగఁబడు సంభావనాదిక ము లడుగంటినవి. బ్రాహ్మణవృత్తులు దేవాదాయములు గూడ నిలుచుట కష్టమైనది. రాజులు నీతివిద్యావిశారదులై యుదారహృదయులయినప్పుడు చేయు మంత్రిత్వము మంత్రి త్వము కాదు. జయసింహమహారాజుగారి యానతి మీఱలేక యుండవలసివచ్చిన దేకాని లేకున్న నెప్పుడో యీమంత్రిత్వ మునకు నీళ్ళువదలియుందును. ఈయుద్యోగము దినగండము నూరేండ్లాయువన్నట్లున్నది.

ప్రవేశము. వెంగిసెట్టి. వెంకటసెట్టి.

(అందఱు లేచి నిలుచుందురు. వెంగిసెట్టిసవికారముగఁ గూర్చుండి) ఇంగ అందఱు కూకోండి. యీయినయాలన్ని పనులకాడ సూపితే బాగుంటుంది. బొక్కసంలోదుడ్డు దుబారాసేయకుం డా మంచిమనుసుతో లాభంమీద కన్నుపెట్టుకొని పనిసేస్తే మేలు. మనుసులో కక్షీఉండకూడదు. అయితే మంత్రీ! యీ పొద్దు యీడకూకోని నేనేంసేయాలను అంటా?

విశా:—ప్రజలకష్టసుఖములువిని న్యాయమును బాలించుట యెవ్వ రైనఁ బూజ్యులువచ్చిన వారల గౌరవించుట యివి దేవరచే యపలసిన పనులు.

వెంగి:—పజలకష్టాలెప్పటికుండేటియేకదూ! యెన్నాళ్ళయినా తీరేటియి కావు: పజలున్నంతవఱకు కష్టాలుంటాయి. తీటి సేకొద్ది కష్టాలే. యింగా కష్టాళే. యింగా కష్టాలే. సుకాలు మనతో సెప్పేదేముందీ? ఏంటికిసెప్తారుఅంటా? పూజ్యులుగా ఉండేవాండ్లు వచ్చినప్పుడు మనము గౌరయించినా వారిడు

పూజ్యులే. గౌరవించకపోయినా పూజ్యులే. ఇంగ ప్రజోప యోగకార్యాలు యోసించాలను అంటే యెవరికుపయోగ మైనకార్యాలను వారే యోసించుకుంటారు. ఇంగ నాకేంప నుంది? అంటా.

విశా:—తండ్రితోఁ గుమారులు విన్నవించుకొనునట్లు ప్రజలు తమ కష్టము తెలినవారితో మొఱపెట్టికొందురు. వారికష్టములు తొలగించిన దేశక్షేమము గలుగును.

వెంగి:—ఈమొఱలన్ని నేను సాయంగా యినాలనా? అన్ని నీవే యిని తోసినమాట సెప్పిపంపరాదా? అంటా.

విశా:—అదిమేలుగాదు. రాజ్యమునకు రాజుస్వతంత్రుఁడు. ఇతరు లెన్నిచెప్పినను మీరు చెప్పినట్లు ప్రజలకుఁ దృప్తి గలుగదు. మీరప్పుడప్పుడు దర్శనమొసంగి మాటాడుచుండినఁ బ్రజల కును మనకునుగల యనురాగ మెక్కుడగును.

వెంగి:—సరే. అయితే ఒక్కమాట. పజలమొఱ యినడానికి తో సినమాటలు సెప్పిపంపడానికి నేనుంటే సాలునంటివే. మఱి యింతజీతం తీసుకుంటూ నీకేంపనుంది-ఈడ అంటా?

విశా:—ఒద్దనిలుచుండి ప్రజలమొఱలను మీకువినిపించుటకు మీ రొసంగు నుత్తరములు వారికిఁ దెలుపుటకు నేనెండవలెను.

వెంగి:—అయితే సరే.

సేవ:—దేవరదర్శనమునకై కవులు వచ్చియున్నారు.

విశా:—ప్రవేశపెట్టుము.

వెంగి:—కవులేంటివి? భూములు గుత్తలకిచ్చేటియా?

విశా:—కాదు. కవిత్వము చెప్పువారు.

వెంగి:—ఓహో! కయిత్వమలా? వాళ్ళతో మన కేంపని.?

ప్రవేశము కవి.

చ॥ అమలినశక్తి ధాత్రిఁగల ♦ ప్రాణుల పుణ్యముపాపమెంచు నా
దిమగణికాగ్రగణ్యుఁడును ♦ దివ్వటి క్రిందటి దీపమౌను రా
జ్యమునను లాభనష్టముల ♦ సంతతరూఢి గణించు నీదుబు
ద్ధిమహిమ మెట్టివారును ను ♦ తింపఁగనేరరు వెంగిభూవరా!

ఏలినవారికి జయమగుఁగాక.

వెంగి:—జయమేంటికయ్యా? లాభమౌగాక అంటని అనాల. ఏం టిదాకాయితం?

కవి:—మంగళశ్లోకము.

వెంగి:—మంగళశోకమో అమంగళశోకమే అట్లుండు. మంత్రీ!

విశా:—చిత్తము.

వెంగి:—యీకయిూశ్వరుఁడు పట్టీ యిస్తాఉన్నాడుకదా. అందులో నియి ఖర్చుపద్దులా అన్ని జమపద్దులా?

విశా:—అందులో నేపద్దులును లేవు. అది యాశీర్వదించియిచ్చెడు పద్యము. అందుకు మనమే కవులకు సన్మానముచేయవలెను.

వెంగి:—సన్మానాలో దుర్మానాలో. మనకేమో అన్నిఖర్చుపద్దు లేగదా అంటా? ఇప్పట్లో వల్లకాదు. ఇంగా బోణీకాలా. రవ్వంతుండమను.

విశా:—స్వామీ! కొంచెము తాళుఁడు.

కవి:—చిత్తము. (ప్రక్కకుఁబోవుచున్నాఁడు.)

వెంగి:—ఇంకేమైనా పనులుండాయా? యియేనా?

విశా:—సీతానగ్రముననందలి రయితులు విన్నపము నంపుకొనియు న్నారు. దేవరను దర్శించుటకై. వారును స్వయముగ వచ్చి యున్నారు.

వెంగి:—ఏంపనికో?

విశా:—ఈవిన్నపము నాలకించిన విశదమగును.

వెంగి:—అయితే నీవుదానిని సదువు. నేనుయిని అవతల సెప్తా.

విశా:—చిత్తము. (చదువుట నభినయించి) లలితపురాధీశ్వరులగు వెంగిమహారాజులసన్నిధి. దేవా! సీతాపురపరిసరమున గుట్టలనడుమ వర్షాకాలమున నీరుచేరుట కవకాశము గలదు. మూడువైపుల గుట్టలున్నవి. నాల్గవవైపు కట్టగట్టించిన సంవత్సరాంతమువఱకు నీరునిలిచి సస్యోపయోగ మొనరించుకొన వీలునిచ్చును. ఏలినవారు దయయుంచి కట్టపోయించిన రయితులమందఱమును మఱువక మిమ్ముఁ దలఁచుకొనుచుండెదము.

| | | |
|---|---|---|
| మాఘశుద్ధవిదియ<br>భానువారము. | } | చి త్తగించవలెను.<br>ఇట్లు,<br>సీతాపురప్రజలు. |

ఈకార్యమునకై రెండులక్షలు ద్రవ్యముపట్టును.

వెంగి:—శానా సొల్పెంలోఉందే. అయితేకట్టపోయిస్తే నాకొచ్చే. లాభమేమి అంటా?

విశా:—కట్టగట్టించినఁ జెఱువగును. ఆచెఱువునీరు పాఱుటచే దాదాపైదారువందల యెకరములు భూమిసాగును. ఎకరమునకు నాల్గురూప్యముల ప్రకారమున నయినను రెండువేలరూప్యములు పన్నువచ్చును.

వెంగి:—వొడ్డీఅయినా గిట్టుపాటుకాదే? ఇప్పుడైదారువందల యెకరాలంటావు, కదా? పనిలోదిగేటాలకు యాభైకో నలభైకో దిగుతాయి. ఒక్కనెల్లవొడ్డీఅయినాగిట్టదు. నాకేమోరొండు లక్షలు అస్సలుగంటు మునిగిపోతుంది? యీయన్ని మొదటికి మోసమొచ్చే యాపారాలు.

విశా:—బీదలు బ్రదుకుదురు. శాశ్వతముగా రెండువేలరూప్యములు పన్నువచ్చును.

వెంగి:—బతకేమి? ఇప్పుడుమాత్రం బతకలా? వాళ్ళకేం? మన ఖజానాఅంతా వాళ్ళసోదీనంసేస్తే ఇంగాబాగాబతుకుతామంటారు. మనకూ దుడ్డుపిగలకనే? యియన్ని కుదరవు. వచ్చిన దోవపట్టుకొని యెళ్ళమను.

విశా:—అట్లుసెలవిచ్చిన నేనేమనఁగలను?

వెంగి:—నీవుసెప్పలాకపోతే వాళ్ళకాగితంమీాంద రాయమంటే రాస్తా. ఇట్లతా.

విశా:—చిత్తము (ఇచ్చును.)

వెంగి:—(తీసికొని వ్రాయుటనభినయించి) నేను శానారాసేవోణ్ణికాదు. "కు" "గ" అంటపెట్టినా. "కు" అంటే కుదరదు. "గ"అంటే గిట్టదు. మనుసుకొచ్చిందీ?

విశా:—చిత్తము.

వెంగి:—ఇంగమీాంద యిట్లాంటివాండ్లువస్తే"కు""గ" అంటరాసి పంపుతావుండు. నాకాడికేంపని? అన్నినీవేసూసుకో. ఇంకఏమైనా ఉండాయా?

విశా:—రాజధానియందలి ప్రజలమనవి యొకటికలదు.

వెంగి:—ఏమనో? నోటిమాటగా సెప్పు.

విశా:—దేశమున నుత్తరప్రత్యుత్తరములు జరుగుట కష్టముగనున్నది. ఇతరదేశములలో నన్యప్రభుత్వమువారు "పోస్టాఫీసులు" పెట్టియున్నారు. మన దేశమునఁగూడ నటివిపెట్టవలెనని ప్రార్థించుచున్నారు.

వెంగి:—ఎన్నిపెట్టాలనని వాండ్లప్రారన అంటా?

విశా:—నూటైనఁ గావలయును. ప్రత్యేకముగ నొకకట్టడము నం

డవలెను.

వెంగి:—ఒక్కొక్కకట్టడమున కెంతపట్టునో?

విశా:—రమారమి రెండువేలుపట్టును.

వెంగి:—ఆడ పనిసేసే టోళ్ళకో?

విశా:—సంవత్సరమున కొకవేయిరూప్యములు పట్టును.

వెంగి:—నూఱుపోష్టాపీసులకు మూడులక్షలుపట్టునే?

విశా:—ఆమాత్రము పట్టవామఱి? పట్టును.

వెంగి:—ఇంతద్రవ్యము దుబారాసేయడం కుదరదు. ఇది కుదిరేప నేకాదు. ఈఆపీసులతో పనేముందిఅంటా? ఉత్తరప్రత్యుత్త రాలు జరక్కపోతే తప్పేముంది? ఉత్తరాలన్ని సదువుకునేది. యీాడిసరకాడికి ఆడిసరకీడికి నడిపించేది. మనకుయాపారాలు మందగించేది. రాసేటప్పుడు కొంతసేపు సదివేటప్పుడు కొంత సేపు ఈజాబులతో యవధినట్టం. యియిలేకుంటే యెవరిపను లువాళ్ళకు కులాసాగా జరుగుతాయి. ఈకాగితానికికూడ "కు" "గి" అంటని పెట్టిపంపుదాం.

విశా:—నాగరకతగలదేశములో 'పోస్టాఫీసు'లుండవలెను. లేనియె డ వానివిలువను మనము లక్షించి నట్లుండదు. ప్రజలింతదూ రము మొఱపెట్టికొన్నందుకుఁ గొన్నియైన నేర్పాటుచేసిన మేలని నివేదించుకొనుచున్నాను. పిదప దేవరయిష్టము.

వెంగి:—ఈమాటట్లుండనీకాని కొన్నిగ్యామాల్లో చిన్నపెట్టెకొక బొక్కపెట్టితాటికికూర్చి కట్టిపెట్టిఉంటారే. అయియేంటియి?

విశా:—ఉత్తరములుచేర్చి పెట్టుట కుపయోగింపఁబడు పెట్టెలు. అందలియుత్తరములు వారమునకొకమాఱు తీయఁబడును.

వెంగి:—అయితే అంతగానీవు సిపార్సుసేసేటప్పుడు ఈఊళ్ళో రొం డుపెట్టెలు పెట్టిస్తాములే. మాబావగారింటికాడ ఒకటి. మా

యింటికాడ ఒకటి. ఆయనజాబులు నాకు. నాజాబులుఆయన
కు ఆడికిసాలు. ఇంగొద్దనేవద్దు. ఇంకనేనుపోవచ్చునా?

విశా:—మఱియొక విజ్ఞాపనముగలదు.

వెంగి:—ఏంటిదో తొందరగాసెప్పు.

విశా:—లలితపురమున నిప్పుడు పురపాలకసంఘము నేర్పాటుచేసి
యున్నారు. వీథులలో దీపములు కాంతిహీనములుగ నున్నవి.
అచ్చటచ్చట విద్యుద్దీపములు పెట్టించవలెనని ప్రజలవిన్నపము.

వెంగి:—ఈయిన్నపము పంపుకొనడేదెవరో?

విశా:—మనపౌరులే.

వెంగి:—ఈళ్ళల్లో వైశ్యులెంతమంది ఉన్నారుఅంటా?

విశా:—వైశ్యులుచాలఁదక్కువ. కొందఱు బ్రాహ్మణులును మఱి
కొంద ఱుద్యోగులును నింకఁగొందఱు రయితులును గలరు.

వెంగి:—అందుకేనేనడిగింది. మాకులమోళ్ళంటే యీలాదుబా
రాపనులుకోరనేకోరరు. దుబారాలంటే నగరమోళ్ళకు ఎదు
రుగోత్రం. ఏట్లాంటి దీపాలుంటేనేం? అందులో యీదుల్లో
దీపాలు. యీదుల్లోదీపాలుంటే ఆడికిపోవడం కూరోవడం. లే
నిపోని మాటలు. పగలుమాటలు పనిసేటు. రాత్రిమాటలు ని
ద్రసేటు. ఏంటికయ్యా! ఉన్నదీపాలే కొన్నితీసేతామాఅంట
యోసిస్తాఉన్నా.

విశా:—ఈవిజ్ఞాపనము నంపుకొన్నవారిలో ననేకులువిద్యావంతులు
ధనవంతులునున్నారు. వారిప్రార్థనము బొత్తిగా నంగీకరిం
పనిచోఁ జాలనొప్పిపడుదురు.

వెంగి:—నొప్పేంటికి? వాళ్ళసొమ్మేంకర్చుయింపని అంటా? మన
డబ్బుపెట్టి దీపాలు దూపాలు నైవేద్దాలు అన్నిపెట్టిస్తే వాం
డ్లకు కులాసాగా ఉంటుందేమో? పోనీ నీకు వాండ్లనుసూస్తే

అంతభయంగాఉంటేరొాండుదీపాలు పెట్టిస్తాములే. మాబావ గారిమేడమీాంద ఒకటి. మామేడమీాంద ఒకటి. రొాండేసాలు. మేడలమీాందకూకుంటే నన్నుఆయన ఆయన్ను నేను సూస్తావుంటే అన్ని సరిపోయినట్టే. ఆడికిసాలు. ఇంగెళ్ళొచ్చునా?

విశా:—కవీశ్వరుఁడున్నాఁడు.

వెంగి:—ఆయన్ను ముగిచ్చుకొని పోదాం. ఏంఅయ్యోరా? నీపట్టీయేదీ?

కవి:—చిత్తము. (ఇచ్చుచున్నాఁడు)

వెంగి:—ఇందులో యేముందో?

కవి:—కల్యాణశ్లోకము. (అనిచదువుచున్నాఁడు)

వెంగి:—అడంగా గోడపెట్టినట్టుంది. దానితప్సీరేంటిఅంటా? మనుసుకొచ్చేటుగా సెప్పు.

కవి:— దేశములోని లాభనష్టముల నూహించెడుపట్ల జనుల పాపపుణ్యములను లెక్కించు చిత్రగుప్తుఁడైనను దేవరకు సాటిగాఁడు. ఇట్టియేలినవారి నెవ్వరైన నుతింపవలెనని భావము.

వెంగి:—ఈకింద రాసిందేంది?

కవి:—నాపేరు.

వెంగి:—ఏందో సదువు సూతాం.

కవి:—ప్రతివాదిభయంకర కాకవిగజ కంఠీరవ శ్రీశారదామూర్త్యాది బహుళ బిరుదాంచిత గగనము భాస్కరకవి.

వెంగి:—ఇంతదూరమేంటికి? యెల్లయ్యో మల్లయ్యో అని కురస పేరుపెట్టుకుంటే భాగుండదూ?

కవి:—అవియున్నియుఁ దమవంటి రాజాస్థానములలో నిచ్చిన బిరుదములు.

వెంగి:—అదిసరేకాని యీాపద్దెంలో ఎన్నియిసగణాలు పెట్టినావు

అంటా?

కవి:—విషాక్షరములు లేవు. తమదయ సంపాదించుకొనవచ్చి మీ మీద విషాక్షరములు ప్రయోగింతునా?

వెంగి:—కయీశ్వరులు యిసగణాలేస్తారని వదంతుండలా? అందు కయి అడుగుతా.

కవి:—అత్యంతాగ్రహముదయించినపుడు పూర్వమునఁ గొందఱు కవు లట్లు ప్రయోగించిరి. ఇప్పుడెవ్వరును బ్రయోగించుటలేదు.

వెంగి:—మీరు కయీశ్వరులు. సావుబతుకులకు రొంటికికర్తలు. ఒక్కమాటడుగుతా. అయితేయిసగణం పెట్టనంటేఅడుగుతా.

కవి:—అట్టిఅనుమానమే వలదు. కోరినదడుగవచ్చును.

వెంగి:—నీవిప్పుడెక్కడికి వచ్చినావు అంటా?

కవి:—దేశసంచారమునకు.

వెంగి:—ఇంట్లోఉండేతప్పుడు యేంపనిసేస్తావు అంటా?

కవి:—గ్రంథములు చదువుట. కవిత్వము వ్రాయుట.

వెంగి:—ఎప్పుడు సదవడంరాయడమేనా? ఇంగేంసింతలుండవు?

కవి:—ఏవయిన నుండనీ. ఎల్లప్పుడు విద్యార్థినయి యుందును.

వెంగి:—మొట్రో! మొట్రో! సిన్నప్పుడొకటిరొండేండ్లు సదువుకోమంటేనే కష్టంగాఉండేదే. యెప్పుడెట్లనయ్యా! సదువుకుంటావు? నేనుసదివేటప్పుడొకటోయెక్కం రాసిచ్చింటె ఒక మాసం ఒప్పసెప్పనేలా. అయ్యవోరుగాడు తొడపాశం పెట్టినాడుకదా కందినసోటు ఆరునెలలకయిన మాసిపోనేలా. అప్పటినుంచి భయపడ్డి బడికిపోతానని యింట్లోసెప్పి తిన్నగా యేటాకటుండేకాలవకాడ తూములోదాంకుండేటోణ్ణి. ఆపాడయ్యోర్వాడికికూడా పిళ్ళోళ్ళనంపేవోడు. నేనుటక్కుసేసి పిళ్ళోళ్ళకుపిరికెడుపిరికెడనపగుగ్గిళ్ళు నోట్లోపోసిపంపేవోణ్ణి. పో

నీనీకుసంవత్సరంపొడుగునాజీవనంఎలాజరుగుతుందీఅంటా?

విశా:—కవులు సాధారణముగ బీదలుగనుందురు.

వెంగి:—నేనుసెప్పబొయ్యేది అదే. కయిత్తమంటే అంతసెబ్బరది లేనేలేదు. దానిలో యిసగణాలుండేది సంసారాలెక్కరానీవు. నీవూరికే కయిత్తంరాయడం మానుకో.

కవి:—మానుకొని నేఁజేయుపనియేమి?

వెంగి:—నీకు రాయను సదవను వస్తాండలా? యాడన్నా లెక్కలురాసుకొని బతుకు.

కవి:—గ్రంథరచన మాకుఁబ్రధానవృత్తి.

వెంగి:—ఏంటి గ్రంథాలయ్యా! గ్రంథాలు గ్రంథాలంటావు. లెక్కలంటే యేమనుకొన్నావు? ఆడమాత్రం గ్రంథాలుండలా? రోజుఒకగ్రంథం. కతామణిఒకగ్రంథం.వారదస్తరాలన్నీగ్రంథాలే. సేయి తిరక్కుండా అన్నిరాసుకోకూడదూ?వర్తకాశారంగాసూస్తే యీటినిమించిన గ్రంథాలేమున్నాయిఅంటా?

కవి:—బుద్ధితోఁబనిసేయువారము. భావనాబలమునఁ బ్రకృతిని వర్ణించుట మాపని.

వెంగి:—అర్తంకానిమాటలు సేప్పాకు. నిజంసెప్తే నీకు కయిత్తమే రాదు. కయిత్తమంటే అందరిమనుసుల్లోదికనుక్కొనిసెప్పాల. పెపంచమంతా తెలిసిసెప్పాల. నీనోట్లో కయిత్తమేఫుట్టింటే యేదీ నా తెలియినిగురించి ఒకపద్యం సెప్పుసూతాం.

కవి:—చిత్తము. విన్నవించుకొనెద. (అనికొంచెమాలోచించి)

తే॥గీ॥ అమరకార్యములందు బృ ♦ హస్పతివలె
శ్రీరఘూత్తముపనుల వ ♦ సిష్ఠునట్టు
లఖిలపారోపకారకా ♦ ర్యములయందు
వెంగిసెట్టియె ధీశాలి ♦ పృథివియందు.

వెంగి:—పో. పో. యేంటికయిత్తమయ్యాయిది? నీదగ్గర కయిత్తం లేనేలేదు. నా కేంకయిత్తం తెల్దనుకొంటివా? నేసెప్తాయినుక యిత్తమంటే యెట్లుండాలెనో.

ఆ॥ వె॥ కాయితంబులేదు ♦ కలముపుడకలేదు
సనుగుసనుగుయెలలు ♦ జ్ఞప్తినుంచి
యాకసొమ్ముసూపి ♦ యాకనడ్డగకిచ్చు
యెంగిసెట్టితెలియి ♦ యెవనికుంది?

యెంగిసెట్టిసాటి యెంగిసెట్టే. ఇట్లుండాల. కయిత్తమంటే యిదికయిత్తం. బువస్పతి వచిట్టు యేంటికయ్యా? యీండ్ల తాతముత్తాతలుకూడ బారసారాలు సూసి యెరగరే. పైనవ చిట్టుకు విస్సామిత్తురునిపోటు. బువస్పతికి సందమామపోటు. ఇట్లాంటోళ్ళనా నాకాడ సెప్పాలిసింది? పోనీ, నీవింతదూర ముసెప్తాఉన్నావుకదా; నిన్నుసూస్తే నాకుదయపుట్టుతావుంది. నీకుసిల్లరంగడిపెట్టిస్తా. బారం జరుపుకుంటావు?

కవి:—మన్నింపవలెను. కీర్తినిగడించుట మాకుఁ బ్రధానోద్దేశము. బేరములు మాకుగిట్టవు.

వెంగి:—మఱి నీకుయశస్సుయిప్పిస్తా నిన్ను మారాజ్యంలో ఉంచుకుంటే నీవల్ల మాకేంలాభండ్డంటుంది అంటా?

విశా:—కవులవలన దేశభాషలున్నతదశకు వచ్చును. ఏరాజ్యమున దేశభాషలున్నతదశనొందునో యారాజ్యములోనివారు నైతికసాంఘిక, స్థితులలో సంతయున్నతదశకు వచ్చినారనుట నిశ్చయము. కావున భాషకెందఱుకవులున్న నంతగౌరవము.

వెంగి:—అట్లనా? నీవుసెప్పింది బోబాగుంది. ఇప్పుడీయనకు కీర్తే కాని ద్రవ్యమంతముఖ్యము కాదంటని సెప్పినావుకదా, ఇంగ నాలుగుబిరుదులు పెట్టుకోమంటని సెలవిస్తా. ఆయన్నే రాస.





కరమ్మని వాటికింద "ఒ" "ఇ" అంటని పెడ్తా. "ఒ"అంటే ఒప్పినాం. "ఇ"అంటే యిచ్చినాం. యియన్నీ పుటాచ్చరాలు. బాగా గుర్తుంసుకో. యీబిరుదులు మోసుకుంటూయీయనసీడనే యెట్నో జీవిస్తాఉండమందాం. ఇంగొకటి. మన దేశములో సదువుకొన్న బాపనోళ్ళనందరిని రమ్మని ఒక్కొకనికి ఒకటి రొండు మూడు బిరుదులిచ్చిపంపుదాం. మనదేశంలో కయీశ్వరులు పండితులు శానామంది ఉన్నట్టుఉంటుంది. మనము అందరిని గౌరయించినట్టు ఉంటుంది. ఇట్లసేస్తే మనకొచ్చిన నష్టమేమి అంటా?

కవి:—వర్షాశనమునుగూర్చి మనవి చేసికొనుచున్నాను.

వెంగి:—అదేకుదరంది. పోనీ, నాలుగుకాకపోతే అయిదుబిరుదులెత్తుకెళ్ళు. దుడ్డుమాటెత్తకూడదు. సిల్లిగవ్వయినా యియ్యపడదు. దుడ్డంటేయేం కొల్లకొచ్చింది?

సీ॥ సిమ్మసీకట్లు యి ♦ చ్చినయాళ లాభమో

కనికమ్మ!యనిలేసి ♦ కండ్లుతెరిసి

కుండలోకలిగున్న ♦ కూడో సంకటియో బ

చ్చింది సానికలోన ♦ సేయికడిగి

యింట యేకోత్తర ♦ యిద్దిగానున్న గం

పల మోసుకొనివచ్చి ♦ బయటసేర్చి

యెన్నిసార్లడిగిన ♦ యెలలు మార్పడకుండ

కానిసామ్మును రొండు ♦ కాన్లుసెప్పి

ఆ॥వె॥ "మంచిసొమ్ము సెడదు ♦ మాయమ్మతోడ"ంచు

తీసి నట్టి దుడ్డు ♦ దీని యిపుడు

పద్యములనుపాడు ♦ బాపలకిచ్చిన

సెప్పనేల? సిప్ప ♦ సేతికొచ్చు.

ఒక్కసంవత్సరం యీసందికిరానేకూడదు. మంత్రిగారి చ్చేకయిత్వములకందరికి అన్నీబిరుదులే. దుడ్డులేనేలా. ఇంగ యీయన్ను పోమ్మను. పోమ్మను.

విశా:—చిత్తము. (కవితో) స్వామీ! యిది సుసమయముకాదు. ఆజ్ఞయయినది. సెలవు పుచ్చుకొనుఁడు.

కవి:—మంచిది. (వెళ్ళుచున్నాఁడు.)

వెంగి:—ఇంగ నేను లేసిపోతా.

విశా:—ఒక్కమనవి.

వెంగి:—అదీ కష్టపద్దేనా?

విశా:—విన్నవించుకొనెద. నేనీయుద్యోగమునఁ బ్రవేశించినప్పుడు నాకు వేతనము పదివేలు వచ్చుచుండెను. పిదప సంవత్సరమునకొక వేయిరూప్యములు హెచ్చు చేయఁబడుచుండెను. ఈసంవత్సరమంతయు నేను పదునాలుగువేలు తీసికొనియున్నాను. నిన్నటితోవత్సరము పూర్తియైనది. ఈదినమునుండి పదునైదువేలు తీసికొనునట్లనుమతింపవలెను.

వెంగి:—ఓహో! ఇదిసొంత బారమే. యేంటిరాజ్యమయ్యా! యిది? యెవరినిసూసినా దుడ్డుతా దుడ్డుతా అనడమేనా? ఒక్కపారి యిందరుసుట్టుకుంటే బండాలానికే మోసమురాదా అంటా? వాళ్ళఅందరిమాట అట్లుండనీకాని ఏమోమంత్రివంటని ఒద్దకూకోనిస్తే గాజకిందికొక్కాల తొగడానికి మొదలుపెట్టినావే? సింహాసనంకాడకూకుంటే వచ్చేయిపొయ్యేయికాయితాలు కలంపుడకలు అన్ని నేవేసూసుకోవాల. నీకిదివరకిచ్చే పద్నాలుగుకొయే లేదండగగాఉంటే ఇంగా ఒకయేయియేంటికి? మాకుబంట్రోతులొద్దు. సైన్యాలొద్దు. మాన్యాలొద్దు. నీవొస్త. ఏంటికిఅంటా? అంతగాలక్కరుంటే మాయెంకటుసెట్టినే

ఊచుకుకటా. వాడేమ్మంత్రిగారుంటాడు. నొకరుగారుంటాడు. జీతముల్లా గీతముల్లా. ఒకాళ యెంతయిస్తేమాత్రం య్యాడపోతుందీఅంటా? సొమ్ముసొమ్ములోకలుస్తుంది. వాడూలాకుంటే నేనేసూసుకుంటా. యీకాలాల్లో యెవరిదివారుసూసుకుంటే నే బాగు. నాకుతెలనిదేముంది? నీవుమాత్రం సేసేదేముందీ అంటా? నేనూ సూసినా. యెన్నాళ్ళుసూసినా నీవు దండగపోతువేశాని లాభంతెలిసినోణివికాదు. నీకు పనేతెల్దు. తాబేదారంటే యెట్లుండాల? మంత్రిగా! అంటని పిలిసేటాలకు ఓ అంటనిపలికి యీపలమీంద ఉండొద్దూ? ఏం అట్లసూస్తావు? ఓహో! మంత్రిగారూ! అంటని పిలసలేదనో? ఆ. ఎంలాకపోయినా యియ్యుండాయి మరియాదలు. కాయితమో కలంపుడకో దగ్గరికొస్తే యెట్లుండాల? కర్చుపద్దులన్నిటికి "తీ" "తో" అంటని రాయాల. "తీ" అంటే తీసేసినాం. "తో" అంటే తోసేసినాం. జమపద్దులొస్తే సొంతంసూసుకోవాల. యెంచిందే పదిమాట్లెంచాల. నూటమాట్లెంచాల. వేయిమాట్లెంచాల. అడనే ఓపిక సూపాలిసింది. గొంతుకోసుకుంటానంటే రాగదమ్మిడీ వదలకూడదు. లెక్కదస్తరంలో కర్చుపద్దు తగలనేకూడదు. యియన్ని సెప్పకూడదు. కులంగుట్టంతా సెప్పి నేనునీకు పనినేర్పాల. నాకూకష్టంగానేఉంది. నిన్నుడన్నిచ్చుకుంటే ఉండేజుట్టుకూడా కొరిగిస్తావు. నీవూరికే సాలిచ్చుకో. నీతోమాకు పనేముందిఅంటా? ఈచణంనుంచి నీవు వొద్దనేవొద్దు. ఇంగలేసిపో. లేసిపో.

విశా:—(లేచి) చిత్తము. నేనొనరించుసేవ మీకేవిధమునను దృప్తికరముగ లేనప్పుడు నేనువిరమించుటయేకర్తవ్యము. సెలవు పుచ్చుకొనుచున్నాను. అనుజ్ఞయిందు.

వెంగి:—పొమ్మంటని అప్పుడే సెప్పిండ్లా? ఇంగాఅనుజ్ఞయేంటికి?

విశా:—మంచిది. (పోవుచు) ఇప్పుడునేను సేవాబంధమునుండి విముక్తుఁడనైతిని. ఆదివిష్ణుఁడు దశావతారములెత్తెనేకాని నేను గూర్చుండినవొకటి లేచినవొకటి దినమునకెన్నియో యవతారములెత్తవలసియుండినది. ఏతప్పునులేక శ్రద్ధతో రాజ్యకార్యముల నరయుచుండినను వేతనముహెచ్చింపుమన్నంత నే నాపైనొక వేయితప్పులమోపి నీకుయోగ్యతయేలేదని నన్నుమంత్రిపదవినుండి విరమింపుమనియె. నాభారమంతయుఁ దీఱినది. ఇప్పుడు నేను స్వతంత్రుఁడనైతిని. నిశ్చింతముగ నింటికివెళ్ళెద. (నిష్క్రమించుచున్నాఁడు.)

వెంగి:—(స్వ)నాపీడపోయింది. పెద్దపద్దుమిగిలింది. నేనేమంత్రిగా ఉంటా. నేనేరాజుగాడుంటా. నాసేతకానిపనిఉందా అంటా?

ప్రవేశము సేనాధిపతి.

మహారాజుగారికి జయమగుఁగాక. మదనసింహుఁడను శత్రుభూపాలుఁడు సర్వసైన్యములతో వచ్చుచున్నాఁడని చారులు వార్తదెచ్చియున్నారు.

వెంగి:—(భయమునభినయించుచుఁ దొందరతో) ఓరి అబ్బే! బావను పిలసకరారా! (వెంకటసెట్టివెళ్ళును. సేనాపతితో) సతిపడనోళ్ళెంతదూరములో ఉన్నారయ్యా?

సేనా:—పదిమైళ్ళదూరమున నున్నారఁట. రేపో మాపో రాజధానిని ముట్టడింపఁగలరఁట.

వెంగి:—బేగిపోయి మంత్రినిపిలసకరావయ్యా!(సేనాధిపతిపోవును.) ఓబావో? ఓబావో? లప్పనరా బావో?

(ప్రవేశము సింగముసెట్టి)

ఏంబావో! తొందరగా రమ్మన్నావు?

**వెంగి:**—యిరోధులు సైన్యాలుకొండోనివచ్చి నారంట. ఇంగేముంది బావో? తొడలువణుకుతా ఉండాయిబావో? అప్పుసప్పులెట్లురావాలబావో? పద్మావతి యెంతసేశబావో!

**సింగం:**—తొందరపడాకు. కొంచెము ఊపిరిపుచ్చుకో. ఆలోసిస్తాం.

**వెంగి:**—రాజ్యంఆళించినప్పుడే ఆలోశనసెడింది బావో! పదేపదే సెప్పలేను. పిళ్ళోళ్ళువగైరాలు నీభారంబావో!

ప్రవేశము విశారదుఁడు.

సేనాధీశునిమూలమున విషయమంతయు నెఱింగితిని. మీరావంతయుఁ జింతింపవలసినదిలేదు. నాశరీరమునఁ బ్రాణవాయువు సంచరించుచుండువఱకు మీరాజ్యమున కేకీడును రాకుండఁ బనిచేసెదను. ఇందులకై వేతనమును గోరను.

**వెంగి:**—నీజీతానికి ఆలోశనసేయాకు. నీమనసు కందామని అట్లన్నా. నీవంటోడు యెన్నియేలు తీసుకుంటేమాత్రం నొప్పేముంది? రాజ్యమంతానీదే తీసుకో. అయితే సరిపడనోళ్ళను రాకుండ సెయ్యడానికి నీశాత అవుతుందా మంత్రీ?

**విశా:**—సంశయములేదు. మీరు సంతసమున నంతిపురికిఁబొండు.

**వెంగి:**—తల్లీ! అమ్మోర్నూ! ఈగండముఁగడిస్తే అంతేసాలు. బావో! పోదాంరా. సరిపడనోళ్ళకు నన్నుకనపరసాకు మంత్రీ!

**విశా:**— లేదులేండు. (అందఱు నిష్క్రమించుచున్నారు.)

ద్వి తీ య రం గ ము.



# పద్మావతీవిజయము.

## తృతీయాంకము

—o—

ప్రథమరంగము. మథురాపురసమీపారణ్యము.

ప్రవేశము పద్మావతీచంద్రసేనులు.

చంద్ర:—ఇప్పటికినామనస్సునందలి భారముతగ్గినది. తలిదండ్రులేగాక నేనును నాతోడ నీవును నలువురమును మామేనత్తగారియింట రెండుమాసములనుండివసించుట నాకంగీకారముగాకుండెడిది. దేవీ!

తే|గీ|| అతిసమీపంపు బాంధవ్య ♦ మలరియున్న
నాత్మగౌరవమెఱుఁగు శౌ ♦ ర్యధనరాశి
ప్రాణములుపోవు విషమదు ♦ ర్దశలనైన
నొరులపంచనుండఁగఁజను ♦ టొప్పుగాదు.

పద్మా:—దేవా! యెంతటివిపత్తులు ఘటిల్లినను బంధుగృహములకేగి వారిపై మనభారమువైచుట భావ్యముగాదనుట మాత్రము సత్యమేకాని యీరెండుమాసములును మీమేనత్తయిందుమతీదేవి నాయెడఁగనఁబఱచిన యాదరణమునుమాత్రమెప్పటికిని మఱువఁజాలను.

చంద్ర:—ఇందుమతీదేవియింట మనస్వగృహమునందుకన్నఁగూరిమియుఁ బేరిమియునెక్కుడనుట నిస్సందేహము. కాని మనము కష్టముచేసి జీవింపఁగలిగినప్పుడేల సోమరులమై కూర్చుం

డవలయును?

తే॥గీ॥ కలదుప్రాయంబు;బలమును ♦ గలదు;విద్య
యంతయోయింతయోగల ♦ దాదరింపఁ
గలవురాజ్యంబు లెటకేనిఁ ♦ గదలిపోయి
కష్టపడి జీవనముసేయఁ ♦ గలముమనము.

పద్మా:—ఏలుటకు రాజ్యములులేకపోవచ్చునుగాని పనిచేసి పొట్ట పోసికొనుట కవకాశములు లేకుండునా? కాని

తే॥గీ॥ నేలనాలుగుచెఱఁగుల ♦ నేలవలయు
నీవు పరులఁగొల్చెదనన్న ♦ నెగులువుట్టు;
గహనరాజ్యమేలఁదగు సిం ♦ గంపుఁగొదమ
యెడ్లవలె నేలదున్నంగ ♦ నేగఁగలదె?

నాథా! దీనికై యొరులననవలసినదిలేదు.

చ॥ నరవర! మందభాగ్యనగు ♦ నన్నువివాహమునగ్రహించి నీ
వురుతరకష్టదుర్దశల ♦ నొందితి వుత్తమభాగ్యలక్షణ
స్ఫురణముగల్గియున్న నృప ♦ పుత్రికనెవ్వతెఁగూడియున్న సా
గరవృతధాత్రినేలుచు న ♦ ఖండసుఖంబును గాంచియుండవే?

ఇట్టివిపరీతవిధమున వివాహమెందైన జరిగినదా? నన్నునీకిచ్చి పాణిగ్రహణమొనరింప సమ్మతించుచు నందులకుఁ బ్రతిఫలముగానొకవత్సరము రాజ్యమిమ్మని యావైశ్యోముత్తఁడడుగుట మఱునాఁడు వివాహమైనంతకు నాకుఁదెలియలేదు. ముహూర్తమున కొకక్షణకాలము ముందు నాకీవిషయము తెలిసియుండుటతటస్థించియున్నను నేనెంతమాత్ర మావిషమవిధానమున కంగీకరించియుండను.

చంద్ర:—ఈవిషయమున నావైశ్యపుంగవుఁడు నాకమితోపకార మొనరించియున్నాఁడు. నేనీసంవత్సరకాలము నొకమంచిత

రుణముగ భావించుచున్నాను. ప్రజాసామాన్యముతోఁ జేరి కలసిమెలసి పనిచేసినప్పుడు వారికష్టసుఖములను స్వీయముగ నెఱుంగవీలుండును. కోమలహృదయవగునో ప్రేయసీ!

చ॥ చెలులుసహస్రమూడిగము ♦ సేయ మహోన్నతరాజహర్మ్యసీ
మల రవిరశ్మి లేని గృహ ♦ మధ్యమమందు గులాబిపూల సె
జ్జల మెలఁగంగలేని నినుఁ ♦ జండమృగోగ్రవనాళికీడ్చి నేఁ
డెలుపఁగరానికష్టములు ♦ దెచ్చితినంచు మదిఁ దలంకెదన్.

పద్మా:—దేవా! జననమాదిగఁ గష్టములుపడిపడినాకలవాటైనది. నీవాగర్భశ్రీమంతుఁడవు. నీవే శ్రమకోర్చినప్పుడు నామాట యేమి?

సీ॥ పారంబులేని యీ ♦ బహుళోగ్రకాంతార
వాటియే యుద్యాన ♦ వాటినాకు
సోఁకినంతటనె గ్రు ♦ చ్చుకొను కంటకములు
శిలలు గులాబిపూ ♦ సెజ్జనాకు
భైరవారావదు ♦ ర్వారభీకరమృగ
వితతులు నెచ్చెలి ♦ పిండునాకు
నతిసారహీనంబు ♦ లగు నాకులలములు
సరసభక్ష్యాదిభో ♦ జ్యములునాకుఁ

తే।గీ॥ గఱకురానేలఁ జరియించి ♦ కష్టపడుట
కలితదేవేంద్రదివ్యభో ♦ గంబు నాకుఁ
బ్రాణనాయక!నీదునె ♦ య్యంబుగలిగి
హృదయమలర నీచెంతవ ♦ ర్తించుకతన.

చంద్ర:—నీసరళహృదయము నిన్నిట్లు పలికించుచున్నది. ఈకఠినగహనమున సంచరించుట నాకే కష్టమనిపించుచుండ నీకెట్లుండునో నేనూహింపఁగలను. కాని మనయుత్సాహమే మ

నకష్టంబుల భారమును దగ్గించును.

పద్మా:—ఆపత్కాలమున ధైర్యము మనకుఁబరమబంధువు.

చంద్ర:—దేవీ! మనమనుసరించివచ్చుచున్నజాడ యింతటికే నిలిచిపోయినది. పురోభాగమున నెట్లునడువవలయునో తోఁపకున్నది.

పద్మా:—ఈశాన్యదిగ్భాగమునుండి యేదియోధ్వని వినవచ్చుచున్నది. ఆధ్వనివచ్చు సవ్వడినేగి యెవ్వరైనఁ గనఁబడిన మార్గము నరయుదము.

చంద్ర:—అంతకన్ననిప్పుడు చేయఁదగ్గది లేదు. (నడచుచున్నాఁడు)

పాడుచు భిల్లకన్య ప్రవేశము.

పద్మా:—దేవా! యీవనమందలి స్వచ్ఛంద నిర్మలవాయుతరంగమువలె నీభిల్లకన్య యెటువచ్చుచున్నదో చూడుము.

చంద్ర:—వీరిజీవితము లోకవిధమున మిక్కిలి ప్రశాంతములు.

తే॥గీ॥ విమలమందానిలమ్మును ♦ బీల్చికొనుచు
వనమునఁజరించుటను దేహ ♦ బలముగలిగి
వేణుగాన మొనర్చుచు ♦ భిల్లసతులు
పటుతరారోగ్యవతులౌచు ♦ వఱలుచుంద్రు.

పద్మా:—బహుకాలము మనుష్యదర్శనములేని కారణముననేమో యాభిల్లాంగన చూడుము చూడ్కిమరల్పక వింతపడి మసల నెట్లుచూచుచున్నదో?

చంద్ర:—అవును. (ముందునకడుగిడి) సోదరీ! మేముమధురాపురమునకై పోవుచు నీయరణ్యమున మార్గముఁగానక విచారించుచున్నాము. నీవీప్రాంతమున నివసించుదానవగుట మాకీవనమునుండి నిర్గమించుదారిచూపి మాకృతజ్ఞతకుఁ బాత్రురాలవుగమ్ము.

# తృతీయాంకము

భిల్ల:—అయ్యా! చాలదూరమున మీరు మార్గము దప్పితిరి. అదిగో వాయవ్యభాగమునఁ గనఁబడు కొండచివరకు సూటిగా నేగిన మధురాపురమచ్చటికొక యరక్రోసుండును. ఈకోమలాంగితో మాత్ర మీమార్గమునఁ బయనించుట సాహసము.

చంద్ర:—ఈమెనడువఁజాలదనికదా నీవువిచారించుచున్నావు?

భిల్ల:—కాదు. ఈయరణ్యమంతయు ఘోరమృగాకులము. కొంత కాలమునుండి యిచ్చట మనుష్యసంచారములేదు. రానురాను మార్గమును దుర్గమమ్మై యుండును. ఈమెను జూచినఁ బట్టణములలో వసించుచు దిరిసెనపుఁబూవువలె మెత్తనిదిగఁగ నఁబడుచున్నది. మధురాపురమున నీదినమే మీకంతకార్యత్వర లేకున్న (నన్నుమన్నింపుఁడు) మీపాదస్పర్శచే మాకుటీరముఁ బునీతముచేసియీరాత్రివిశ్రయించివేకువవెళ్ళవచ్చును.

చంద్ర:—చెల్లెలా!యాడంబరరహితమైన నీయాతిథ్యము మహాభాగ్యమని మేముస్వీకరించియుందుము. కాని యీదినము మధురాపురమెట్లయినఁజేరవలెను. మాయిరువురయొద్ద నాయుధములు గలవు. నిరపాయముగ వెళ్ళఁగలము.

భిల్ల:—అట్లయిన నప్రమత్తులరైచనుఁడు. (నిష్క్రమించును)

చంద్ర:—దేవీ! జాగరూకతతో నడువుము.

పద్మా:—దేవా! నిర్జనారణ్యమున వసించుచు నాగరికతలేని జాతిలోఁజేరినదైన భిల్లకన్య యెంతమర్యాద యెఱుంగునో చూచితివా?

చంద్ర:—అన్నృతమ్మాడు నిష్టములేక యీర్ష్యాదిగుణములకుఁ దావులేక యరణ్యములలోఁ బ్రవహించు సెలయేళ్ళవలె నీయాటవికుల హృదయములు నిష్కలుషములై యుండును. నిక్కముగఁ బట్టణవాసు లిట్టియుదారహృదయములు గలిగియున్న

రాజ్యములన్నియు రామరాజ్యములై యుండును.

పద్మా:— దేవా!

తే॥గీ॥ అంపపొది వీఁపున ధనుస్సు ♦ హస్తమందుఁ
గొండమల్లెల దండలు ♦ కొప్పుపైన
నలర, నాడంబరరహిత ♦ మైన భిల్ల
తరుణివేషంబు లోచనో ♦ త్సవమొనర్చు.

చంద్ర:— దేవీ! సత్యమును గ్రహించితివి.

తే॥గీ॥ "రవలసొమ్ములు పట్టువ ♦ స్త్రములు దెమ్ము
కానిచోఁ గూడు దినమ"ని ♦ కానికోర్కి
గోరి మగలగొంతుగోసుకు ♦ కోమలకన్న
భిల్లకాంతలె మేల్ పది ♦ వేలమాట్లు.

వస్త్రాభరణాదులయెడ మోహము నాగరికస్త్రీ ప్రపంచమున కేకాని మనమైయిచ్చిన నాటవికాంగనలు వానినిగ్రహింపరు. కొండమల్లెలసరములే వారియమూల్యాలంకారములు. ఆరోగ్యమే వారిమహాభాగ్యము.

పద్మా:— మోటుఁదనముపైవైచికొని యుండెడువారైనను వీరినుండి మనము గ్రహింపఁదగిన యంశములు కొన్నిగలవు.

చంద్ర:— కొన్నియేటికి? పెక్కులుగలవు. (దృష్టిమరలించి) చెలీ! మనమార్గమంతకంతకు దుర్గమమగుచున్నది. ఉన్నతగండశిలలడ్డమైనవి. పొదలుదట్టముగ నల్లికొని యున్నవి. నేనుముందు దిగెద. నీవు వెనుకమెల్లఁగ నేదిగినజాడఁబట్టి రమ్ము.

పద్మా:— నాథా! యాయుధము నేనుఅకుము.

చంద్ర:— (దిగుచుదృష్టిసారించి) పులి. పులి. దేవీ! నీవచ్చటేయుండుము. నేనుదీనిని సంహరించి వచ్చెద. పిదప నీవుదిగుదువు. (పోవుచున్నాఁడు.)

పద్మా:—నేనువచ్చి నీకుసాయమయ్యెదను. (మఱియొకఘాతుకమృగమునుజూచి) దేవా! హెచ్చరిక; నేనునొకకౄరసత్వమును వధించుచున్నాను.

చంద్ర:—భద్రము. నిమిషములో వచ్చెదను.

పద్మా:—ఈమృగము నాపైదూఁకనున్నది. దీనిని నాకరవాలమున కెరచేసెద. (నడచును. సింహము పద్మావతియొద్దకు లంఘించి శోకనాడించును.) ఏమి యీయద్భుతవిధము? ఈసింగము నన్నుఁజూచి పైఁబడక నిలిచిపోయినది. తలక్రిందికివాల్చి పుచ్ఛమునాడించుచుఁ బరిచయము సూచించుచున్నది. ఏకీడు సేయనొల్లని దీని నేనెట్లకారణము ఖండింపవలెను. (నిక్కిచ్చూచి) నాథుఁడు వ్యాఘ్రమును గ్రిందవైచియున్నాఁడు. నేనీ పంచాస్యమునువదలి ప్రాణనాయకునొద్దకేగెద. (నడుచును. సింహము వెంటనానుకొని నడుచును. పద్మావతి నిలుచును. సింహము చేతులునాకుచు నిలుచును.) ఈమృగరాజమేటికో గాఢమైత్రిని సూచించుచున్నది. (పరికించిచూచి)అయ్యో! యిదిభవాని. భవానీ!(అని పైఁగాలూనినిలిచి)యెంతకాలమైనది నిన్నుఁజూచి? అశేషభాగ్యములతో నున్న వైభవవేళలఁగదా నేనునీతో నాడుకొనుచుంటిని.

ఆతురముతోఁ బ్రవేశము చంద్రసేనుఁడు.

దేవీ! యేమియీ దృశ్యము? నామనోనేత్రములు నమ్మఁజాలకున్నవి. (సింగము చంద్రసేనునిజూచి గుఱ్ఱుపెట్టును. పద్మావతి తలపై మెల్లఁగాఁదట్టును. సింహమూరకుండును.)

పద్మా:—దేవా! యీహర్యక్షము నాకుఁజిరపరిచితము. బాల్యమున నే దీనితోనాడుకొనుచు నెన్నియో సుఖసాయంతనములు గడపితిని. ఇదియెట్లులో మాదేశమునుండి తప్పించుకొని వ

చ్చినది. నీవువ్యాఘ్రముపై లంఘించినక్షణమున నిది నాపై దుముకనుండినది. కాని కనుమూయునంతలో నాపాదముల చెంతవ్రాలి తోఁకనాడించుచు వినయముచూప నారంభించినది. నేనంత దీనినానవాలు పట్టితిని. దీనిని "భవాని"యనిమేముపిలుచుచుందుము. ఇదిపరమసాధుస్వభావముగల జంతువు. ఇప్పుడేటికో దుడుకుఁదనమొందినది. ఇది పూర్వపరిచితమైతెలివిగల జంతువగుట నాకుశ్రమమును దీనికి మరణమును దప్పినవి.

చంద్ర:—ఏదియెట్లున్నను నీవీసింహముపైఁ గాలూనినిలిచి హర్యక్షరాజవాహనమున దర్శనమొసంగు సాక్షాచ్ఛాంకరీదేవివలె నాకుఁ గనువిందొనరించితివి. దేవీ! పయనముసాగనిత్తము.

పద్మా:—(సింహముఁదట్టి)భవానీ! నీవుపొదలోనికి వెళ్ళుము. మేము వెడలెదము. (సింహముప్రక్కకేగును.) దేవా! మనమీయరణ్యమును దాఁటుచున్నామని తోఁచుచున్నది. తరుబృందములు దట్టముగలేవు. భూభాగము సమమైయున్నది.

చంద్ర:—ఆవైపు చూడుము. మధురాపుర సౌధాగ్రభాగములు రజతగిరిశృంగముల ననుకరించుచున్నవి. పురమునెట్లో చేరితిమి. చేరినపిదప నెచ్చటనిలువవలయునో యేమిసేయవలయునో తోఁపదు.

పద్మా:—అరణ్యముననడచు నీమూఁడుదినములును మనకెట్టి విచారమును లేకుండెడిది.

చంద్ర:—ఇందేదియో దేవాలయమున్నది. చుట్టును బహుశిలాస్తంభఘటితమండప మొకటియున్నది. ప్రక్కనొక జలాశయమున్నది. ప్రేయసీ! యుద్యోగాదుల నరయుటకుముందు మనమువసించుటకు గృహమొకటి కావలెను. ఇచ్చోటు బ

హాజనాకీర్ణము. నీవిందుండుము. నేనుపురమున కేగి యొకగృహము నరసివచ్చి సత్వరముగ నిన్నుఁ బిలిచికొని వెళ్ళెద.

పద్మా:—ఎట్లుసుకరముగనున్న నట్లొనరింపుము. ఉండుమన్న నిందుండెద. లేదా రమ్మన్న వెంటవచ్చెద.

చంద్ర:—ఏటికి? నేనువచ్చినిన్నుఁ దోడ్కొనివెళ్ళెదను.

పద్మా:—త్వరితముగఁ బునర్దర్శన మొసంగవలెను.

చంద్ర:—త్వరలోవచ్చెదను. (వెళ్ళుచున్నాఁడు.)

ప్రవేశము సుందరమ్మ వెంకమ్మ బిందియలతో

వెంక:—కాదమ్మా! సుందరమ్మా! మాకున్నట్లు మీ కేంమడుగులా? తడిబట్టలా? అంట్లా? ఆచారమా? గంటపొద్దుండగనే ప్రొయిరాజబెట్టి అన్నంచేస్తారు. అన్నం చేసి నీళ్ళకువస్తారు. మీపనికి మాపనికి భేదంలేదేమే?

సుంద:—అవును వెంకమ్మగారూ! మీరుపుణ్యంచేసి పుట్టినవాండ్లు. మేము తక్కువకులంలోపుట్టి జ్ఞానంతక్కువవాళ్లం. మీకు మాకు భేదములేకేమమ్మా?

వెంక:—అట్లకాదేలమ్మా! ఒకవేళ పొద్దు గలుగ వంటచేసినా మావారు సంధ్య అనుష్ఠానం తీర్చుకునేటఱకే ఒకఝామైనా అవుసుంది. వంటచల్లార్చుకొని కూర్చోవలసిందే కాని యేంప్రయోజనంచెప్పు. అందుకై సాయంకాలమే నీళ్ళుతీసుకొనిపోయి వంటచేస్తా. అమ్మా సుందరమ్మా! మనమనుకోంకాని యేఊరికుందమ్మా యింతజలసౌకర్యం?

సుంద:—అవునమ్మయ్యా! యీఊరి కంతటికి ఆపుతూఉంది యీ స్వామిపుష్కరిణి. (అనిదిగుచు) వెంకమ్మగారూ! మీరు ముందు నీళ్ళునించుకోండి. మీరుపైకివస్తే పిదప నేను ముంచుకుంటా.

వెంక:—సుందరమ్మా! మొగంముంధఅ అనకూడదుగాని. నీకున్న మర్యాద పరిజ్ఞానం యీకాలాల్లో యేశూద్రవాండ్లకుంది చెప్పుఅమ్మా.

సుంద:—పెద్దచిన్న తారతమ్యము చూడకున్న మాకుకండ్లుకాళ్ళు చల్లగా ఉండొద్దమ్మా?

పద్మా:—అమృతోపమానమైన యీనిర్మలాంబువుల నాదప్పి దీర్చుకొనెద.

వెంక:—అమ్మా! సుందరమ్మా! లక్ష్మీదేవివలె సోపానాలు దిగే ఆమెయెవరే? ఆమెమొగం యెంత కళకళలాడుతూ ఉందో చూడవే.

సుంద:—అవునమ్మా! నేనుఆమెనే చూస్తూన్నాను. కొంచెము తాళండి. ఆమెయిక్కడికేవచ్చుచున్నది.

వెంక:—మాట్లాడించవే తెలుసుకుందాం ఆమెసంగతి.

సుంద:—(పద్మావతితో) ఏఊరుతల్లీ! మీది?

పద్మా:—లలితపురము.

సుంద:—ఆకులమఱుగుపూవువలె యెండకన్నెఱుగక రాజులఅంతఃపురాలలో ఉండవలసిన సుకుమారివిగా కనపడుచున్నావు. ఏపరివారములేక ఒంటరిగవచ్చుట చిత్రముగఉన్నది.

పద్మా:—నీవూహించినట్లు నేను రాజాంగననే. ఈయూర నేదేనివసతి చూచివచ్చెదనని నాభర్త చంద్రసేనుఁడు పురిలోనికరిగియున్నాఁడు. నేనాయన రాకకై వేచియున్నాను.

సుంద:—అమ్మా! నీపేరేమి?

పద్మా:—పద్మావతి యందురు.

సుంద:—తల్లీ! మహారాజులబిడ్డవైనా నీకు గర్వము లేదు. శ్రమమను కొనక నాతో మాట్లాడితివి.

పద్మా:—అమ్మా! పలుకరించిన మాటాడుటలో శ్రమ మేమున్నది?
(నీరు దాగివుచున్నది.)

వెంక:—అమ్మా! సుందరమ్మా! యెంత కమ్మనిమాటలే ఆమెవి?

సుంద:—రాజులయిండ్లల్లో బాగా చదివియుందురు. వెంకమ్మ గారూ! నేనుత్వరగా ఇంటికిపోవలెను.

వెంక:—పోఅమ్మా! నీళ్ళుముంచుకోని. నేను వస్తా.

సుంద:—కానిమ్ము. (నీళ్ళుతీసికొనిపోవుచున్నది.)

వెంక:—పద్మావతమ్మా! యెంతసేపుచూచినా యింకా రవంతసేపు చూతామనిఉందమ్మా నిన్ను.

పద్మా:—అందులకు మీమనసు మంచిదగుటయే కారణము.

వెంక:—ఎంతచల్లనివాండ్లమ్మా! నిన్ను కన్నతల్లితండ్రులు. కడుపు నిండా పదిమందిబిడ్డలను కనుఅమ్మయ్యా. యజమానులు యింటికి వచ్చిఉంటారు. నేనునీళ్ళుతీసుకొని పోతాఅమ్మా!

పద్మా:—అమ్మా! మీరుపూర్వకాలమువారలు. కావుననే మీకెవ్వరినిజూచిన ననురాగము మిక్కుటము.

వెంక:—అమ్మా! నామాటల కేమనుకోకు. నేనువెళ్ళివస్తా. (పోవుచున్నది.)

పద్మా:—(మండపముసమీపమునఁ గూర్చుండి)

చ॥ పురమునసర్వమైనగృహ ♦ ముఁ దగనారసిరాఁగనాప్రియుం
డరిగెను; కాలమెక్కుడుగ ♦ నయ్యెఁ నదేటికో రాకయుండె? నా
సరసిజమిత్రుఁ డస్తగిరి ♦ చాటునకేగుచునున్నవాఁడు; నఁ
మఱచెను; లేకయున్న నను ♦ మానము లేదిటు తామసించునే?

పలుదెఱుంగుల పులుంగుల కలకలారావములు సంధ్యాకాలమును జాటుచున్నవి. నాథుఁ డేటికో యింకనురాకున్నవాఁడు?

ప్రవేశము కళావతి యందలమున

పద్మా:—అందలమెక్కి నావైపునకువచ్చు నీసుందరాంగి యెవ్వతెయైయుండునో?.

కళా:—(దిగిసమీపించి) తల్లీ! పద్మావతీదేవీ! యింతటి యనాదరణమునకు మేముపాత్రులమా? చంద్రసేనుఁడు రాజవీధినేగుతఱి నానాథుఁడుచూచి మంత్రినిబిలిపించి మాటాడి యంతఃపురమునకుఁ బిలిచికొనివచ్చి చూపించెను. నీమామగారు నాపెద్దతాత మనుమఁడగుటఁ జంద్రసేనుఁడు నాకు మేనల్లుఁడగును. నేనతనిక్షేమము లరయునంత నతఁడు నిన్నీ పుష్కరిణి సమీపమున డించివచ్చితిననియె. అంత నేనతని నంతిపురినిలిపి పరివారముతో నందలముఁగొని నీకొఱకై వచ్చితి. నిన్నుఁజూచి సంతసించితి.

పద్మా:—అమ్మా! నీకునునాభర్తకును గల బాంధవ్యమును గూర్చి యెఱుంగనిదాన నగుట నీలోపము తటస్థించినది. అందుకై నేనెంతయుఁ జింతించుచున్నాను. నాకుఁదెలిసియుండిన నేనే వచ్చి సంతోషముతో నినుసందర్శించుకొని యుందును. అకారణము నీకుశ్రమము గలిగించినదాననైతిని.

కళా:—తల్లీ! యట్లు భావింపకుము. చంద్రసేనుఁడైదేండ్లబాలుఁడైనతఱి మేము లలితపురమునకు వచ్చియుంటిమి. ఇప్పటికనేకవత్సరములుగాఁ జూడనికారణమున మావిషయమై చంద్రసేనుఁడుకూడ మఱచియున్నాఁడు. ఇప్పుడేమిమించినది? మిమ్మిరువురఁజూచుటయే నాకుఁ బదివేలు. మాకుదేవుఁడిచ్చినది యారగించి కొన్నాళ్లు మాయొద్దనుండవలెను. పొద్దుపోయినది. అంతఃపురమునకు వెళ్ళుదము.

పద్మా:—పోవుదము. (నిష్క్రమించుచున్నారు.)

ప్రథమరంగము.

ద్వితీయరంగము. కళావతీసౌధమున గది.

పద్మావతియం దుండును.

మ॥ చిఱునవ్వొప్పఁగఁ జంద్రికావిలసిత ♦ శ్రీపూర్ణచంద్రోపమ స్ఫురణన్ మీఱు భవన్మనోహరముఖం ♦ బున్ జూడలేకున్న నీ యరవిందానన యోర్వఁదం చెఱుఁగవో? ♦ యాహా! నిశీథంబు డగ్గఱె; నిం దేటికి రావు? నావెతఁ దొలం ♦ గన్ జేయ విద్దేటికో?

"నీవీ రేయివిశ్రమింప నీగదినలంకరించితి. నీనాథుఁడరుదెంచినంతఁ బిలిచికొనివచ్చెద" నని యారాజపత్ని నన్నిందుడించిచనియె. ఇంకనునీ వేటికో రాకయున్నావు? ఈనిశాసమయమున సభాభవనమున నీకేమిపనియుండును? నేనిందువచ్చుటలో నేమైన ద్రోహముండునా? ఈకళావతీదేవి ప్రథమదర్శనమాది మిక్కిలిప్రీతిపూర్వముగ నన్నరయుచున్నది. ఈమె నాయెడ నేదేనిద్రోహము నేలతలంచును? దేవా? నీసందర్శనమొసఁగి నాయలమటఁ బాపుము.

మ॥ చతురంభోధిపరీతభూతలమహా ♦ సామ్రాజ్యభోగంబుల న్నితృణంబంచుఁ ద్యజింపనేర్తు; నెటనే ♦ నిన్ సర్వసామాన్యదంపతులట్లుండినఁ జాలు; నీచెలిమియే ♦ భాగ్యంబు భోగంబు గా మతిఁ బాటించుచునుందు; దేవ! యిఁకన ♦ స్మద్భాగ్యమెట్లున్నదో

దినత్రయప్రయాణశ్రమముచే నాదేహమలసినది. ఇంచుక విశ్రమించెద. (కమ్రాసనము నందానుకొని కూర్చుచున్నది.)

ప్రవేశము జగన్మోహనుఁడు.

ఆహా! యేమి యీయపూర్వ సౌందర్యవిలసనము? బహుళవిద్యుద్దీపపటలప్రభాసముల్లాసభాసురమగునీగది పాలకడలిమేడ ననుకరింపఁగా నవసౌకుమార్యవిలాసవిభ్రమీధన్యయగు నీభువనమోహిని సాక్షాల్లక్ష్మీదేవిని బోలియున్నది.

సీ॥ చిటులుగాలిసోఁకులఁ ♦ జెదరి ఝుంఝుమ్మని
ముసరు తేంట్లను గేరు ♦ ముంగురులును
దెలివెన్నెలలఁదోఁగి ♦ వెలుఁగు శరత్కాల
పూర్ణచంద్రు హసించు ♦ ముద్దుమోము
గొనబుగాఁగూర్చిక ♦ ట్టిన యందమగు మల్లి
కాహారముల మీఱు ♦ బాహువులును
సుకుమార నాగసూ ♦ చకమనోహరఫుల్ల
పద్మంబులను మించు ♦ పాదములును
తే॥గీ॥ గలిగి యియ్యాసనమునందుఁ ♦ గనులుమూసి
యరనిదుర నొందు నీచాన ♦ యఖిలలోక
మోహనాకృతిఁగనినఁ ద్రి ♦ మూర్తులైనఁ
జిత్తచాంచల్యమునను గ్ర ♦ హించు టరుదె!

ఈయసమానలావణ్యసదన యీరాకా త్రికకరాకాశశాంకవదన మేలుకొనిన హరిణేక్షణముల నపహసించు నీమెవిశాలలోచనములఁజూచి కపురపుఁబలుకులఁబోని ముద్దుపలుకులువిని యానందింపవలెనని నాచిత్తము త్వరపడుచున్నది. పాన్పుదెక్కుడ యికాఁబోలు నీమె నిదురపట్టించినది. కొంచెము తాళి పిదపఁ జూచెద.

పద్మా:—నాథా! నాయపరాధ మేమి? పలరావు? (కనులువిప్పిచూచి లేచి తటాలునవెనుకకుఁజని) ఆహా! నేనుమేలుకొనియున్నానా? నిదురించుచున్నానా? వీఁడెవ్వఁడు? ఇతఁడొంటినిటువచ్చి నిలుచుండుట కేమికారణము? ఇందేదియో మోసమున్నది. నిక్కముగ నేనీదినము వంచింపఁబడితిని.

జగ:—(స్వ) ఆహా! యిప్పుడుకదా యీమెసౌందర్యముసంపూర్ణాన్నత్యము నొందినది.!

వ॥ పాలఁతిబెడంగుకెంపుజిగి ♦ మోవి గనన్ బదిశేలుసేయు; నా
కలువలతేనిమెచ్చని ని ♦ గారపుమో మొకలక్షసేయుఁ; గ
న్నులు పదికోట్లుసేయును; మ ♦ నోజ్ఞవిభీతకురంగనేత్రఁ గ్రొం
దళుకుఁబిసాళిచూపు భువ ♦ నత్రయదిగ్విజయంబు సేసెడున్.

ఇప్పటికి నేనర్ధభాగము కృతకృత్యుఁడ. ఇఁకఁ బలుకరించి ఈమె మృదుమధురభాషణములు వీనులవిందుగవిని సంపూర్ణముగ ధన్యుఁడనయ్యెద. (ప్రకాశము) జగన్మోహినీ! సంభ్రమము నొందకుము.

చ॥ చెలువ! వధూసహస్రములు ♦ సేవలు సేయఁ జిరత్నరత్నసం
కలితవిశాలసౌధములఁ ♦ గమ్మని క్రొత్త గులాబిపూలసె
జ్జల మెల్కఁగంగనేరని కి ♦ సాలయమంజులగాత్రి వెట్లు క్రొ
వ్విలులువసించు రౌద్రవన ♦ భూములలోఁ జరియింపనేర్చితో?

తన్వంగీ! యీగృహము నన్యథాదృష్టిఁ జూడకుము.

పద్మ:—(స్వ) అయ్యో! ద్రోహము స్పష్టముగఁ గనఁబడుచున్నది. నాహృదయేశుఁ డిప్పటికిందు రాలేదు. ఈకళావతి మాబంధువర్గములోనిదిగాదు. నేను మోసపోయితిని. ఇప్పుడు ధైర్యమే నాకు దగ్గఱచుట్టము. కానున్నది కాకమానదు.

జగ:—భువనసుందరీ! దూరపథశ్రమాకలితవై విశ్రయింపనున్న యీయసమయమునవచ్చి నీవిశ్రాంతికి భంగముగలిగించితినని కోపింపకుము. నీచరిత్రమువిని మిక్కిలిచింతించితిని. వేఱుభావమూనక నీకోమల వాగమృతధారలు గురిసి నావీనులకువిందొనరింపుము.

పద్మ:—అన్నా! నేనెట్టివిషమపరిస్థితుల నెట్టియసహాయస్థితి నుంటినో నాకన్న నెక్కుడుగ నీవెఱింగియుండవచ్చును. కానియొంటినున్న నాకడఁ జేరి మాటాడయత్నించుటతప్పు. నీవెవ్వఁడవు?

ఇం దేటికివచ్చితివి?

జగ:—(స్వ) ఆహా! యివి మృదుమధురభాషణములా? అమృతపు సోనలా? వాలారుఁగటాక్షమాలికలా? కలువపూదండలబారులా? తేనియబావియా? పవడంబుడంబు విడంబించు కెమ్మోవియా? ఇప్పటికి నేఁగృతకృత్యుఁడ. మాటాడనవకాశమిచ్చిన తరుణీమణి యెవ్వతెయు నాకులోఁబడకతప్పించుకొనలేదు. కానిమ్ము. (ప్రకాశము) కలవాణీ! సమస్తానుకూలపరిస్థితులును నీమన్ననకై చూపెట్టియున్నవి. కళావతి నీయెడనె అపి నెఱపఁగల యాదరమునకు మేరయుండదు. ఇందుఁగల పరిచారికలందఱు నిన్నుమహారాజ్ఞవలెఁజూచి సేవింప సిద్ధముగ నున్నారు. ఎట్టిదుర్ఘటపదార్థమును గోరినను నిమిషార్థమున నయ్యది నీపాదసమీపమునకు వచ్చియుండును. ఎట్టిబలవచ్ఛాసనము నొనరించిన నాజ్ఞావచనము నీమధురాధరము దాఁటె దాఁటకమున్నే సమకూర్చువారెందఱో నీకనుసన్నలకై వేచి యున్నారు. నానాప్సరోగణము లడుగులకు మడుఁగులిడి సేవింప వైజయంతాగ్రభాగమున సుందరమందారసుమశయ్యలపై మెలంగు శచీదేవివలె నీవిచ్చటఁబరమసంతోషమునఁ గాలము పుచ్చవచ్చును. పుష్పగాత్రీ! నీజాగ్రన్మంగళవిగ్రహసమీపమున నిలిచి భవదీయసుధామధురోక్తులు వీనులారవిని నీకుఁ బ్రత్యుత్తరము నొసంగఁగల మహాభాగ్యమునకుఁ బాత్రుఁడైన యీసామాన్యునిఁగూర్చి తెలిసికొనఁ గోరితివా?

చ॥ కులము యశఃప్రతాపములు ♦ కొల్వగ్గు రాజకులంబు; నెల్ల వి
ద్యలును గరస్థముల్ మఱి యు ♦ దారరమాకరుణాకటాక్షము
ద్రలకిరవైనవాఁడ; మధు ♦ రాపురరాజ్యవిభుండు నాదు దో
ర్బలమునునమ్మియుండు; నరిఁ రాజకృతాంతుఁడ సారసాననా!

ధనధాన్యవస్తువాహన భోగభాగ్యాదులకు. నీకృపచే నా కావంతయుఁ గొఱంత లేదు. ఈమధురాపురసామ్రాజ్యమున నామాటకెదురాడువారు లేరు. నన్ను జగన్మోహనుఁడందురు. ఇఁకఁ బరాభిప్రాయ గ్రహణకుశలమగు నీదివ్యచిత్తము నేనిందేటికి వచ్చితినో యెఱిఁగియుండకపోదు.

క॥ సుమశరుఁడు చెఱకువిల్లునఁ
గమలశరం బెక్కువెట్టి ♦ కారించెడు న
న్నమితదయ నేలఁగదవే
యమలేందిందిరవిరాజ ♦ దలఘుశిరోజా!

పద్మ:— అయ్యా! యనభ్యాభిప్రాయకలుషితమగు నీహృదయము నెఱింగించి నాకుఁగోపము గలిగించుచున్నావు. నేను లలితపురాధీశ్వరుని నందనుఁడగు చంద్రసేనుని యర్ధాంగలక్ష్మిని. నీవు నన్ను వేఱువిధముఁనఁ బలుకరించుట గొప్పయపరాధము. స్త్రీలు స్వాభావికముగ మృదుగాత్రులు. మృదులాతిమృదులహృదయులు. పరాంగనలఁజూచి మోహమునఁ గన్నుగానక పైఁబడి చెడుత్రోవలకుఁదీయ యత్నించువారు మాతృద్రోహులు, దేశద్రోహులు నగుదురు. నీకిట్టిదురుద్యోగము తగదు. నీవు సకల స్త్రీప్రపంచమును సోదరీప్రపంచమని భావింపుము. నీమాటలింతకు నిలుపుము. దిగిపొమ్ము.

జగ:— కల్యాణీ! రాజ్యహీనుఁడు గృహహీనుఁడు భాగ్యహీనుఁడు నగుభర్త జీవన్మృతుఁడు కదా? కుడువఁగూడును గట్టఁబట్టంబును లేని రిక్తహస్తునిపై మనసుంచి యేలజీవితము వృథసేయుచున్నావు? నేనొకపరమార్థముఁ దెలిపెద. నాలకింపుము.

మ॥ బలమా? తగ్గు క్షణక్షణంబునకు; లేఁ♦బ్రాయంబు కొన్నాళ్ళకుం
దలఁగన్ బాఱు; నిమేషమాత్రమున సౌ♦దర్యంబు మార్పొందుదు

ర్బలమీ దేహము శాశ్వతంబు? ప్రతిభా ♦ వంతుల్ వృథాసేయరీ
యెల ప్రాయంబు; సమస్తభోగములకిం ♦ తీ! యౌవనంబిల్లగుఁగా.

సమస్తభోగముల కాలవాలమయిన యౌవనము నేటికడవిఁగా సినవెన్నెల చేయుచున్నావు? కావున నావచించునది మనసిచ్చి యాలకింపుము.

సీ॥ అతిమనోహరములౌ ♦ రతనాలసొమ్ములె
ప్పటికప్డు చేయించి ♦ పంపుకొందు
నప్సరోగణమట్టి ♦ యలరుఁబోండ్లను నిన్ను
సేవింపఁ బదముల ♦ చెంతనుంతు
వలిపెంపు మేలి హారాం ♦ బట్టువల్వలను రా
సులురాసులుగ నీదు ♦ చెలులకిత్తు
నినుడాయఁ బ్రతిదినం ♦ బునువచ్చు వేళల
నవరత్నతతులు కా ♦ న్కలుగఁదెత్తు
తే॥గీ॥ నాతిరో! నీవు విహరింప ♦ నందనము హ
సించు పూఁదోఁట లెన్నియో ♦ సిద్ధపఱతు
సకియ! నీసత్కటాక్షమా ♦ లికలు పఱపి
చెంతఁ జేరిచి నన్నుమ ♦ న్నింతువేని.

చ॥ ఇఁకనొకమాటపల్కెద మృ ♦ గేక్షణ! నాకుఁగలట్టి సంపదల్
సకలము నీయధీనమును ♦ జానలు దాసులు నీకు; నేను సే
వకుపగిదిఁ జరించెద భ ♦ వత్పదముల్ శిరసావహించి యే
మిఁకొదవలేక రాణివయి ♦ మిక్కిలిమన్నన నన్ను నేలుమా!

పద్మా:—పాపాత్మా! పైత్యరోగిదృష్టివలె నీదృష్టి విపరీతపుఁద్రోవఁబోవుచున్నది.

తే॥గీ॥ భాగ్యగుణరూపవిభవమే ♦ భంగినున్నఁ
బ్రాణనాథుండె గురుఁడు దై ♦ వంబుసతికి

ననుపమానపాతివ్రత్య • మంగనలకుఁ
జెడనిభూషణమగు విప • త్తితులనైన.

దుర్మదాంధా! నానాథుఁడు రాజ్యభోగహీనుఁడై దేశాంతరమునకు వచ్చి నాఁడనుచుంటివా? కానికాలము తటస్థించినపుడు పాండుమహారాజతనూజులుగూడఁ బ్రచ్ఛన్నవృత్తి నొకవత్సరము గడపవలసివచ్చినది. ఈకాలము తొలఁగినంతనే నానాథుఁడు నిన్నును నీవంటివారలఁ బదివేవురనైనను సేవకులుగఁ బరిగ్రహించి యేలుకొనఁగలఁడు. ఆయన బహుభాగ్యపరివృతుఁడై సార్వభౌముఁడుగానిమ్ము. లేకున్నఁ గూటిపేద గానిమ్ము. నాపాలికతఁడే దేవేంద్రసమానభోగి. అతఁడే నాచక్రవర్తి. నానాథుని పదంబులనుండి నామనస్సొక వాఁడిసూది మొనయంతయైన నీవలకుఁగదలదు.

మ॥ తొలఁగఁగ బొమ్మిఁక నేల ప్రేలెదవు? నీ • దువ్వల్వలుల్ నీదు సొమ్ములు పూఁదోఁటలు లెక్కసేయుదునె? యో • మూర్ఖా! దురాత్మా! చతు
ర్జలధిప్రావృతమేదినీవలయసా • మ్రాజ్యంబు సర్వంబునున్
దలపైఁదెచ్చిన వామపాదమునసై • నన్ దాఁకఁగాఁ జింతునే?
ఆవలకుఁబొమ్ము. నాసముఖమున నుండకుము.

జగ:—తరలాక్షీ! నీసంభాషణము వింతగనున్నది. దారిలో నొకమంచి పుష్పముగపడిన నీవద్దానిని దీసికొని సౌరభము ననుభవింపవా? నీవాపుష్పమును గోయుట తప్పని యెవ్వరైనఁ జెప్పగలరా? అట్లే నిరుపమానరమణీయతానిధానయగు కాంతాశిరోమణిని జూచి పురుషుఁడభిలషించుటయుఁ దప్పుగాఁజాలదు. ఇట్లుకోరుట నాయొక్కనితలనే పుట్టలేదు. ఒక్కనిమిషము నీవిశాలలోచనములెత్తియీకుడ్యభాగముల నలంకరించిన యీచిత్రపట

ముల నొకమాఱు కనుంగొనుము. తననాథునను౦గుశిష్యుఁడని యైనఁజూడక ప్రణయపూర్ణహృదయమున వలచి తనయసాధారణరూపరేఖావిలాసంబునఁ ద్రయస్త్రింశత్కోటిదేవతామండలములకు జీవనప్రియుఁడై కువలయమిత్రుఁడగు చంద్రుని దనవలలోవైచుకొని యొక్కయెడఁ బ్రణయకోపమునఁ గూర్చుండి యతఁడు తనపాదములపైఁబడి ప్రార్థించునట్లొనరించిన నఖవిలాసవిజితతార యీమెయే తార. నిగారపు నెమ్మేనుల జిగితోడను వాలారు బెడంగుఁజూపులతోడను నొయ్యారపుఁ జెయ్వులతోడను త్రిలోకీవిజయుఁడగు మన్మథుని గటాక్షమాత్రమున భస్మీభూతముగావించిన కైలాసవాసుని ఖండేందుమౌళిని దనవెంటఁదగిలించుకొనిన యప్రతీపసౌందర్యనిధానలువీరే దారుకావనసంచారిణులగు చంచలాక్షులు. మూఁడు ముప్పదికోట్ల దేవతల కేలికయై యవిరళభోగాస్పదుఁడగు మహేంద్రునిహృదయము మొదలంట నాకర్షించి యుషఃకాలమున నుటజమెక్కి కుక్కుటరూపమునఁ గూయించితిఁగదా యని తనధారాళరమణీయత్వమునకై తృప్తినొంది ముసిముసి నగవుల మురియుచున్న మునివధూటి సమస్తవిలాససాకల్య యీమెయే యహల్య. నవనిధులకుఁబట్టభద్రుఁడై రాజరాజ విఖ్యాతిఁదనరారు కుబేరుని. కూర్మినందనుని నలకూబరుని వశంవదుఁజేసికొనిన రంభోరు రంభ యీమెయే. ఇంద్రునితో విరోధించి సృష్టికిఁబ్రతిసృష్టిగావింపఁ దొరకొనినసంయమిబ్రహ్మయగు విశ్వామిత్రుని వలపించి తనపయ్యెదచెఱంగు పట్టుకొని వెంటనంటు నట్లొనరించిన యుదారమోహనమూర్తి యీమెయే మేనక. నవవికసితసితాంభోరుహదళలోచనద్వయముతో మయూరమనోహరపింఛావృతశిరోభాగముతో మధు

రాతిమధురవేణుగానముచేఁ జతుర్దశభువనముల మోహిం
పఁజేసిన మాధవుని స్వకీయశృంగారకటాక్షమాలికలతో వరి
కట్టి వలపింపఁజేసిన యద్వితీయమోహనవిగ్రహ యీయమెయే
రాధాదేవి. ఆపూవుపొదలచాయఁ బున్నాగవృక్షపుఁగ్రీనీ
డలలో నొండొరులపరిరంభణములమునింగి రాధామాధవులె
ట్లు సస్మేరముఖాబ్జులై విరాజిల్లుచున్నారో చూడుము. కువల
యాక్షీ! యీపటంబులవెలుంగు మహనీయమూర్తులనందఱను
నేనుసృజించియుండలేదు. ఇట్టి మహానుభావులే ప్రణయసంబో
ధనమునకు "హసా"దని లోఁబడియుండ నేనెంతటివాడ? ఈ
చెప్పఁబడిన యహల్యామేనకారంభాతారారాధాదికాంతామ
ణులు నీకాలిగోటికైన నెనరారు. విధేయహృదయమును నీమృ
దుపదారవిందములనుంచి సేవించు నీసేనకు ననుగ్రహింపుము.

పద్మా:—మూర్ఖా! దారుకాకాంతారాంతరకాంతాసంతానము
లును రంభామేనకాహల్యారాధాదులును నీకంటికంత చులక
నగఁ గనఁబడిరా? చతుర్దశభువనత్రాణపరాయణులగు మా
ధవమహేశ్వరులు వీధులలో సంచరించెడు వెకలివేడుకకాం
డ్రని భావించితివా? నలకూబరవిశ్వామిత్రశతమఖప్రముఖు
లునీదృష్టికంత దుర్బలులుగఁ గనఁబడిరా? కాలము దీఱినరో
గికిదివ్యౌషధములు విషప్రాయముగఁ దోఁచునట్లు నీకింతయే
మున్నది? నీవెచ్చటనున్న నేమిచేయుచున్న నెచ్చటికివెళ్ళిన
నీకుఁగనఁబడి నీమనస్సునాకర్షించునట్లు నవితప్ప మఱెవ్వియు
నీకుఁగోచరింపకుండునట్లును నీతలకునుగన్నులకును జుట్టును
గట్టిపెట్టవలసిన రూపపటము లివిగావు. వానిని నేను వివరించె
ద వినుము. నిజప్రచండభుజాబలంబున దేవేంద్రునిగాక సో
మసూర్యుల సయితము ప్రతిఘటించితాఁకి నేలనాలుగుమూ

లలు దిగ్విజయమొనరించి మంచిమనస్సుతో రాజ్యపాలనము
సాఁగింపకపరకాంతాపహరణదోషమునకు లోనైనహేతువున
నశోకవృక్షచ్ఛాయలలో నేకవసనయై నిరశనయై కృశించుచుం
డుసీతామహాదేవి నిజనిర్నిమిత్తాపహరణజనితక్రోధాగ్నిజ్వాలా
జాలంబుల లంకాద్వీపంబుచుట్టుఁబఱపఁగాఁ దన్మహాగ్నిమ
ధ్యమమున నింద్రజిత్ప్రముఖశతసహస్రకుమారవర్గములతో
డను బ్రహస్తాదిమంత్రిసమూహములతోడను కుంభకర్ణాది
యోధనికాయంబులతోడను నసంఖ్యదైతేయవాహినీసముద
యములతోడను శలభప్రాయుఁడైపడి భస్మీభూతుఁడై చనిన
రావణు నవసానసమయమునందలి ఘోరాకారము నూహిం
చుకొనుము. నిజప్రాణనాయకవియోగప్రభవసంతాపానలము
న నర్ధమై కృశించిన దేహయష్టితో సగమైన వస్త్రముతో నా
కలములచేఁదీరని యాఁకలిబాధతో నిజభర్తృపదారవిందప
రికల్పితైకాగ్రమనోధ్యానముతో మునిపత్నులకన్నఁబవిత్రమ
గు మూర్తితో నేతెంచు దమయంతీదేవిని పైఁబడి పరాభ
వింప సమకట్టుటచే నప్పరమపతివ్రతాహృదయావిర్భూతదు
ర్వారకోపవైశ్వానరజ్వాలలకు క్షణమాత్రమున భస్మసాత్కృ
తుఁడై పడు సమయమునందలి కిరాతరాజు రూపపటమును ద
ర్శించుకొనుము. తాను మానవమాత్రుఁడైననుముప్పదిమూఁ
డుకోట్లదేవతలు గొనిపోయి ప్రతిష్ఠింపఁ ద్రివిష్టపమునకుఁ
బట్టభద్రుఁడై వినయమున మెలంగక దేవతారాజపత్నియ
గు శచీదేవిని జూచి మోహించి వైజయంతమున కేఁగఁగాంక్షిం
చి యందలము మోయ సప్తర్షుల బాధించి యందుఁగూర్చుండి
సర్పసర్పేతివాక్యంబుల వారలఁ బెక్కువిధంబులఁగారింప విం
ధ్యపర్వతగర్వసర్వస్వనిర్వాపణప్రవీణుఁడును నిజకరాంభోజకు

హారలీలాధృతసకలజలధినిచయుండును నగు నగ_స్త్యమునిసా ర్వభౌమ వదననిర్గతసరోషభ వేతిక్రోధోగ్రశాపవాక్యసందష్టుఁ డై మానవరూపమువిడిచి యంతరిక్షమునుండి క్రింద భూత లమునకు మహాఘోరసర్పాకారంబున జాఱినప్పటినహుషు నిస్థితి యొకించుక స్మరింపుము. కార్యాకార్యజ్ఞానశూన్యుఁడై హార్మ్యభాగమున నేగాక విరాటుని సభాభవనము దూఱఁబా ఱినను విడువక పరాభవింపఁ బ్రయత్నించి కట్టకడకు దుర్వా రామర్షాగ్నికి సహింపనోపని ద్రుపదరాజేంద్రతనూజచే ను ద్బోధింపఁబడిన పాండుమహీమండలాఖండలు ననుఁగుఁబు తుృండు కిమ్మీరదానవగజకంఠీరవుండు జగద్దుర్దాంతపరాక్ర మోద్దాముండగు భీమసేను నర్ధరాత్రమున న_ర్తనశాలలో మాలినిగా భావించి యతనియనంతబలోన్నతభుజాయుగళమ ధ్యమునఁ జిక్కి పిండిపిండిగనై చిత్రవధకుఁబాలైన కీచకుని యంత్యకాలావస్థను భావించుకొనుము. తనజనకునివెలవెలం దియగు జామోతీకాంతాసాహాయ్యమున మోసగించి హార్మ్య మునకుఁదెప్పించి రాత్రియైనంతనీవిప్పుడు నన్నుఁబోలె సమీ పించి మె_త్తనిమాటలను జెవిఁబెట్టక భేదవాక్యములకు జంక క కడకుఁబైఁబడరాఁగా నుదారపాతివ్రత్యరక్షణార్థమై యత్యం తజవోపేతయగుహర్యక్షరాజాంగనఁబోలెఁ గ్రోధభయంకర మూ_ర్తియై విజృంభించి నిజకాంచనకాంచీకలాపాంతరమున నుండి వెలువడఁజేసిన వీరమతీదేవి నిశాతఖడ్గధారల క్షణమా త్రమునఁ బ్రాణములు గోలుపోయిన లాల్దాసునిచిత్రపటంబు నొకదాని సంపాదించుకొనుము. దుర్హృదయా! యిట్టిదుర్మా ర్గపుబుద్ధి నీయొక్కనితలనేకాదు పుట్టినది. పైఁజెప్పఁబడిన పురుషాధముల తలలుగూడ నీతలవంటివే. పరకాంతాభిలాష

గట్టుకొని లోకములు మ్రింగఁజాలిన బలాఢ్యులే యకాలమరణ ముపాలైయుండ నీదేమిలెక్క? ఇప్పటికైన నీమోహాంధకారము వదలించుకొని క్రిందికివెళ్ళుము. సద్బుద్ధివై మనుము.

జగ:—వన్నెలాడీ! మోహాంధకారము వదలించుకొనుటకేకదా నీ చిఱునగవువెన్నెలలసాయము నేనభిలషించునది? ఆహా! మోహనాంగీ! యెన్నికథలెన్నిపురాణములు నేర్చియున్నావు. తప బడక సక్రమముగఁ బదములొకదానివెంటనొకటి హారము నందలి ముత్తియములట్లు పొందించి మాటాడఁగలిగితివి. మృదులాంగీ! యింతవఱకు నీబాహ్యాంగసౌష్ఠవమును దర్శించియే నేను మఱియుచుంటిని. ఇప్పుడు నీవచశ్చాతుర్యవిలాసములందులకుఁదోడై నన్ను దిగ్భ్రమనొందించుచున్నవి. లతాంగీ! నీవొకింతకఠినముగఁ బలికినను నీమాటలకు నేఁగోపింపను. ఇప్పుడు కఠినభాషణముల వెడలించు నీమోవినుండియే కొంత వడికి దియ్యనియమృతము నాకు లభింపఁగలదు. దేవతలకుఁ గూడఁ దొలుత హాలాహలమును బిదప నమృతమును లభించినవి. మధురాధరా! నేను గుత్తుకబంటిమోహమున మునింగియున్నాను.

ఉ॥ పూవులకోరి చాపమునఁ ♦ బూన్చి మరుండు మదీయచిత్తగా
జీవము దూఁటనేసె; నిఁక ♦ జీవము నిల్వఁగనీఁడతండు; నన్
బ్రోవుమునీవు; లేక యసు ♦ వుల్ గొనినన్ గొనిపొమ్ము నేఁడు; ప
ద్మావతి! నీపదాబ్జములు ♦ దక్కఁగ దిక్కది లేదు నాకిఁకన్.

వాదప్రతివాదములతో నన్నుఁదూలనాడకుము. నన్నాజ్ఞాపింపుము. అగ్నిలో నుఱుకుమన్న నుఱికెద. వాసుకినైనఁ జేఁబట్టెద. ఏప్రమాణ మొనరింపుమన్న నొనరించెద. నీమధురాధరామృతము నానవిచ్చి నన్ననుగ్రహింపుము.

పద్మా:—ఛీ! మూర్ఖా! నోరు మూసికొనుము. నీచేఁజిక్కిన యితర కాంతలవలె నన్నుఁబలుకరింపఁబూనుట మహాసాహసము. భీకరకరాళజ్వాలలుమియు నగ్నిహోత్రమును శలభము శోణపుష్పరాశిగాఁ దలంచుట సహజము. ఉన్మతిపోయి యిట్లనుచుంటివేకాని హాలాహలమును గ్రోలి డప్పిదీర్చికొనఁ దలంచు వీఁడి యుండునే? తప్తాయఃపిండమును మ్రింగి యాఁకలి నడంచుకొన నెవ్వాఁడుగడంగును? జన్నిభావించి క్రొవ్వాఁడిక త్తినెవఁడు పొట్టఁబెట్టుకొనును? ఆకసమును బగుల్చుకొని పఱతెంచు పిడుగును విలాసమని యెవ్వఁడు తలధరించును? ఈశ్వరుఁడొసంగిన యాయువు గట్టిగనున్నవాఁడెవ్వఁడు నిట్టి విషమపరీక్షలకు దిగఁడు. ఇప్పటికయిన హెచ్చరికపడి బుద్ధి దెచ్చుకొనుము. లేకున్న రావణాదిదుర్మార్గులగతి నీకుఁదటస్థించుట ధ్రువము. నోరుమెదల్పకవినయమున వెనుకకుమరలుము.

జగ:—మరాళగమనా! యివి కఱకుములుకులుగాని పలుకులుగావు. సామమున నీవు త్రోవకువత్తువని తోఁపదు. పడఁతీ! కడమాటడుగుచున్నాను. ఇంతకు నీయభిప్రాయమేమి?

పద్మా:—నాకభిప్రాయముశూన్యము. నీతో నాకేమైనఁ బనియున్నఁగదా యేదేని యభిప్రాయముండును?

జగ:—ఆలోచించుకొనుము.

పద్మా:—చక్కఁగా నాలోచించిన నీవొనరించిన దుస్సహాపరాధమునకయి పశ్చాత్తాపతప్తుఁడవై నాపాదములకొకింత దూరమున నొఱగి క్షమింపుమని నన్ను నీవు ప్రార్థింపవలసియుండును. నిన్నుక్షమించుటయో మానుటయో నాయధీనమైయుండవలసియుండును.

జగ:—గర్వోక్తులచే నీవుసుఖపడవు.

పద్మా:—జననమాదిగ నేనుసుఖపడలేదు. ఇప్పుడు పడకున్ననుజీం తింపను.

జగ:—నాదయ సంపాదించుకొనికాని నీవీగృహమునుండి బయటికిఁబోఁజాలవు. కావున యోజించిమాటాడుము.

పద్మా:—నేనుగోరదగిన ప్రపంచపదార్థములలో నీదయ కట్టకడపటిదగుఁగాక. లోకమంతయు మాఱ్ఱొడ్డినిలిచినను నేనొకరిదయనాశించుదాననుగాను. శక్తియున్న నీగదినుండి బయటికి వెళ్ళుదును. లేదాయిందే మడియుదును. నేనేవిషయము చెప్పినను రెండుమాఱు లాలోచింపవలసిన యవసరముండదు.

జగ:—ఎన్ని చెప్పినను నీసతీత్వమునుమాత్రము నిలువనియ్యను.

పద్మా:—అట్లుచేయుట నిన్నుసృజించిన బ్రహ్మకుఁగూడ సాధ్యము గాదు. అంతకువచ్చినప్పుడీప్రాణము నాకుఁదృణప్రాయము.

జగ:—అట్లయిన నీనిర్ణయమును మార్చుకొనవా?

పద్మా:—ప్రపంచము తలక్రిందుగావచ్చును. సూర్యచంద్రులసంచారక్రమము మాఱవచ్చును. నానిర్ణయము మాఱదు.

జగ:—నిక్కముగా?

పద్మా:—ముమ్మాటికి మాఱదు.

జగ:—కలికీ! తనతలపైఁదానె మన్నువేసికొను నేనుంగువలె నీకై నీవ కష్టములు తెచ్చిపెట్టుకొనుచున్నావు. ఉన్నవిషయమెఱింగించెద నాలకింపుము. సాయంతనము తోయాకరమునొద్దనుండి నిన్నీమేడఁజేర్చిన సుందరి యెవ్వరని భావించితివి? ఆ మెరాజపత్నిగాదు. ఈపురమునందలి షడపుఁబడంతులకెల్ల మేల్బంతి. స్వకులాచారోచితప్రౌఢలీలల మానీందులకైన మోహము గలిగింపఁగలది. పేరు కళావతి. ఈమెయెడ ననురాగమూని యీామెతో నెనలేనిసుఖముల నేననుభవించుచుందును.

సాయంకాలమున సుందరియను నొకదాసి నీటికయి పుష్కరిణికివచ్చి నిన్నుఁజూచి పలుకరించి నీముఖముననే నీచరిత్రము విని నేనును గళావతియు నర్మాలాపములఁబొద్దుపుచ్చుచుండ నేతెంచి నీసౌందర్యాదులవివరించి వినిపించె. అంతఁగఱకుపూములుకులు చెఱకువిల్లున సంధించిన మన్మథుఁడు నాకుఁగనిపించె. ఎట్లయిన నిన్నుఁదోడ్తెమ్మని నేను గళావతి నడుగుకొంటిని. ఆమెవచ్చి నిన్నునమ్మించి యిచటికిఁ దోడ్తెచ్చె. పురమున గృహమునకై యరయుతఱి నీభర్త మదీయాజ్ఞచేఁ జెఱయందుంపఁబడియె. ఈగదినుండి నీవుతప్పించుకొని పోవ యత్నించిన నీమార్గము నిరోధింప నెందఱోభటులుగాచియున్నారు. నీవొకవేయిపిడుగులుపడినంత చప్పుడుచేసినను జీమ చిటుకుమన్నంతగూడ బయటికి వినిపింపదు.

ఉ॥ రాతిరికాల మిల్లునుబు ♦ రంబునఁగ్రొత్తలు; రాఁడుభర్తః యిం
కేతగుసాయమన్న లవ ♦ మేనియుఁ గన్పడ దీవుస్త్రీవి; నే
నాతతసర్వకార్యవిజ ♦ యాంకుఁడఁ; గ్రూరుఁడ; నిన్నిపాట్లు నీ
చేతములోఁదలంచియెటు ♦ సేయఁగనెంతువొనిశ్చయింపుమా!

కావున నోయబలా!

తే॥గీ॥ అరగడియ నిల్చి చూచెద ♦ నంతలోన
నీవె ననుఁగౌఁగిలించుకొం ♦ తేని లెస్స
యిట్లుకాదేని నిన్నుఁ బో ♦ నీక పొదివి
పట్టి క్షణమున నేనులోఁ ♦ బఱచికొందు.

పద్మా:—ఛీ! దుర్జాతీ! పాపాత్మా! భయపెట్టినన్నుఁలోఁబఱచుకొనఁ జూచుచున్నావా? నీచహృదయా! నీబెదరింపులచే ధీరహృదయలగు పతివ్రత లణుమాత్రమైనఁ జలింతురా? కొట్టాకుచప్పుడులకుఁ గుందేళ్ళుగూడ బెదరునా? ఆహా! బెండులు నీ

ళ్ళలో మునుఁగుచున్నవి. గుండులు తేలుచున్నవి. నీవు మృత్యువుతోఁ జెరలాటమాడుచున్నావు. నిక్కముగఁ బతివ్రత కన్నులెఱ్ఱచేసి చూచిన సూర్యచంద్రులు గతులుదప్పరా? సమస్తదేవతాసంఘములతో స్వర్గపట్టణము వడవడవడంకదా? భూమ్యాకాశంబులు కుప్పఁగూరగాఁబడవా? బ్రహ్మాండమంతయుఁ బిండిగాదా? అంతయేటికి? కోపదుర్నిరీక్ష్య హార్యక్షరాంజాంగనాతిలకంబుకరణి నొకక్షణకాలము విజృంభించితినేని నీవును నీపరిచారికాసహస్రమును నీమధురాపురసర్వస్వమును భస్మమై పోరా? ఛీ! పురుషరూపము ధరించిన పిఱికితనమా! నీవు సకలసాహాయ్యసంపన్నుఁడవును నేనసహాయనునా? పాతివ్రత్యతనుత్రాణమును దేహమాపాదమస్తమును గప్పుకొనిననాకు నీవిట్లుగాదొక శతసహస్రఖడ్గములు ధరించివచ్చి చంపుదునని యుంకించినను భయములేదు. భయము దుర్బలహృదయములనేకాని ధీరహృదయముల సమీపింపఁజాలదు. పతివ్రతలసమీపించుటకు భయముకూడ భయపడును. దుర్బలహృదయా! నీవా నాకు వ్యవధినొసంగువాఁడవు? నాహృదయమునకుఁ గరుణ సహజాలంకారమగుట నీదుండగమున కెంతటిశిక్ష విధింపవలసియున్నను నొకయరగడియ నీకే వ్యవధి నిచ్చుచున్నాను. నీవిపుడు దార్మార్గపర్వతశిఖరస్థానమున నిలిచియున్నావు. వెంటనేక్రింద మహాగర్తముండుట దెలియలేకున్నావు. అడుగుగదలించిననాగభీరప్రపాతాంతరమునఁబడి నీశరీరము శతశస్సహస్రశఃఖండములైపోవును. గుహాకుహరమనుభ్రాంతిచేఁ దిమింగిలముముఖమున విహరించితివి. ఇదియొకవిలాసమని పంచాస్యరాజంబువక్త్రంబునఁ దలదూర్చితివి. పనికిమాలిన జొన్నకఱ్ఱయని భయంకరతక్షకఫణీంద్రు

నొడిసిపట్టితివి. నీకును మృత్యుదేవతకు నెంతయోదూరములే దు. రెండుమూఁడడుగుల దూరమేకలదు. గర్వాంధకారముగ ప్పి నీకామెనిజస్వరూపము కనఁబడదేమోకాని యిదిగోమృ త్యుదేవత నీసమీపమున నీకన్నులయెదుటనే నిలిచియున్నది. నిర్లక్ష్యభావమున నేనిచ్చినగడువు వృథసేసి దార్మార్గమున కేగ డంగుదువేని కార్యమిుమీఱినపిదప నీదుర్గతికై చింతించుటకై న నీకు వ్యవధియుండదు. మతి యుండదు. తలయుండదు. నీ ప్రాణముండదు. నీవుండవు.

జగ:—(స్వ) ఆహా! రానురానీమె కోమలవిగ్రహము లాలిత్యమువి డిచి గాంభీర్యప్రధానమై వెలుంగుచున్నది.

మ॥ కనుదమ్ముల్ కడుశోణకాంతులనుజి ♦ ల్కన్ బాణమట్లుండు చ
క్కని దేహంబొకయింత నిక్కి కడుసిం ♦ గారంబునన్ నిల్చు నీ
వనితారత్నముఁ జూడ వీరరసమే ♦ భామాకృతిన్ బూని ని
ల్చినయట్లొప్పెవెలందినెమ్మొగముపీ♦క్షింపన్భయంబయ్యెడిన్.

కోపోద్రేకమున జేవురించి తత్కారణమున విశాలతరములైన యీామెనేత్రములనుండి వెలువడు దుర్నిరీక్ష్యవీక్షణమాలిక లకోర్చి యీామెయెదుట నిలుచుటకే నాకుభయమగుచున్నది. ఐన నిప్పుడేమిచేయవలయును? చీ! దౌర్బల్యమా! నాహృద యమున నీకుఁజోటులేదు పొమ్ము. నేనీమె కోపవాక్యములకుఁ దీసిపోవుట వజ్రాయుధము వెన్నముద్దను జూచి వెనుకకుఁబడి నట్లు. దూదిపోవును గాంచి మహాగ్ని తనయుష్ణత నణంచు కొనినట్లు. అందులోఁ బ్రచండభుజదర్పోన్నతిగలనేను, శృం గారసారసర్వస్వపారీణుఁడనగు నేను, శరీరముధరించి జగమ్ము న నవతరించిన నవమన్మథుఁడనగు నేను, సహస్రసంఖ్యస్త్రీల విలాసములలోఁ దగుల్కొని తత్త్రదహాస్యముల నెఱింగిన

నేను, విటశిఖామణియనియు శృంగారపురుషశేఖరుఁడనియు బిరుదములు గడించిన నేను, నేనా యొక్కయబల కోపవాక్యంబులకు బెదరి కార్యమునుండి విముఖుఁడ గావలసినది? ఆహా! యగ్ని చల్లనగుచున్నది. చంద్రజ్యోత్స్న మహాతీక్ష్ణమగుచున్నది. ఎంత మనశ్శక్తిగల కాంతయైననేమి? ఈమె మహిషాసురమర్దనియా? భైరవాకారయగు కాళికేశ్వరియా? మహినెల్లనాశమొసరించు మహామారియా? ఈకోపోక్తులును గర్వరేఖలు నెంతసేపు? మేఘములెంతసేపు గర్జించిననేమి? కొంచెము చలువగాలి సోఁకిన పొంగంతయునడంగి యఖిలజగజ్జీవనాధారమగు వర్షముగురియును. బాణము ధనువునుండి విడువఁబడినది. దానినిమఱలింపఁగూడదు. మఱలింప సాధ్యమునుగాదు. మనఃపూర్వకముగ నేనీమెను గోరితిని. మానరాదు. పట్టువదలక కార్యసాఫల్యమునకై గడంగఁ దగు. అనుమానించుకొలందిని రజ్జువు సర్పమువలెఁగనఁబడుటయేకాక పైపెచ్చు కదలినట్లును మీఁదఁబడవచ్చినట్లును దోఁచును. కానిమ్ము. పలుకరించి చూచెద. (ప్రకాశము) పద్మావతీ!

పద్మా:—ఛీ! పురుషాధమా! కన్నుఁగానని మదమున నన్నేకవచనమున సంబోధనముగావించు నీనాలుక వేయిచీలికలై రాలును. హెచ్చరిక.

జగ:—చెలీ! నాకుఁదమకమెచ్చగుచున్నది.

పద్మా:—ఆఱిపోనున్న దీపమెక్కుడుగ మండుట సహజము.

జగ:—నేను నీకొసఁగిన గడువు తీఱినది.

పద్మా:—అవును. నీగడువు తీఱినది. నేను సిద్ధముగనున్నాను.

జగ:—ఏమి? పూదండలఁబోలు నీసుకుమారబాహువుల నన్నుఁ గౌఁగిలించుటకా?

పద్మా:—కాదు. మదీయరత్నకాంచీకలాపాంతరగు ప్తఖడ్గధారల నీగళమును జించి చెండాడుటకు.

జగ:—ఇవి యెప్పటిమాటలే. వీనితో నేమి? ఏమినిర్ణయించితివి?

పద్మా:—ఆలస్యముచేయక యీశంగమునమాప్తినొందింపవలెనని.

జగ:—ఏవిధమున?

పద్మా:—అది నీనిర్ణయము ననుసరించియుండును.

జగ:—నానిర్ణయమును ముందే తెలిపితినిగదా?

పద్మా:—అట్లయిన నిశ్చయముగఁ జెడఁదలఁచితివా?

జగ:—ఎంతవఱకుఁ జెడవలయునో యంతవఱకు నేనుముందే చెడియున్నాను. ఇప్పుడు చెడవలసినదో నిలువవలసినదో నీపాతివ్రత్య మొక్కటియే.

పద్మా:—అగ్ని చెదవట్టవచ్చును. వజ్రపంజరము నుసినుసిగావచ్చును. నాపాతివ్రత్యమునకొకింతయులోటురాఁజాలదు.

జగ:—బలిమిని నిన్ను లోఁబఱచుకొనెద.

పద్మా:—ప్రాణాపాయము తప్పదు.

జగ:—పద్మావతీ! నేను భయమునెఱుంగను. ఇఁక నిమిషమయిన నోర్వఁజాల. రమ్ము. నాకౌఁగిటఁ జేరుము. (ముందుకువచ్చును.)

పద్మా:—నీకాలము దీఱినట్లున్నది.

చ॥ నిలునిలుమోరి పాతకమ ♦ నీచ! శఠా! యిలపైనఁబ్రాణముల్
గలిగి చరింపఁ గోర్కియది ♦ కల్గినచో; ననుడాయగోరి నీ
వలయక వాఁడిసూదిమొన ♦ యంత పదంబు గదల్తువేని నీ
తలయొకకందుకంబువలె ♦ ధాత్రినిరాలుని మేషమాత్రలో.
మూర్ఖా! యడుగుగదలించినఁ దెగుదువు.

జగ:—పద్మా! నీపాతివ్రత్యము నుపాయసముగా సమర్పించుకొని నన్నుఁ జేరుము. ఒకచక్కని ముద్దాసంగుము. (మీఁదఁజేయి.

వేయఁబోవును.)

పద్మా:—ఛీ! చండాలా! యిదే మదీయగుప్తఖడ్గధారఁదెగి యమసన్నిధానముఁ జేరుము. (కత్తితో నఱుకఁగా జగన్మోహనుని శిరము తెగి పద్మావతికాళ్ళపైఁబడును. పద్మావతి యవ్వలఁదొలఁగును.) ఛీ! దుర్మార్గమా! పొంగడఁగి భూమినాశ్రయించితివా? ఈగదిఁబఱచిన గుడ్డముడిచి యీదేహభాగములగవాక్షముగుండ నవ్వలవీధిఁబడవైచెద. (అట్లుచేయును) అయ్యో! కాసారసమీపమునను న్న నన్నితఁడు తొలుత మోసగించి యిచ్చటికిఁదెప్పింపనేల? కనుగూర్కినంతనే యితఁడు నన్ను సమీపింపనేల? ఎన్నియోరీతుల మంచిమాటలుచెప్పితిని. నీతులు బోధించితిని. కఠినభాషణములాడితిని. గడువుపెట్టితిని. కంఠముదీసెదనని యెత్తిచెప్పితిని. నిండుప్రాణము నేల తీయవలెనని యెంతయోజంకితిని. కాని మౌర్ఖ్యమంతంతకెక్కుడయ్యె. కడకుఁ బైఁబడవచ్చె. అప్పుడు చేయునదిలేక నేను గుప్తఖడ్గమును దీసితిని. వానిని మడియించితిని. నాయొక్కతెపాతివ్రత్యము నేగాక బ్రతికియుండిన నీగదికి వీఁడు తేఁగల యసంఖ్యస్త్రీల మానములఁ గాపాడినదాననైతిని. వానిప్రాణము నాచేత నెట్లో నామానము వానిచే నట్లే యపాయస్థితి నుండెడిదేగదా? మాయిరువురలో నొక్కరిప్రాణమే యీదినము నిలిచియుండవలసినది. వీఁడుమడిసి నేనునిలుచుటచే నాక్కపాతివ్రత్యముగూడ నెక్కుడుగ నిలుచుటయైనది. అబలలును ననపరాధినులునగు స్త్రీలయెడఁ, బురుషులిట్లు వర్తింపఁగూడదు. ఇప్పటికీరంగము పరిసమాప్తమైనట్లే. కాని కానున్నసూర్యోదయము మఱల నెన్నినూతనబాధలఁదెచ్చునో? అయ్యో! మఱచితి. ఈగదితలుపులిట్లే తీసియుంచినఁ గ్రిందినుం.

డి యెవ్వరైన నిచటికిరావచ్చును. తలుపు మూసెద. (మూసివచ్చి యొకయాసనమునఁ గూర్చుండి) నాథా! దుర్మార్గుని చేఁ జెఱఁబెట్టఁబడి యీదీర్ఘరాత్రిము నెట్లుకడపుచుంటివో? నన్నెంత తలఁచితివో? నీసందర్శనము నాకెట్లులభించును?

భటుఁడు (ప్రవేశించి) ఎవరమ్మా! యీగదిలో నుండునది?

పద్మా:—ఏమి?

భటు:—వాకిలి. దీయుము.

పద్మా:—ఏటికి?

భటు:—మహారాజుగారు నిన్నుఁబిలిచికొని రమ్మనినారు.

పద్మా:—మహారాజెవ్వఁడు?

భటు:—మహారాజెవ్వఁడు? నీకుఁబిచ్చిపట్టినది.

పద్మా:—నీకుఁ బట్టినది. అడిగినమాటకు బదులుచెప్పుము.

భటు:—విజయసింహమహారాజుగారమ్మా!

పద్మా:—ఎందులకుఁ బిలిచికొని రమ్మనినాఁడు?

భటు:—నాకుఁ దెలియదు. వచ్చి యడిగి తెలిసికొనుము.

పద్మా:—నాకంతటి పనిలేదు. పోయిరమ్ము.

భటు:—మహారాజుగారాజ్ఞాపించినారమ్మా!

పద్మా:—నీకుమహారాజైన నాకేమి?

భటు:—పిలిచికొనిరమ్మని నన్నుఁబంపినాఁడమ్మా!

పద్మా:—నీవెవ్వఁడవు?

భటు:—రాజభటుఁడను.

పద్మా:—అయిననేమి?

భటు:—నీవు నావెంట రావలెను.

పద్మా:—నాకుఁ బనిలేదు. నేనురాను.

భటు:—రాకున్ననెట్లు?

పద్మా:—ఎట్లు? అక్లీ.

భటు:—నీవు మంత్రికుమారుని జంపితివని నేరము మోపి నీతో మాటాడఁగోరి పిలుచుకొనిరమ్మనినారు.

పద్మా:—చంపినది నిజమే. తనకిష్టమైనశిక్ష విధింపుమంటిననుము.

భటు:—నీవసాధ్యురాలవుగ నున్నావు. మహారాజుగారు వెంటనే పిలుచుకొని రమ్మనినారు. ఊరకపోయినఁ దలపోవును.

పద్మా:—ఎవరితల?

భటు:—నాదేనమ్మా!

పద్మా:—నేను దలుపుదీయను. తనకక్కరయున్న వీథిలోనుండి గవాక్షముకడకు రమ్మనుము. మాటాడవచ్చును.

భటు:—అయిన నీవురావా?

పద్మా:—అణుమాత్రమైనఁగదలను.

భటు:—నేనువెళ్ళిరాజుతోఁజెప్పెద.ఆయన యిష్టమునీయదృష్టము.

పద్మా:—ఈరేయి జరగినసంగతి యప్పుడే పురమునందంతటను దెలిసినది కాఁబోలు. ఈవిషయమున రాజేమిసేయునో? తనమంత్రిపుత్రుని దునుమాడితినని యభిమానవశమున మరణదండనము విధింపఁబోవును. అంతకన్న నెక్కుడుగ నేమిచేయఁ గలఁడు? నేనెంతటికైన సిద్ధముగనున్నాను.

(కళావతీసుందరులతో విజయసింహుఁడు ప్రవేశించినిచ్చెనయెక్కి).

అమ్మా! పద్మావతీదేవీ!

పద్మా:—అయ్యా! మీరెవ్వరు?

విజ:—నేనీపురమునేలునృపాలుఁడను.నీతో మాటాడవలసియున్నది. బయటికి వచ్చెదవా?

పద్మా:—నాభర్త వచ్చినాఁడా?

విజ:—ఎచ్చటనున్నాఁడో తెలిపిన నవశ్యము పిలిపించెద.

పద్మా:—మీమంత్రికుమారుఁడు మోసమున నతనిఁబట్టి నిన్నసాయంతనము చెఱనుంచియున్నాఁడు. విడిపింపుము.

విజ:—చేసెదను. (దిగి) సేవకా! నిన్నసాయంతనము చెఱనుంపఁబడిన నూతనపురుషునిటకుఁ బిలిచికొనిరమ్ము.

సేవ:—చిత్తము. (వెళ్ళిచంద్రసేనునితోఁ బ్రవేశించుచున్నాఁడు.)

విజ:—అయ్యా! నీపేరు?

చంద్ర:—చంద్రసేనుఁడు.

విజ:—ఏయూరు?

చంద్ర:—లలితపురము.

విజ:—జయసింహమహారాజుగారి నెఱుఁగుదువా?

చంద్ర:—నేను వారికుమారుఁడనే.

విజ:—జయసింహమహారాజుగారి కుమారుఁడవా! సరి. చంద్రసేనా! పద్మావతీదేవి మేడపైగదిలోనున్నది. నీవుపిలిచిన బయటికివచ్చును. దయచేసి యామెను రప్పింపుము.

చంద్ర:—(నిచ్చెనయెక్కి) పద్మా!

పద్మా:—దేవా! వచ్చుచున్నాను. (నిచ్చెననుండి దిగుచున్నది.)

విజ:—చంద్రసేనా! కూర్చుండుము. పద్మావతీదేవీ! నీవును గూర్చుండుము. ఇంతకుఁగొంతముందు పురరక్షకభటులు కొందఱీమార్గమునఁదిరుగుచు నిచటనీజగన్మోహనుని శిరమును మొండెమును జూచివచ్చి యావార్తనాకెఱింగించిరి. అంతట నేనిచటికివచ్చి కళావతినిబిలిపించి యడిగితిని. నీవువిశ్రమించిన మేడపైగదిలో నాతఁడుండెనని యామెచెప్పుచున్నది. హత్య గొప్పనేరము. ఈవిషయము నామూలాగ్రము నేనుబరిశీలింపవలసియున్నది. ఉపేక్ష వహింపరాదు. కావుననో నారీమణీ! యీ జగన్మోహనుని గూర్చి నీయెఱిఁగినంత చెప్పుము

పద్మా:—అయ్యా! యీమధురాపురమునఁ గొంతకాలము వసింపఁదలంచి నానాథుఁడును నేనును నిన్న సాయంకాలము భువనేశ్వరాలయముకడకు వచ్చితిమి. వసింప గృహమునరయుటకై నానాథుఁడు పురిలోనికి వెళ్ళెను. నీరమునకనివచ్చి సుందరియనుదాసి నను బలుకరింపఁగా నాచరిత్రముఁ దెలిపితిని. అంత నదివెళ్ళి కళావతీజగన్మోహనులకుఁ దెల్పినది. జగన్మోహనుఁడు ప్రార్థింపఁగాఁ గళావతి యొకయందలమునఁ గూర్చుండి నాకడకువచ్చె. తానీదేశపురాజుపట్టమహిషియనియు నానాథుఁడు తనమేనల్లుఁడనియు నాయనను దనహర్మ్యముననిలిపి తాను నాకొఱకై వచ్చెననియుఁ దెలిపి యనేకవిధముల నాదరమునటింప నేను నమ్మి యందలమునెక్కి యామెవెంట వచ్చితి. పదిగడియలరాత్రికి సభాభవనమునుండి రాజుగారివెంట నాభర్తవచ్చినతోడనే పిలిచికొనివచ్చెదనని చెప్పియీగదిలో నన్నువిశ్రమింపఁజేసి తాను క్రిందికివెళ్ళెను. కొంతవడికి జగన్మోహనుఁడు గదిఁబ్రవేశించి నన్ను నీతిలేనివిధమునఁ బలుకరింపఁజొచ్చెను. నేనెన్ని చెప్పినను వాఁడు వినఁడయ్యె. ప్రాణముగొందునని మువ్మారు చెప్పితిని. కానివాఁడు దౌర్మార్గమునకే కడంగి పైఁబడవచ్చెను. అంతట నాఖడ్గమున నతనితలదీసితిని. కొత్తపురమున నిశీథమున వేశ్యయింటఁ గూర్చుండి నన్నవమానముపాలుగావింపఁ బ్రయత్నించిన దుర్మార్గుని కంఠముదీసినది నిజము. వాని దేహము నీగవాక్షమునుండి యవలకుఁద్రోసితిని. అవ్వలివిషయములు నాకుఁ దెలియవు. నీయిష్టమునకువచ్చు శిక్షవిధింపుము. ధైర్యముతో భరించెద.

విజ:—సుందరీ! నీవేమందువు?

సుంద:—దేవా! పుష్కరిణిచెంత నీమెను జూచివచ్చి కళావతీజగ

తృ తీ యాం క ము.

న్మోహనుల్లకుఁ జెప్పినమాటసత్యాంధు.

విజ:—నీవీరాత్రి యెందుఁబఘండితివి?

సుంద:—కళావతీగృహమునందు.

విజ:—కళావతీ! నీవేమిచెప్పుకొందువు?

కళా:—స్వామీ! పద్మావతీదేవి వచించిన ప్రత్యక్షరమును సత్యము. నేనుజేసిన యపరాధముగొప్పది.

విజ:—సుందరీ! నీవుపద్మావతీదేవినిజూచి కళావతీ జగన్మోహనుల కెఱిగించుట తప్పుకాఁజాలదు. కాని కళావతియీామెనుమోసమున దెచ్చిజగన్మోహనునిబాఱిఁద్రోయుట లోనుగాఁగలవిశేషములునీకును నీతోడిపరిచారికలకును దెలియును. కావునమీా కందఱకు మూఁడునెలలు కఠినశిక్ష విధించుచున్నాను.

కళావతీ! నీదిపబలాపరాధము. నీవును జగన్మోహనుఁడును గలిసి పతివ్రతలుగనుండఁదగిన యెందఱుస్త్రీల మానముల హరించితిరో యెఱుంగరాదు. ఆఁడుదానవగుట నీపరిచారికలవెంట మూఁడునెలలు కఠినశిక్ష ననుభవించి పిమ్మట దేశము విడిచిపోవలెను. నీసౌధము నుద్యానమును సర్వసామగ్రియు రాష్ట్రమునఁ జేర్చితిమి. పద్మావతీదేవీ! నీవర్తనమునిష్కలుషము. ఇతరసందర్భములలో నొకరితలఁదీయుట గొప్పయపరాధమైనను నీకాదోషమే మాత్రమును లేదు. నీపాతివ్రత్యము మఱింతవన్నె కెక్కినది. చంద్రసేనా! నీతండ్రిగారు నాకా బాల్యమిత్రులు. ఈదినమును రేపును మాయింటనిలువుఁడు.

చంద్ర:—కానిమ్ము. (అందఱునిష్క్రమించుచున్నారు.)

ద్వి తీ య రం గ ము.

# పద్మావతీవిజయము.

## చతుర్థాంకము

ప్రథమరంగము. విదేహాపురబాహ్యప్రదేశమునఁగాళికాలయము.

మదనుఁడు ప్రవేశించి

తే॥గీ॥ అలరుతేఁదీఁగియలు గ్రొత్త • హారువుఁదాల్చెఁ
బెడఁగుఁగొమ్మలు చివురుపా • వడలుదొడిగెఁ
దివిరి వనరమ పుష్పవ • తీత్వమొందె
నౌర? మధుమాసదినములే • మనఁగవచ్చు?
తే॥గీ॥ కూర్మిచెలికాఁడు వచ్చి జో • కొట్టినట్లు
మందమలయానిలము తను • వందుసోఁకఁ
జిలుపపూఁజప్పరము క్రింద • నొలసి నిద్ర
గనెడువానికి స్వర్గసౌ • ఖ్యములవేల?

మహోన్నతసౌఖ్యాకరములగు నీమధుమాసవాసరములఁ బ్రకృతి యంతయు నూత్నశోభలఁ గులుకుచున్నది. మఱచితినీది నమిందువారముగదా? కాళికాలయముకడ కేగెద. (నడచును)

ప్రవేశము పద్మావతి దూరమున

మ॥ సురసంసేవ్యను సర్వమంగళఁబరం•జ్యోతిఁ ద్రిగుణారూపిణిఁ
బరమోల్లాసిని మూలశక్తిని నప • ర్ణఁ నిన్ను సేవించు న
న్నరులన్బొందదఘంబుఃకప్పురముచం•ద్రజ్యోత్స్నయున్జందన
స్ఫురణల్ నీదగు చూపుచల్వకు సమం • బుల్గావు సర్వేశ్వరీ!

మద:—ఆహా! ఏమి యీయపూర్వ శృంగారదృశ్యము?

సీ॥ శృంగారరసము పో ♦ సి మెఱుఁగుపెట్టిన
యంగజు సమ్మోహ ♦ నాస్త్రమనఁగ
నాకాశమునినుండి ♦ యవనికిడిగి కళల్
చెఱగెడు క్రొక్కారు ♦ మెఱుపనంగ
మెలఁగక్రొక్కడ విశ్రి ♦ మించిన త్రిజగతీ
లసమానసౌందర్య ♦ లక్ష్మియనఁగ
నంబరాంబరుని జూ ♦ టాగ్రభాగమునుండి
యిలఁజేరు చంద్రమః ♦ కళయనంగఁ

తే।గీ॥ బొలుపులొలికించు జాళువా ♦ బొమ్మయనఁగఁ
గనులుమిఱుమిట్లుగొలుపు చొ ♦ క్కంపుఁగాంతి
సరసరూపరేఖావిలా ♦ సములు గలిగి
లోకవిజయంబొనర్చు నా ♦ లీకనయన.

ఈనీలాలక నాకుఁదెలియకుండ నాహృదయము నెప్పుడోహరించినది. కోయిలలయెలుంగుల గెలువఁగల యీకలికి, కలికిపలుకులతో వాలారుఁజూపుకోపులతో ఘనచంద్రచంద్రికాశీతల పరిరంభములతో ముఱిపెముఁజిలుకు శృంగారచేష్టలతోనతితరానందమొందుచుండు నీమెభర్త యెంతటిమహాభాగ్యసంపన్నుఁడోగదా? ఆహా!

తే।గీ॥ తనపతిననంగు సశరీరు ♦ నొనరుపుమని
మంతనంబున ఖండేందు ♦ మౌళికెఱుఁగఁ
జెప్పుమని దుర్గఁగొలువ వ ♦ చ్చిన రతియనా
వనిత దుర్గాలయమునకై ♦ వచ్చుచుండె.

సమయముమించిదిగనున్నది. ఈమెను బలుకరించెద.

పద్మా:—తల్లీ! నగరాజతనయా!

మ॥ అజకేశాద్యమరార్చితుండును లలా ♦ టాక్షుండుసర్వేశుఁడం
గజవిధ్వంసి గజాసురాంతకుఁడు భ ♦ క్తశ్రేణులక్ గూర్మి నే
లు జగత్పావనుఁడైనఁ దల్లి!నినకో ♦ ట్యుగ్రదంష్ట్రికంటెక్ నిజ
ప్రజపైఁ దల్లికి మక్కువెక్కువని నా ♦ భావంబు కామేశ్వరీ!

మద:—(స్వగతము) కేవలము పొట్టియునుగాక మిక్కిలి పొడుగును గాక యీమెవిగ్రహము గంభీరమై దర్శనీయమై యున్నది. (ప్రకాశము) సుందరాంగీ! కదంబకుసుమములుగల లతాపేటిక మృదుకరంబులఁగొని యీసంధ్యావేళ దుర్గాలయము నుగూర్చి పోవుచున్నావనితలంచెద.

పద్మా:—అవును. పార్వతీదర్శనమునకై వెళ్ళుచున్నాను.

మద:—కలభాషిణీ! వర్ణసమామ్నాయమున నీనామముగా నేర్పడ నోపిన భాగ్యమునకుఁ బాత్రములైన మనోహరాక్షరములెవ్వియో సెలవిచ్చెదవా?

పద్మా:—నన్నుఁబద్మావతియందురు.

మద:—(స్వ) పద్మావతి. పద్మావతి. ఆహా! యీపేరే మిక్కిలిముద్దుగనున్నది. (ప్రకాశము) వేషభాషణములఁబట్టిచూడ నీవు విదేశపుర కాంతవుగఁ దోఁపలేదు.

పద్మా:—అయ్యా!మాది లలితపురము. కారణాంతరమున నితరదేశములనుండనై నేనునునాభర్త చంద్రసేనుఁడు నీయూరికి వచ్చితిమి. కొంతకాలమునుండి యిచ్చట వసించుచున్నాము.

మద:—మహారాజుగారి యాస్థానమున విదేశాంగవిషయముల విచారించుటకునియమింపఁబడిన యుద్యోగిగదా? రంగనాయకాలయపువీథిలో.

పద్మా:—అవును. ఆవీథిలో నొకభవనమున నున్నాము.

మద:—తెలియును. రమణీమణీ! యందమగు నీగులాబి పూదండ

నుపాయనముగా నీకర్పించుకొనుచున్నాను. ఈపరిసరారామములన్నియు నాయవియే. అందలివృక్షములనుండి యీపుష్పములను నేను స్వయముగా నేర్చికూర్చితిని. ఈకుసుమరాజములీదేశమున మఱియెచ్చటను లేవు. హిమవత్పర్వతప్రాంతమునందలి మేఘపురమునుండి వృక్షములను దెప్పించి నేను బెంచుచున్నాను. ఈదినమిాకోలఁదిపూలుమాత్రమే పూచియుండినవి. హారమును నీకుసమర్పించుకొనిన నపురూపములగు నీపుష్పములును వీనినిగట్టిన నేనును ధన్యతఁబడయుదుము. సౌందర్యవద్వస్తువులను సౌందర్యవతులకే కదా సమర్పించుకొనవలయును? (ఎత్తి) అనుగ్రహించి యీచిన్నికానుకను గ్రహించి నాకు ముదముగూర్పుము.

పద్మా:—అయ్యా! యీకుసుమరాజములను దలంచి నీవానందింపవచ్చును. శ్రమచేసి నీవవ్వానిని దెప్పించియు నుండవచ్చును. కష్టపడికూర్చిన హారమును భక్తియుతమనస్కుఁడవై కాళికాదేవికర్పించినఁ గృతకృత్యుఁడ వయ్యెదవు. నాకు వలదు. స్త్రీలు పరులకడ నెట్టిస్వల్పవస్తువునైనఁ బరిగ్రహింపఁగూడదు.

మద:—తరుణీ! మృదులమలయానిలాంకురములు ప్రత్యహము నుదయసాయంకాలముల నీయుద్యానపుష్పముల పరిమళమునుగొని పోయి కాళికాదేవిపాదంబులకడ నివేదించుకొనుచునే యుండును. కావున నీహారమును బ్రత్యేకముగాఁ గాళికియ్యవలసినది లేదు.

పద్మా:—ఈపుష్పములను బ్రతిదినము నీవేమిసేయుచుందువు?

మద:—విన్నవించుకొందును. సావధానచిత్తవై యాకర్ణింపుము.

తే॥గీ॥ చెట్టుచెట్టునఁగల పూలు ♦ సేకరించి
హారముగఁగట్టి తెచ్చి యీ ♦ దారినొంటి

నడచుపూఁబోఁడులకును గా • న్కగనోసంగి
చిత్తమున మోదమొందులే • వృత్తి నాకు.

పుష్పములు లేకున్న నాపని లవమైన సాగదు.

పద్మా:—మంచివృత్తి నవలంబించితివి. ఇంతటి యుత్తమవృత్తి నీ కుబోధించిన వారెవ్వరు?

మద:—ఇది యతిసూక్ష్మమైన యంశము. దీనినిరసికులేకనుఁగొందురు. నీవతిసూక్ష్మమతివిగ నగపడుచున్నావు. ఎఱిఁగించెద వినుము.

తే|గీ॥ ఎల్లవిద్యల సారంబు • నెఱిఁగి విడిచి
పూవులమ్మున ముజ్జగం • బుల గెలిచిన
పరమగురుపాదసన్నిధి • నెఱిఁగికొంటి;
నర్థమనుకొంటి; నీవృత్తి • నందుకొంటి.

ఏమట్లుచూచుచున్నావు? ఈవృత్తిమంచిదికాదనిభావించెదవా?

పద్మా:—మంచిదనియేకదా నీవవలంబించినది. నీకొకరి యభిప్రాయముతోనేమి?

మద:—బాగుగఁజెప్పితివి.

తే|గీ॥ ఎన్నివిద్యలు చదివిన • నెన్ని దేశ
ములనుదిరిగినఁ గడకు ని • ష్ఫలముసుమ్ము
పూలు పూఁబోండ్లుతప్ప నీ • భువనమెల్లఁ
జిల్లికాసైనఁజేయదో • చిగురుఁబోఁడి!

పిచ్చిదానా! వనములలోఁ బుష్పములును బురములలో స్త్రీలునుగదా సకలజనహృదయనయనాహ్లాదకరములగు పదార్థములు. ఎచ్చటసౌందర్యముండునో యచటఁ బ్రేమపుట్టును. ప్రేమ భక్తికిమూలము. భక్తి జ్ఞానమునకుమాత. జ్ఞానము మోక్షమునకు సాధనము. అందుననే కవులు సౌందర్యమునుమెచ్చి

పెక్కువిధములగాననొనరించుచుందురు. కావుననేను సౌం దర్యోపాసకుఁడనయి కాలముగడపుచున్నాను.

పద్మా:—నీవుచెప్పిన వేదవాక్యములన్నియు నిప్పుడునీవు స్వీకరిం చిన నూతనాశ్రమాచారములకుఁ దగియేయున్నవి. సరి. ఇఁక నీతోవ వెడలిపొమ్ము.

మద:—నాకు వేఱుత్రోవ యేమున్నది? నీవెట్లుతీసిన నట్లే.

పద్మా:—అసంబద్ధప్రలాపములుమాని కదలిపొమ్ము.

మద:—విన్నంతసేపువిని మంచిచీవాట్లుపెట్టితివి. ఐన నెచ్చటికిఁ బొమ్మందువు?

పద్మా:—నీపనివెంట నీవుపొమ్ము.

మద:—నాకు వేఱుపనియేమున్నది? నేనును గాళికాలయమునకు రా వలయును.

పద్మా:—దినమును గాళినిదర్శించు నీకిట్టిదుర్బుద్ధితగునా? దేవీపూ జకువచ్చునపుడైన హృదయమ్ము నిర్మలముగ నుంచుకోరాదా?

మద:—లతాంగీ! యిదివిపరీతముగాదు, లోకస్వభావమేయిట్లున్నది.

తే।గీ॥ మగలు మగువల మగువలు ♦ మగలఁజూడ
జాతరకుఁ దిరునాళ్ళకుఁ ♦ జనుచునుంద్రు;
కోటికొకఁడైన దేవునిఁ ♦ గొలుచుమనుజుఁ
డుండునో లేదో సందేహ ♦ ముత్పలాక్షి!

ఈపైమెఱుంగులకుఁగాకున్న నెల్లప్పుడు చూచిన శిలావిగ్రహ ముఁజూడ నెవ్వరు శ్రమింతురు?

పద్మా:—మంచిదైవభక్తి గలవాఁడవే. ఇట్టి నిరంకుశవృత్తితోఁజ రించు నీవెవ్వఁడవు?

మద:—విన్నవించెద. తొందరపడకుము. అట్లడుగుము. అన్నియుఁ దెలిసికొనుము.

తే॥గీ॥ తండ్రితాతలు కష్టించి ♦ ధనముఁగూర్పఁ
జెనఁటివృత్తులఁ దానివె ♦ చ్చింప ధరణి
నవతరించు సోమరులందు ♦ నగ్రగణ్యుఁ
డనఁదగినవాఁడను మదనుఁ ♦ డనెడువాఁడ.

తన్వీశిరోమణీ! నేనీదేశపుఁబ్రధానసేనాధీశుని కుమారుఁడ.

మ॥ కలవారామములెన్నియేనియును భా♦గ్యంబుల్ మహాభోగముల్
గలవత్యుత్తమహర్మ్యరాజము లసం ♦ ఖ్యంబైభటశ్రేణులుఁ
గలవింకన్ హితులెందఱేనిఁగలరో ♦ కల్యాణి! సర్వంబునున్
గలదేలోపము లేదు నీదుకృప ద ♦ క్కన్ నాకు లోకంబునన్.

కోమలీ! చుట్టుమాటలతోఁబనిలేదు.

చ॥ కళలనుజిమ్ము వాల్గనులఁ ♦ గన్గొనకున్నఁ బసిండిఛాయలన్
గులికెడుమేను గాఁగిళులఁ ♦ గూర్పకయున్న మెఱుంగుమోవి తే
నెలఁజవిచూడకున్న రమ ♦ ణీమణి! పుష్పధనుస్సునందుఁ బూ
ములుకులుచేర్చివన్నుఁబడ ♦ మొత్తుమరుండును నిర్దయాత్ముఁడై

ఎట్లయిన నీమైత్రి నాకుఁబ్రసాదింపుము.

పద్మా:—దుర్హృదయా! నీయాయువు మూఁడినట్లున్నది. పూజ్యహృదయ నగునన్ను నీవిట్లుపలుకరించుట తల్లితోఁ జెరలాట మాడుటవంటిది. నీవాఁడుత్రోడునఁ బుట్టువా? దుర్గాలయమునకుఁగాకున్న మఱియెచ్చటికైనఁ బోవునప్పుడు నీతోఁబుట్టువునో తల్లినో భార్యనో నీకన్నదుర్మార్గుఁడొకఁడువచ్చి నీతిమాలినవిధమునఁ బలుకరించిన నీమనసున కాహ్లాదకరముగ నుండునా? అప్పుడిట్లే ముసిముసినగవుల మెఱయుచుందువా? నీకు సిగ్గు నాత్మగౌరవము నణుమాత్రమైన నున్నట్లులేదు. వెడలిపొమ్ము. నావృత్తాంతమెఱుంగవు. ఇట్లేవదరుచున్న నేమిసేయుదునో చూడుము.

మద:—మరణదండనమువిధించి తలదీయుదువాయేమి? నేను నీవంటివారి నెందఱనో చూచియున్నాను. దుర్గాలయమునకువెళ్ళు మార్గమున మనమిట్లుపెనఁగులాడుచుండిన నెవ్వరైనఁజూతురు. నీమనస్సునకప్పుడాయాసము గలుగును. నామాత్రము నకేమో నేనెవ్వరుచూచినను వెనుదీయువాఁడఁగాను. ఒకచిక్క నిచక్క నిముద్దు త్వరితముగా నొసంగుము.

పద్మా:—పాపాత్మా! దూరమునకుఁ బొమ్ము. నాసముఖమున నుండకుము.

మద:—నీసముఖమున నే యుండెదను.

పద్మా:—కూడదు. నీవుపోవలయును.

మద:—నేను పోను.

పద్మా:—పోకున్న నిం దేయుండుము.

మద:—ఇం దేటికుందును? నేనుండను.

పద్మా:—ఉండకున్న నేమైనఁగమ్ము. నేనుదుర్గాలయమునకు వెళ్ళవలయును.

మద:—నేనును దుర్గాలయమునకు వెళ్ళవలయును.

పద్మా:—అట్లయిన వెళ్ళుము. నావెంట రాకుము. (నడచును)

మద:—నాయిష్టమైనమార్గమునఁ బోయెదను. (వెంటనడచును)

పద్మా:—మఱల నావెంటనే వచ్చుచున్నావే? (నిలిచి) నీవుముందుపొమ్ము.

మద:—నేను ముందుపోను.

పద్మా:—అట్లయిన వెనుకరమ్ము.

మద:—నీవుచెప్పినట్లు నేనేటికివత్తును? నేనువెనుకరాను.

పద్మా:—అట్లయిన నేమిచేసెదవు?

మద:—ముందునుబోను. వెనుకనురాను. నీవెంటనే నడచెద.

పద్మా:—నావెంట నడువఁగూడదు.

మద:—అది నీయిష్టముగాదు.

పద్మా:—ఏటికిఁగాదు? నావెంటరాఁగూడదనుట నాయిష్టమే.

మద:—ఈమార్గమంతయు నీదేశమునేలు మహారాజుగారిది. వారి యనుమతితోఁ బ్రజలీమార్గమును రాకపోకలకై యుపయోగించుకొనుచుందురు. కావున నీస్త్రీవనడచుటకుఁగాని పరువెత్తుటకుఁగాని కూర్చుండుటకుఁగాని నిలుచుటకుఁగాని నీకెంతబాధ్యతగలదో యెక్కువలేకపోయినను నాకునంతటిబాధ్యత గలదు. నీవింతదూరము చెప్పుచున్నావు. కావున నీదేహమును మాత్రముసోఁకకుండ నిన్నానుకొని నీవెంటనే నడచెదను. కాదనివారించుటకు నీకధికారమేమున్నది?

పద్మా:—(స్వ) వీనియందు దుర్నీతికిఁ బెంకెతనము తోడైనది. వీఁడాత్మగౌరవము నెఱుంగక కేవలము మూర్ఖుఁడుగ నున్నాఁడు. వీనినూరకతలదీయుటయు భావ్యముగాదు. అవివేకియగు శత్రువు నుపాయముతో నిర్జింపవలెను. (ప్ర్కా) మదనా! జగడముమాని నీతోఁ బ్రవఁభోవా?

మద:—సీమంతినీ! నీకంఠస్వనము పూర్వమునందువలెఁ బరుషముగాక మార్దవముతోఁ గూడియున్నది. ఆహా! నీకంఠధ్వనిముందఱఁ గోయిలలయెలుంగులేటికి? మదనా! యని నీవిప్పుడనఁగానందెంతయో గానమాధుర్యముండెను. నాపేరునట్టిమాధుర్యముగలదని నేనెన్నఁడెఱుంగను. జవ్వనీ! నీతోజగడమాడవలెనని నేనురాలేదు. నీకటాక్షమున్నకై ప్రార్థింపవచ్చితిని.

పద్మా:—నీప్రార్థనములట్లుండనిమ్ము. కాని పలువురు తిరుగాడు మార్గమున నన్నిట్లు చేయవచ్చునా?

మద:—నిన్నునిర్బంధించి యకారణముగా నీకు నొప్పిగలిగింపవలె

ననినాకోరిక కాదు. నేనిచ్ఛయించిన కాంతలనెల్లఁదఱచుగ నీ మార్గముననే కలయుచుందును. జనులు వచ్చుచుఁబోవుచుందురను భయమున స్త్రీలు నేఁడారసిల్లినప్పుడాలస్యమొనరింపరు. అందుకై యిట్లుచేయవలసివచ్చినది.

పద్మా:—మాటలతోఁ బ్రొద్దెక్కుడైనది.

తే|గీ॥ గగనమనెడు తమాలవృ ♦ క్షంబుపైన
గమికొనిన జ్యోతిరింగణ ♦ గణమనంగ
మినుకుమినుకను కాంతులు ♦ మిగులఁదోఁపఁ
దారకాతతి మొలిచె నం ♦ దములుచిలికె.

శీఘ్రముగ దేవిని దర్శింపఁబోవలెను.

మద:—తొలుత నన్నుఁగరుణఁజూడుము. పిదప దేవికరుణకై నీవు పోవచ్చును.

పద్మా:—ప్రప్రథమమునఁ గాత్యాయనీదర్శనముగావలయును.

మద:—నీకొఱకై యించుక శాంతము వహించెద. కాళీపూజయైనతరువాత నాకేమైనఁజెప్పవలెను.

పద్మా:—ఇప్పుడు శాంతమువహించి యుండుము.

మద:—నిన్నుఁ దొందరింపను. ఇఁకఁబోదముపద.

పద్మా:—నీవుమాత్రమొకింతవెనుక రావలెను. (నడచును.)

మద:—ఆనతిచ్చినట్లు వచ్చెద. (నడచును) ఇదెయపర్ణాలయమును సమీపించితిమి.

పద్మా:—దేవీపూజ పూర్తియగువఱకును నీవు నోరెత్తఁగూడదు.

మద:—సరి. సరి. వినుమని యెంతవఱకైనఁ జెప్పుచుండుటయేనా? నీవీరేయెల్ల యిచ్చటనే పూజించుచుందువేమో? ఎవ్వరెఱుంగుదురు? నావిషయమై యిప్పుడే తెగవలెను.

పద్మా:—నాకేమి నీకువలెనిల్లునువాకిలియు దండించువారును లేర

నుకొంటివా? నీవు మూర్ఖ్యముఁ బెంచుకొనక యాకొంచెమునే పును జెప్పినట్లు నడచుకోవలయును. మఱియొకటి. నేను లోని కేగి పూజసేయునపుడు నీవు బయటనే యుండవలెను.

మద:—మనమిరువురమొకేమాఱు దేవినేలపూజింపరాదు?

పద్మా:—ఏటికా? చెంతనున్న నీనోరూరకుండదు.

మద:—అవును. నేనూరక పలుకరించుచుందును.

పద్మా:—ఊరకపలుకరించుచుండిన నామనస్సైకాగ్రముగ నిలువక పోవచ్చును.

మద:—అదిసత్యమే.

పద్మా:—అందుకే నీవుబయటనుండవలెనని నేనుగోరినది.

మద:—అట్లయిన సరి. నీవుగర్భాలయమునఁ బ్రవేశించి తలుపులు బిగించి లోపలఁగూర్చుందువేమోయని నేనుసందేహించితిని.

పద్మా:—ఇందుకే నీకాలోచనతక్కువయనునది. నిన్నుబయటఁద్రోసి నేనులోపలఁగూర్చుండినంత నాకువచ్చులాభమేమి? త్వరిత ముగ నింటికివెళ్ళవలెనని చెప్పితిఁగదా? యేలసందేహించితివి?

మద:—ఇప్పుడునాసందేహము తీఱినది. ఒకగంటకుఁ బూజ పూర్తిచేయునెడల నేనుసమ్మతించెదను.

పద్మా:—గంటా? గంటయేటికి? అరగడియలోఁ బూర్తిచేసెదను.

మద:—నీకృప యపారము. అట్లేకానిమ్ము.

పద్మా:—చెప్పుముమఱి. పూజకు నీవుముందుపోయెదవా? లేక నన్నుఁబొమ్మందువా?

మద:—దినదినమీప్రాంతమునకు వచ్చువాఁడనైనను సాధారణము గా నేనుదేవిని బూజించియెఱుంగను. ఒకవేళ నంతగాఁబూజింపవలసివచ్చిన నొక్కనమస్కారముతప్ప నాకేమియుఁ జేతఁ గాదు. నమస్కారమున కొక్కనిమిషమునకన్న నెక్కుడుకాల

ము పట్టదు. నీపూజ యరగడియపట్టునని నీవే చెప్పితివి. నేనీబ హిర్వేదికపైఁ గూర్చుండియుండెద. నీవు తొలుతఁబూజ సేయుము.

పద్మా:—అట్లే కూర్చుండుము. (లోనికేగి)

మ॥ స్థిరపుణ్యంబగు పాలవెల్లిని మణి ♦ ద్వీపంబు మధ్యంబులో
సిరులన్ జిమ్ము కదంబకాటవులలోఁ ♦ జింతామణీపీఠిపై
సురసంఘంబులు భక్తితోఁగొలువఁగా ♦ శోభిల్లు నీయుల్లస
చ్చరణాబ్జంబులుసంస్మరించెద మన ♦ స్సద్మంబునన్ శాంకరీ!

చ॥ జలములలోనిస్వాదుతయుఁ ♦ జందురులోపలిచల్వయున్ మహా
నిలమునఁగల్గు సత్వమును ♦ నీరజమిత్రునిలోని తేజమున్
జ్వలనునిలోని యుష్ణతయు ♦ సర్వజగంబులలోని సారమున్
బలుకుచునుంద్రుప్రాజ్ఞులు భ ♦ వత్పలసారముగా మహేశ్వరీ!

చ॥ తులువలుదుష్టచిత్తులును ♦ ద్రోహులునౌపురుషుల్ మనోజ్ఞరూ
పలఁ బొడఁగాంచి పైబడఁగ ♦ వచ్చెద రీకలివేళ నట్టి దు
ష్టులవలనన్ భయంబులొక ♦ సూదిమొనంతయుఁగల్గకుండనీ
సలలితసత్కృపాబలమె ♦ సంగి ననున్ మనుపంగవేఁడెదన్.

మద:—పద్మావతీ! యరగడియకెక్కుడైనది. నీపూజ యింకెంతసేపు జరగును?

పద్మా:—వచ్చుచున్నాను. (బైటికివచ్చి) ఇఁకనీవువెళ్ళి పూజింపుము. నేనుబైటనుండెదను.

మద:—అక్కరలేదు. ఇచ్చటనుండియే నమస్కారమర్పించెద.

పద్మా:—దేవికి సాగిలఁబడినమస్కారముచేయుటలోనా తొందర? ఎంతమోటుమానిసివి?

మద:—అయిన లోనికేగియే నమస్కరింపవలెనా?

పద్మా:—కాదామఱి? అట్లుచేయుటయే యుక్తము.

మద:—సరి. చెప్పినట్లుచేసెద. కాని

తే॥గీ॥ మ్రొక్కి యెఱుఁగవు చేతులు; ♦ వాక్కు పొగడి
యెఱుఁగదు; మనంబు ధ్యానించి ♦ యెఱుఁగదు; కను
లెఱుఁగ వీక్షించి; దేవి నే ♦ నెట్లు కొలుతు?
నేమనందు! నెట్టులుచూతు? ♦ నిందువదన!

పద్మా:—పుట్టినప్పటినుండి దేవినిబూజించి యెఱుంగవా? ధ్యానించియెఱుంగవా? నీవు వింతమానిసివిగ నున్నావు. అట్లయిన నీచేసైనవిధమున మ్రొక్కికొనిరమ్ము. త్వరితముగఁ బొమ్ము. ఇప్పటికే యాలస్యమైనది.

మద:—ఇప్పుడు నమస్కరించివచ్చెద. (లోనికేగి)

తే॥గీ॥ పేరెఱుఁగ;నూరెఱుంగ;నీ ♦ విభునెఱుంగఁ;
దల్లిదండ్రులనెఱుఁగ;నీ ♦ తత్వమెఱుఁగ;
దేవివనుచుఁ బద్మావతి ♦ తెలుపుచుండెఁ;
గాన నోదేవి! నానమ ♦స్కారమిదిగో.

పద్మా:—వీఁడు కేవలము రిక్తహృదయుఁడుగ నున్నాఁడు. వీనికిఁగఠినశిక్ష విధింపఁగూడదు. నాపాతివ్రత్యసంరక్షణమునకు మాత్రము వలయు శిక్ష వీనికివిధించెద.

మద:—ఓకాళీవిగ్రహమా! నీకునమస్కారము. మన్నింపుము. (సాగిలఁబడి నమస్కరించును.)

పద్మా:—(గుడితలుపులుమూసి చిలుకుదగిలించి) అయ్యా! తొందరపడకుము. చక్కఁగాఁ బూజసాగింపుము.

మద:—తలుపేలమూయుచున్నావు? నేనురావలదా? (లేచును)

పద్మా:—ఎక్కడికి వచ్చెదవు? తలుపుచక్కఁగా మూసియున్నాను.

మద:—పరిహాసమునకయిన నట్లుచేయకుము. తెఱువుము. (తట్టుచున్నాఁడు.)

పద్మా:—నేను దెఱవను.

మద:—తెలియకున్నఁ దలుపు బ్రద్దలుగఁగొట్టి బయటికివచ్చెదను.

పద్మా:—నీవెంత ప్రయత్నించినను దలుపులూడిరావు.

మద:—(గట్టిగఁదట్టి) నిజముగ నన్ను లోపలవైచెదవా?

పద్మా:—అట్లే చూచుచుండుము.

మద:—మోసగించితివే!

పద్మా:—చెప్పక చేసినఁగదా మోసమనిపించుకొనును. నీముందర నే చేసితిని. దురాత్మా! దారిలో నొంటివచ్చు నారీమణుల సమీపించి యాగడముసేయుదువా? నీవీరేయెల్ల నిందేపడి యుండుము. ఇంతటితో బుద్ధితెచ్చుకొనిసన్మార్గముననడువుము.

మద:—పద్మావతీ! నిన్నుఁగాళికాదేవివనిభావించికొలిచెదను. నీవు విధించినశిక్ష యిప్పటికే దుర్భరముగనున్నది. ఆఁకలియగు చున్నది. వాకిలితీయుము.

పద్మా:—నేనాలోచించిచేసితిని. నానిర్ణయముమాఱదు.

మద:—అన్యాయముగ నన్నుఁజంపఁజూచుచున్నావు. కాళికాదేవి యర్ధరాత్రమున నాహారమునకయి సంచరించునని జనులను కొందురు. ఈరాత్రి యాలయమువిడిచిపోక నన్నుఁజంపి భక్షించి గుఱ్ఱువెట్టినిద్రించును. అయ్యో! నాకేదిదిక్కు?

పద్మా:—ఆమె లోకజనని. నీకు బుద్ధిచెప్పును.

మద:—అయ్యో! పద్మావతీ! యొక్కమాఱుతలుపుసందునుండి తొంగిచూడుము. నాకన్నీరెట్లుకాలువలై కాఱుచున్నదో కనుఁ గొందువు. నేను దుర్బలహృదయుఁడ. నన్నిట్లుచేయఁదగదు. నీపాదములంటివేఁడెద. కరుణించి నాచెఱవాపుము.

పద్మా:—పొద్దెక్కుడయినది. నేనుబోవుచున్నాను.

మద:—పోకుము. పోకుము. నాకుమూర్ఛవచ్చుచున్నది. అయ్యో! అయ్యో!

పద్మా:—దేవీనామస్మరణము చేసికొనుము. నీపాపమైన క్షయించును. (నిష్క్రమించుచున్నది.)

ప్రథమరంగము.

ద్వితీయరంగము. విదేహాపురపరిసరారణ్యము.

(సుత్తిగాఁడును బల్లిగాఁడును బద్మావతినిమంచముతోడ మోచికొని ప్రవేశించుచున్నారు.)

బ:—సుత్తిగా! ఆమాంతంగ బరువేస్తది. కొంచెం నిలాపుదాం.

సు:—పరువుదూరానికే యీడిగల పడతవంటరా బల్లిగా! అడుగు సాగై. ఛణంలో యింటికాడ పడతాం.

బ:—య్యారేయి బోకట్టంతగిలిందిరా మామో! పైలంతా మారుమసలుతాఉంది. యింటికెల్తానే అమ్మయ్యను సేవించుకోవాలరా!

సు:—అయ్యోరి కటాచ్ఛంతో సెరి పదిముంత లేసుకుందాం పదసీ.

బ:—ఆలయ్యోరిసూపు దొంగసూపుగాఉంది. పనిసరిపోయినాక దుడ్డు యెగేస్తడేమో?

సు:—అట్లాంటోడుకాదురా పాపం. మెతకజీవమేరా.

బ:—నీమాటమీందొచ్చేసినా. అయ్యోరుసేతులెలికెలేస్తేనీపాణం పుచ్చుకుంటా.

సు:—అరసాకసీ. కదలతాఉంది. నోరుమూస్కో.

పద్మా:—(కనులువిచ్చి యాకసమువంకఁజూచి)

తే॥గీ॥ ఆత్మనాథుండు దూరదే ♦ శాంతగముల
కరుగునప్పటి చెలులము ♦ ఖాబ్జములటు
లిందుఁడస్తాద్రి కడకేగ ♦ నెల్లతార
కాముఖంబులు వెల్లనై ♦ కాంతిదొఱఁగె.

ఇఁకఁ ద్వరితముగ లేచి దేవీప్రార్థన మొనరించి గృహకార్యంబు లు నిర్వర్తించెద. (లేచికూర్చుండి) ఏమిది? నాతల్పమిట్లు కదలుచున్నది. ఆహా! యెవ్వరో మంచముతోఁడ నన్ను మోచికొని వచ్చుచున్నారు. ఇది విదేహపురముగాదు. ఉన్నతతరుగుల్మలతానికుంజపుంజభీకరమగు మహారణ్యముగనున్నది. ఏమో ద్రోహము జరగినది.

బ:—మంచంరవ్వంత నిలాపుదామసీ. మోసిమోసి జబ్బలిరిగినాయి. (తడవికొనుచున్నాఁడు.)

సు:—సీకటిచ్చిందిరా నాయాలా! అమ్మోరు మేలుకుంటే పాణం మీాదికొచ్చినీ.

బ:—సేతులోసిక్కిందేమిసేస్తదిరా? కుందేలు బువ్వింటాకి వచ్చేసింది. కొంచెం నిలుపుదాం.

సు:—ఇప్పుడుకాదసీ. యెకాయికి యెల్లాలసిందే.

బ:—యిగో నేనొక్కఅడుగైన ముందుకుకదలను. నేనుమోసేకోపు యిడిసేస్తా.

పద్మ:—(స్వ)ఏమి యీావింతవిధము? నన్నుఁగొనిపోవువారెవరో తెలియరాదు. ఏదో ద్రోహము మదినూని నన్నుఁదెచ్చియుందురు. సంభాషణమునుబట్టిచూచిన వీరు కేవలము హీనజాతివారనితోఁచుచున్నది. నిమిషనిమిషమునకు నేను విదేహపురమునకు దూరముగను వీరిగమ్యస్థలమునకు సమీాపముగనునరుగుచున్నాను. ఆలసింపరాదు. (ప్రకాశము) ఓరీ! శయ్యావాహకులారా! నిలువుఁడు.

సు:—నారాయడా! అమ్మోరు మేలుకొనెరా! కొంపముంచితివిగదరా? నోరుసించుకోవాకసీ అంటనిమొత్తుకుంటే యినకపోతివి. ఇప్పుడుమగతేంరా బల్లిగా?

బ:—ఏంగతిరా? మంచంకిందేతామసీ.

సు:—అమ్మోర్లు కాలికిబుద్దిసెప్తేనో? రానని కట్లాసేస్తేనో?

బ:—ఆడమానేమిసేస్తదిరా అదురుగుండెలనాయాలా?

పద్మా:—ఓరీ! నీకువినఁబడలేదా? ఒక్కయడుగైన నడువఁగూడదు. ఇచ్చటనే నిలువవలెను.

బ:—నిలుపునిలుపసీ! ధ్యాడికిపోతాది. పాపం కొంచెంసేపు కూకుంటదేమో కూకోనీ.

సు:—కానీఅసీ. (మంచము దింపుదురు. అందుఁగూర్చుండిన పద్మావతి నిరువురు వంగి వంగి చూతురు.)

పద్మా:—ఓరీ! మీరెవ్వరు?

సు:—నేనా?

బ:—నేనా?

పద్మా:—అవును మీరిరువురు నెవ్వరు?

సు:—ఏం అమ్మోర్లా! అంతగట్టింగ అడగుతావు?

పద్మా:—మీరెవ్వరని యడుగుచున్నాను.

సు:—నేను నేనే.

బ:—నేనూ నేనే.

పద్మా:—మీనామములేమి?

సు:—మాకు నామాలు గీమాలులే.

బ:—మేము తిరునామధార్లంకాము.

పద్మా:—సరి. మీరెవ్వరు?

సు:—నేను సుత్తిగాణ్ణి.

బ:—నేను బల్లిగాణ్ణి.

పద్మా:—మీపేళ్ళుసరియే. మీరెవ్వరు?

సు:—నేను సుత్తిగాణ్ణంటే.

బ:—నేను బల్లిగాణ్ణంటే.

పద్మా:—మీవిశేషములేమి?

సు:—మాయిసేసాలా? శానాఉండాయి. అయన్ని మొబ్బులోనే.

బ:—పగలులేనేలా. యిసేసం యిసేసం యింకాయిసేసంగా పని సేసేవోళ్ళం.

పద్మా:—మీపనియేమి?

సు:—మేముసేసేపనా? యేంల్లా. అమాసరెడ్లం.

బ:—అంటే మొబ్బేటగాండ్లం.

పద్మా:—మీకుమతిలేదా యేమి? అడిగినదానికి సరిగా నుత్తరమియ్యఁజాలరే?

సు:—నేనుసుత్తిగాణ్ణి. నీవు అమ్మోర్నివి. ఈడుబల్లిగాడు. నాకుమతి పోయిందీ?

బ:—నేనుబల్లిగాణ్ణి. నీవుఅమ్మయ్యతల్లివి. యిదంతాయాపకోన. నాకుమతిలాకేం?

పద్మా:—అట్లుకాదు. అడిగినది చక్కఁగాఁదెలిసికొని మీరుత్తరమియ్యవలెను.

సు:—అమ్మో. మేము ఉత్తరువియ్యడమూ? నీకా? మాయమ్మతోడు. నాతరముకాదు.

బ:—ఉత్తరువులు గిత్తరువులు అన్నీనీయే. నీవుచెప్పినట్లు నడుసుకోవడం నాపని.

పద్మా:—ఉత్తరువులుగాదు. అడిగినదానికి బదులుసరిగ యోజించి చెప్పవలయును.

సు:—అట్లనా? సిత్తం. సిత్తం.

బ:—బుద్ది. బుద్ది.

పద్మా:—మీనివాసములెచ్చట?

సు:—మాకు వాసాలు గీసాలులా. ఏంటికి మాకువాసాలు! ఉండే వాసాలన్ని యాపకోనలోనియే.

బ:—అదిగాదసీ అడిగింది. నీవూరకో. (పద్మావతితో) మానివాసా లంటవా నీవడిగేది?

పద్మా:—అవును.

బ:—సరే. మానివాసాల్ని నీవనుకున్నావు. కాని వాసాలు మాండ్లకుకాయవు. మాండ్లు యేరే. వాసాలు యేరే. వాసాలు పొదలుపొదలుగ పుట్టుతాయి.

పద్మా:—నేనడిగినది మీ కర్థముకాలేదు.

సు:—నాకు కొంచెం అయింది. యీణికే మరీ యేమీ తెలంది. ఈబల్లిగాడు పుట్టినప్పటాలనుంచి యిస్కలో సేయిపెట్టనేలా.

బ:—యీనాయాలిస్క మొగమేసూడలా. యీణికి ఓమానాలేరావు. నాకర్తం అయింది.

పద్మా:—మీరుసంసారముచేయుటయెచ్చటననియడుగుచున్నాను.

సు:—సంసారాలంటే యేంటివి?

బ:—నీకుబుద్ధిలేదురా సుత్తిగా! సంసారమంటే మావసంగదంటరా?

సు:—కొత్తాలసీ! నీకుమనుసు కేరాలా.

పద్మా:—మీ పెండ్లాలతో బిడ్డలతో నెచ్చటనుందురు?

బ:—యాపకోనలో ఉంటాం.

సు:—యీడుదొంగనాయాలు. యీణికి పెండ్లికానేలా.

బ:—నీకయిందంటరా యెచ్చలనాయాలా?

పద్మా:—మీ వేపకోన యెచ్చట నున్నది?

సు:—ఒకపరుగుంటుంది.

బ:—అదో కానొచ్చే గుట్టకింద ఉంది.

పద్మా:—మీరునన్నెచ్చటికిఁ గొనిపోవుచున్నారు?

సు:—యాపకోనకే.

పద్మా:—ఎందులకు?

సు:—మాకోన నీకుసూపడానికి.

బ:—ఆడనే నిన్నుంచుకోవడానికి.

పద్మా:—మిమ్మెవ్వరుపంపిరి?

సు:—నేనింట్లోనైన సెప్పిరాలా. నన్నోరుపంపుతారు?

బ:—నేనే నడిసివచ్చినా. నన్నోరుపంపుతారు?

పద్మా:—అట్లుకాదు. నన్నిక్కెత్తికొనిరమ్మని మీకెవ్వరు బోధించిరి?

సు:—యెవ్వరైన యేంటికి బాదిత్తారు. మాది యాపకోన. తలకాయలు మట్టంగ తీసేటోండ్లమే. మామాటెరికెలా?

బ:—(కత్తిదీసి) యిదిసూడెట్లుందో. మాటనోటినుంచియెత్తే కడుపులోకి దించడమే. నన్నోరు బాదిత్తారు? నీకేంబయమేస్తదా? గుడిశకెల్తానే నీకురచ్చకట్టిత్తాలే. బయపడాకు.

పద్మా:—(స్వగ)అయ్యో! యెట్టికష్టములు నన్నలముకొనినవి? వీరిరువురు నొకరినిమించి యొకరుమూర్ఖులు. భవానీదేవియీ కష్టపరం పరనుండి నన్నెట్లుద్ధరింపఁగలదో తోఁపకున్నది. (ప్రకాశము) మిమ్ము బాధించుటకాదు. మీయొద్ద పొడుగు మీకత్తులు వీనినెల్లఁజూచి మీరు వీరులనియే నేను దలంచి యున్నాను కాని

సు:—కానికాదు. యిదికోన. లేకుంటేకోన. యిదో నాదిక్కుసూడు. అమ్మోరా! యీయాపకోనలోఉండే మొగోళ్ళందఱికి నేనుమొగోణ్ణి. నన్నుమించిన మొగోడు యీకోనలోలేడు.

బ:—ఏంటిమొగోనివిరానీవు ముసిలినాయాలా? అన్కోని పోవాకు. అమ్మోరిని తాకితే తెగనరికే.

సు:—నీయడ్డమేం? అమ్మోరడుగుతది. నేను సెప్తుకుంటా.

పద్మా:—మీరిద్దఱు నెవ్వరు చెప్పినమాటపై నన్నుఁదీసికొని వచ్చి యున్నారు?

సు:—బ:—(మొగములు చూచుకొనుచున్నారు).

పద్మా:—ఏలసందేహించెదరు? చెప్పుఁడు.

బ:—సెప్పం. మేంమాటయిచ్చేసినాం.

సు:—సెప్పితేసెప్పనేసెప్పేం. సెప్పకుంటేసెప్పనేసెప్పకపొయ్యేం. అంతేమామాట.

పద్మా:—చెప్పకున్నఁ బోనిండు. మీరిప్పుడేమికోరెదరు? నేనుధరించిన సొమ్ములు గోరెదరా? నాప్రాణముగోరెదరా?

సు:—అబ్బో! యెంతమాట. పెమానంగా కోరను. నీసొమ్ము నేయేసి తగలనే తగలను. నీవుకోరితే నాపానంతీసి నీపాదాల మీంద ఉంచుతా.

బ:—నీయెంటిగ్గూడ కదలనీను. నిన్నేమైనాసేయాలననివస్తే వాణ్ణి యిదోయీాకత్తితో పిచ్చలుపిచ్చలుచేసేస్తా. నీకనుమానంగా ఉంటే నీపాదాలు నాతలకాయమీంద మోపు. మోసకొస్తా.

సు:—నీతలకాయమీాందేంటికి? నాతలకాయమీంద పెట్టిచ్చుకుంటా. అమ్మోర్నరికాళ్ళు కడుక్కొని తాగుతా.

పద్మా:—సరి. నన్ను మీరుచంపఁదలఁచి తేలేదుగదా? ఏందులకై తెచ్చితిరి?

సు:—(నవ్వుచు) యేంటికితెచ్చినామోలే తెచ్చినాం.

బ:—యూపకోవకు పిలసకపోవడానికి తెచ్చినాం.

పద్మా:—వేపకోనకేల పిలుచుకొనిపోయెదరు?

సు:—సెద్దాంతా బల్లిగా!

బ:—అంతగా అడుగుతది సెప్పేతాం.

పద్మా:—చెప్పుఁడు. మీాకేటికిభయము?

సు:—బయురు. ఈకోనలోపడితే పులులైనా మన్నుల్ను సెనకలేవు. యిదేయపురంరాజుగారిసిబ్బంది నాలుగుమాట్లు మన్నుల్ను పట్టాలననివచ్చి సేతకాక యింటికెల్లింది. నాపేరేరికెలా?

బ:—సాల్లేరా నీపెతాపం సుత్తిగా.

పద్మా:—ఈమాటలు పోనిండు. చెప్పందలంచినది చెప్పండు.

సు:—నేను సెపుతా.

బ:—ఊ. హూ. నేనేసెపుతా.

పద్మా:—ఎవ్వరుచెప్పిననేమి? ఎవరో యొకరు చెప్పండు.

సు:—అయితే నేనేసెప్తా. బాగయిను. యిదేయపురంలో శనం టోడోకడు దాపరిచ్చి ఊర్కె బాదిచ్చ. బాదిచ్చంగా బాదిచ్చంగా కొంచెం సెవ్వాలేస్తి. యాలేత్తానే పట్టకెళ్ళినీవుపండుకునేతావు సూపె. సూప్తానే యెక్కుపెట్టుకోనుండి రేయికిరేయేవచ్చినాం. వత్తానే మిద్దెక్కినాం. యెక్కుతానే నిన్నుసూసినాం. సూత్తానే మంచంయెత్తుకున్నాం. యెత్తుకుంటానే దిగినాం. దిగుతానే దోవపట్టినాం. పట్టుతానేఊరుదాటినాం. దాటుతానే అర్ణింలోకివచ్చినాం. వత్తానే మడిమెత్తుపరువున నడిసినాం. నడుత్తానే యీడికొచ్చినాం. వత్తానే తెల్లోరింది. తెల్లోరుతానే నీవుమేలుకున్నావు. మేలుకుంటానే దించమన్నావు. దించమంటానే దించినాం. దించుత్తానే నిన్నుసూసినాం. సూప్తానే మాట్లాడినాం. మాట్లాడుతానే మనుసుకరిగింది. కరుగుతానే మమతపెరిగింది. పెరుగుతానే మరులుపుట్టింది. పుట్టుతానే నీతోసెప్పుకున్నా. సెప్పుకుంటానె నీవుమనుసుంచాల. మనుసుంచుతానే మనకోనసేరుదాం. సేరుతానే గుడిశకెళ్ళుదాం. యెళ్ళుతానే నీవుబువ్వసై. చేత్తానే కూడుతిందాం. తింటానే కూరుకుపడుదాం. పడుతానే కలవరిత్తాం.

కలవరిత్తానే మేలుకొందాం. మేలుకొంటానేమళ్ళ బోజనం. మళ్ళ నిద్ర. మళ్ళ కల. మళ్ళ గుడిశ. మళ్ళ నీవు. మళ్ళ నేను. మళ్ళ మళ్ళ మళ్ళ మళ్ళ అన్నినూసుకుందాం.

బ:—యేంటిదిరా యీసుద్దంతా పిచ్చినాయాలా! యెర్రిర్రికూతలన్నీ కూస్తాఉండావు. అమ్మోనారా! నేను సెలవిస్తా. ఒకదుర్మార్గపోడు సుత్తిగాణ్ణి దయ్యమైపట్టి నిన్నుయాపకోనకు తెమ్మంటని బాదిచ్చినాడు. డబ్బు మూటలుమూటలు యిస్తాసనిఅశ పెట్టినాడు. యీఆశపోతునాయాలు నాకాడికొచ్చి ఊర్కేకాళ్ళ కేళ్లకుపడి బంగపోయినాడు. కాదుకూడదంటని అన్నాడు. కండ్లనీళ్ళుపెట్టినాడు. యీణీవీకడకుతట్టుకోలేక 'ఊ'అంటని అన్నా. వచ్చినా. నిన్ను తెచ్చినా. నిన్నుసూసినప్పటాలనుంచి ఆమోసగాణికాడికి నిన్ను తీసకెళ్ళడం నామతికి సాగసనేలా. నిన్నుసూస్తే పూచినతంగేడు చెట్టాల ఉన్నావు. మర్మతుడు నాకంటికగపడతాఉన్నాడు. నీమీదనాకు బోపాణంగా ఉంది. నీపాణం నాపాణం ఒకటిసేసి నన్నుబతికిచ్చుకో. నీమేలు నేనుమరసను.

రు:—బల్లిగా! నిన్నుసూత్తే నాకు కోపమేస్తుంది. నీవూరకో. అమ్మోనారా! నాదిక్కుసూడు. నేనందగాణ్ణి. యీశాయాలేనాటి అందగాడు? నీకన్నీ తెళుసు. నీమనుసు.

బ:—నీవుజోల్లు కూతలుకూస్తే నాకుపైఅంతా మండుతది.

పద్మా:—(స్వగ)ఓరీపాపాత్ములారా! చివరకెంతకువచ్చితిరి? అయ్యో! వీరిరువురు మూర్ఖులలోమూర్ఖులు. సురాపానమున నొడలుమఱచినవారు. కామోద్రిక్తమనస్కులు. ఇప్పుడు నేనేమిచేయందగును? (ప్రకాశము)అన్నలారా! యెంటినున్న నన్నుఁదెచ్చి యిటులాడుటుచితమా?

బః—నిన్ను మోసగించి తెచ్చిందల్లా యీసు త్రిగాడే. దీనికి యీణ్ణె సున్నంలోయిరబోయి. నేను మంచోణ్ణి. నీవుసెప్పినట్టు యినేవోణ్ణి. సేయమన్నట్టు సేసేవోణ్ణి. నామీంద కోపంసేయాకు. నామాట యిను. నాదిక్కుసూడు.

సు:—వానిదిక్కు సూడనేవొద్దు. నామీందనే కన్నుంచాల. నేను కట్టపడి తెచ్చినా. పాత్రించుకుంటా. అమ్మోరా? నీకుదండ పెడ్తా. సూపంతానాదిక్కే.

పద్మా:—(స్వ) అయ్యో! వీరినుండి తప్పించుకొన నుపాయములేదు. నీతులుబోధించి వారించుటకు వీరు శిలాహృదయులు. ఖడ్గమునుపయోగించుటకు దృఢగాత్రులు. కృతహస్తులు. అందున నిరువురు. (యోజించి) ఒక్కటి తోచుచున్నది. సంభాషణమునుబట్టిచూచిన నిరువురకు మైత్రియున్నట్లు కానరాదు. ఈయంశమాధారముగా నెట్లోయీవిపత్తు గడవవలయును.

బ:—అమ్మోరా! పలకవేం? వాక్కుదయసేయి.

సు:—అమ్మణ్ణీ! యీణిమాట సెవుసందిన సేరనీయాకు. పెమానంగా సెప్పుకుంటా. నిన్నుసూసినాలనుంచి నాకండ్లుకాళ్ళు సల్లపడినాయి. దేయమంతా మాసుమసలుతాఉంది. నిన్నిడిసిపెట్టాలనంటే కాళ్ళాడడంలా. నీకాడకూకోని కాళ్ళుపిసుకుదామంటని బుద్దిఉంది. నీవునాయెంటరా. నామాటింటే నీకుదినాంగంపెడేసిసొమ్ము తెచ్చిపెడ్తా. నీవేసోకుండేసొమ్ములుబాగలా. కొత్తసిగిరింతతెచ్చి నీకు రాకణీ పిల్లాండ్లు సేయిత్తా. పల్లేరుకాయల్లుసెక్కి నీకు బాజుబందు లల్లిత్తా. పైకోనకెళ్ళి పారటాకులుతెచ్చినీకుసీరకట్టిత్తా. నీమొగానికి చెంద్రిరం పూయిత్తా. నీవు సింగారించుకోని కులుకుతాఉంటే సూసిసూసి కండ్లుమూస్కాని సుకపడతా. నీవుకూకుంటే నాగుడిశంతా యె

లిగిపోతది. నన్నుమరసాకు. దయసూపిచ్చు.

బ:—సాపోవ్! యీాడునట్టిమోసగాడు. నీవీణ్ణి నమ్మాకు. నాయెంటవస్తే నీవుసుకపడతావు. నీసొమ్ములు నీకాడనేఉంచుకో. నీకన్ని తెచ్చిస్తా. వాయించుకోను నీకు పిల్లగోయి తెచ్చిస్తా. గోపిలకాడ గోపాలకిట్టమ్మలాగ నీవుదాన్ని ఊదుతాకూకో. నీవు పలికిచ్చేపాటకు నాకుతలతిక్కపట్టి నీపాదాలకాడ పడిపోతా. అమ్మోనారా! నీకుపిల్లిగడ్డలు తెచ్చిస్తా. నీకుపైలంతా బెండ్లసొమ్ములు పెట్టిస్తా. యాపకోనలో మంచిమంచిపాలికిమాండ్లుండాయి. నీవు కోరేసొమ్మంతా సేయిస్తా. కొధవలేకుండానిన్ను సేవిస్తా. ఇదో ఒక్కసూపుసూడు. నీవుసింతసేయాకు. నాపాణం యెగిరిపోతుంది.

పద్మా:—ఇప్పుడీకథలతో నేమిపని? మీారొకరికొకరేమికావలెను?

సు:—నీవు కావాల్ను.

బ:—నాక్కావాల్ను.

పద్మా:—నేనడుగునది మీాకుఁదెలియలేదు. నీవతనికేమికావలెను?

సు:—యీాడు నాకల్లుడుకావాల.

బ:—యీాడు నాకు దూరంసుట్టం. మామవరసోడు.

సు:—యీాణికి నాకు శానాళ్ళనుంచి అతకలా. యీాణిగుడిశయేరే. నాగుడిశయేరే.

పద్మా:—మీారిప్పుడు నన్ను వేపకోనకురమ్మని కోరుచున్నారుకదా? మీాకునాయెడ మంచిమనసుగలదని యేమినమ్మకము?

బ:—నీవుసందెకాడ కన్నుకూాక్కతానే యీాడు నీసొమ్మంతాలొట్టేయక్పుంటే నన్నుపేరజే పిలసాకు. నాగుడిశకురా. యీాపుమీాంద కూాకుండబెట్టుకొని తీసకెళ్ళుతా. నాకు కొత్తయీాతసాపఉంది. గుడిసెలో యీాతసాపమీాంద ఉమ్మెత్తపూాలు పరిసి

నిన్నుపండుకోపెట్టి నిద్రపోగొడ్తా. నాకునీమీంద షేమయెంతోఉంది.

సు:—నీమీందనాకీ గుట్టంతషేమఉంది.

బ:—నాకుకొండంతషేమఉంది.

సు:—నాకీబ్యమ్మాండమంత షేమఉంది.

బ:—నాకుకోటిబ్యమ్మాండాలంత షేమఉంది.

సు:—నాకు బ్యమ్మాండమన్ని బ్యమ్మాండాలంత షేమఉంది.

పద్మా:—మీమాటలు నాకునమ్మకము గలిగింపలేదు. నన్నుఁదెమ్మని మిమ్ముఁబ్రేరేచిన వాఁడెవ్వఁడో తెలిపినఁ బిదప నా మనసు మీకుఁదెలిపెద.

బ:—నేసెప్తా యినుం.

సు:—(తొందరతో)యీణికి తెలనేతెల్దు. యేదీ సెప్పమను యేం సెప్తాడో సూత్తాం యీణిమొగం.

బ:—యిదో నాసంగతెరగవు. ఎర్రమొన్మారింటాఉందని యేమేమో వదిరిసస్తాఉండావు. నామాటెత్తితే సెడిపొయ్యేవు.

సు:—నామాటిను నేసెప్తా. యిదేయపురంలో రాజుగారొద్ద సిబ్బంది గిబ్బంది సూసుకుంటా ఉండలా? ఆయనపేరు నోట్లోనే ఉంది.

బ:—కత్తులు కటార్లు పట్టుకోనుంటడే ఆయన.

పద్మా:—సరి. యెవఁడోయొకఁడు.

సు:—సెప్తా. కొంచెము తట్టుకుంది. ఊఁ హూ! రాలా. ఆయనకొడుకు పొడల్పొడలోడు. సిన్నప్పటాలనుంచి అందగత్తెలను తగులుకొని ఉండేటోడు. ఆయన పదిదినాలనుంచి నాకాడికొచ్చి గుడిసెలో కూకున్నాడు. నీవుకావాలనంటని ఆమాంతంగా సంపుతాడు. రేయంతా నిద్దరపోనీడు. ఆనుకొని పండు

కుంటాడు. కన్నుమూసేటాలకల్లా మామా! మామా! అంటని కలవరిత్తాడు. నాలుగు సంచులనిండా డబ్బుతెచ్చినాడు. కింద కుమ్మరిత్తాడు. ఎళ్ళ సంచిలోయేత్తాడు. గలగలలాడిత్తాడు. రాజుపంపితే నీమొగోడు దేచాంతలం పోయినాడంటనిసెప్పినాడు. నన్ను బల్లిగాణ్ణి పిలుసుకొని యెళ్ళినాడు. మీ యిల్లుసూపినాడు. అవతల యింతదూరం జరిగింది. యిది నడిసీన సత్తెం.

పద్మా:—నన్నుఁ దెమ్మనినవాఁడు సేనాధిపతికుమారుఁడై యుండునా?

సు:—ఆ. వాడే. వాడే.

బ:—ఆగూబకండ్లోడే. వొంటిమెగోడు.

పద్మా:—వానిపేరు తెలియదా?

సు:—తెలుసు.'మ' అంటనివస్తది. మచనడేమో అంటారు.

బ:—అదిగాదసీ మడతనాలికనాయాలా! మతనడనాల.

పద్మా:—మదనుఁడా యేమి?

సు:—అదే అదే మథనడు.

పద్మా:—అతఁడిప్పుడెచ్చటనున్నాఁడు?

సు:—యీపకోనలోనె.మనగుడిశలోనె .నిన్నరేయేసేరుకోంటాడు.

పద్మా:—మంచిది. ఇప్పుడు మనమేమిచేయవలెను?

సు:—గుడిశకెల్లుదాం.

బ:—కూడ నేకూడదు. నాగుడిశకేపోవాల. నాగుడిశకొస్తేనీకు ఉపసారాలన్ని జరగతాయి. మాయమ్మ నిన్ను సూపెట్టుకో నుంటుంది. వానెంటపోతే మోసగిస్తడు.

సు:—నీదొంగకండ్లుసూసి అమ్మణ్ణే నిన్నుకనుక్కొంటుంది.

పద్మా:—ఒకవేళ నేను వేపకోనకు వచ్చెదననుకొనుఁడు. ముందుగ నెవనిగుడిసెకు రావలెను?

సు:—నాగుడిశకే.

బ:—ఇదో నీగుడిశకగ్గిపెడ్తా. అమ్మణ్ణి నాగుడిశకేరావాల.

పద్మా:—మీరిరువురు మైత్రితో మెలఁగలేరా?

సు:—యీాణిమొగం నేసూసేవోణ్ణేకాదు.

బ:—మాకోనలో యీాడుయెదురుగావచ్చినా పలకరించరు. గాసారంసాలక యీాపొద్దు నేనుసేరుకున్నా.

పద్మా:—మీరిరువురుగలసి నన్నుఁదెచ్చియున్నారు. మీాయిద్దఱినొక్కమాత్రే నేనుచూచియున్నాను. మీాగుడిసెలకురావలెననియిరువురుగూడఁ గోరుచున్నారు. ఒకవేళ నేనువేపకోనకువచ్చిన నాగుడిసెకనియొకఁడును నాగుడిసెకనియొకఁడును బెనఁగులాడుచుండుట మాత్రము నాకిష్టముగాదు.

సు:—అవును అదిసిక్కే.

బ:—సిక్కులో సిక్కు. ఒక్కనియెంటనే రావాల.

పద్మా:—మీాలోమీారిట్లు కలహించుచున్న నేనొక్కయుడుఁగైనఁగదలిరాను. కావున మీాలోమీారు నిర్ణయించుకొనుఁడు. ఒక్కఁడు మానుకొనవలయును. ఒక్కఁడుపూనుకొనవలయును. అట్లుచేయుఁడు.

సు:—ఇంతదూరమేంటికి? యీాణిమాట సెవనేపెట్టాకు. నాగుడిశకురా. యీాడేమైనా గుక్కురుమిక్కురుమంటే యీాణ్ణి అతంసేసేత్తా.

బ:—యీాణ్ణి నలిపి పొడిసేసేస్తా. నాగుడిశకే నీవురా. బెమ్మదేముడొచ్చినా నిన్ను గెంటించలేడు.

సు:—ఇదో నిన్ను తరుక్కొనితింటా.

బ:—నిన్ను నవిలేస్తా.

సు:—నిన్ను సించేస్తా.

బః—నిన్ను పీసుపీసులేపుతా. నాసంగతెరగవు.

పద్మా:—మీారూరకుండుఁడు. నేనొక్కటిచెప్పెద గ్రహింపుఁడు.

సు:—సిత్తం. సిత్తం.

బః—పెసాదం. పెసాదం.

పద్మా:—నేనేమిచేయుమన్నను జేసెదరుకదా?

సు:—సేసితీరుతా. పాణమిామంటే యిచ్చుకుంటా.

బః—పులినోట పడమంటే పడతా. ఇంగేంసేయమంటే అదిసేస్తా.

పద్మా:—మీాయొద్ద ఖడ్గములున్నవి.

సు:—ఇదో (కత్తిచూపుచు) పదిమందిగొంతులైనా ఒక్కపాలేతె గేసది.

బః—(కత్తిచూపుచు)యిదిపోతే గుండకాయలోకే.

పద్మా:—ఇఁకమీాఁద మీాకుఁబగలేకుండ నాకుశ్రమములేకుండ మీారిరువురొక్కయెడకేగి యుద్ధమునేయవలెను. చేయుటలో దేహములమీాఁద నాశపీడి చేయవలెను. ఎవ్వఁడు గెలిచివ చ్చునో వానిగుడిసెకు నేనువచ్చెదను.

సు:—మిగిలినోని గుడిశకో?

పద్మా:—ఒక్కఁడేకదా మిగులును? బ్రదికి జయమొందివచ్చినవా నిగుడిసెకు నేనువచ్చెద.

సు:—సరే. (బల్లిగానితో) యింగ రారా! నాయేటెరికసేస్తా.

బః—ఇదోనేను పొట్టసించేవోణ్ణి. యెరికలా నాపెతాపం?

పద్మా:—సమీాపమున మీారుపోర నారంభించిన నేనుభయపడుదు ను. నేనీమంచముపైఁగూర్చుండి చూచుచుండెద. ఆకనఁబడు దిరిసెపుఁజెట్టునీడలో యుద్ధమునేయుఁడు.

సు:—సిత్తం. పాపోవ్! నీవున్నాకే గెలుపుకోర్కోవాల. నీపాదాల కు దండం.

పద్మా: నీక జయమగును.

బ:—యీణశిక్కొద్దు. నాకేకోర్కోవాల. నిన్ను దానిస్తాఉంటా.

పద్మా:—నీకు నంతయే. ఇఁకఁబొండు.

బ:—యిప్పుడు తెలస్తది యెవ్వరి పెతాపం.

సు:—యిప్పుడు తెలస్తది యెవ్వరిపీకరం.

బ:—రా.

సు:—పా. (ఇరువురు నిష్క్రమించుచున్నారు.)

పద్మా:—ఈయుద్ధమున నొకఁడు తెగును. మఱియొకఁడు మిగిలివచ్చిన నాలోచించెద. (చూచి) అప్పుడే యిరువురును బోర నారంభించిరి. వీరెంత క్రూరులు! ఎంతపశుప్రాయులు! ఆహా! యేమి యీయద్భుతవిధము! పరస్పరఖడ్గాఘాతముల నిరువురునుబడిరి. మూర్ఛిల్లిరేమో కనుఁగొనెద. (పోయిచూచి వచ్చి) ఇప్పటికి నేనదృష్టవంతురాలను. ఇద్దఱును దెగిరి. ఇఁక నేనీప్రాంతమున నుండరాదు. కాని విదేహపురమునకుఁ బోఁజాలను. దొరకినమార్గమునుబట్టి నడిచి యడ్డమైనపురమును జేరెద. ఇప్పటికదియకర్తవ్యము. పిదప నాథునినెమకు నుపాయమునాలోచించెద. (నడచుచు) ఆహా! ఏమియీవనరామణీయకము!

తే।గీ॥ పూలమొత్తంబులును దలఁ ♦ బ్రాలు గాఁగఁ
బరభృతధ్వని మంగళ ♦ వాద్యరుతిగ
నలరు లతకూనలెల్ల ము ♦ త్తైదువులుగ
వనము కల్యాణసదనశో ♦ భల రహించె.

ఇప్పుడు ప్రతినిమిషమును మిక్కిలి యమూల్యముగనున్నది. కాలహరణము సేయరాదు. (నిష్క్రమించును.)

ద్వితీయరంగము.

# పద్మావతీవిజయము.

## పంచమాంకము

---o---

ప్రథమరంగము. పుష్పపురమున స్వయంవరమంటపము.

మంత్రిసుగుణసారుఁడు సుబ్రహ్మణ్యసోమయాజియుఁ బలువురు రాజకుమారులు నసంఖ్య ప్రేక్షకులును వారినడుమఁ బురుష వేషమునఁ బద్మావతియు నుందురు.

సుగు:—స్వామీ! సుబ్రహ్మణ్యసోమయాజిగారూ! యంతయు సిద్ధమా?

సుబ్ర:—నాయనా! యంతయుసిద్ధమే. బ్రాహ్మణోత్తములునుము త్తైదువులును వచ్చియున్నారు. నేను సమస్తపరికరములను సమకూర్చుకొని యున్నాను. ఆలస్యమెందులకు? లగ్నమాసన్నమ యినంతనే కార్యమునకుపక్రమించుదము. కన్యకు మంగళ స్నానము చేయించినారా?

సుగు:—స్నానముచేయించి సమస్తాలంకారసముపేత నొనరించియున్నారు. రాజన్యకుమారులనేకులు వచ్చిచేరుచున్నారు. మీ యాజ్ఞయయిన క్షణమున మహారాజుగారి పుత్రికను రప్పించెద.

సుబ్ర:—నాకింకేమియు వలదు. కొంచెము పసపును గుంకుమము ను బుష్పములునక్షతలును మాత్రము తెప్పించినఁజాలును. దర్భలకట్ట నేనే తెచ్చియున్నాను.

సుగు:—అన్నివస్తువులిచ్చట సిద్ధముగనున్నవి. వలసినవిధమున నుప యోగించుకొనుఁడు.

సుబ్ర:—నాయనా! రాజుగారిపట్టపుగజము నలంకరించి తెచ్చియు న్నారా?

సుగు:—గజము సిద్ధముగనున్నది. హారములనుగూడఁ దెప్పించియు న్నాను.

సుబ్ర:—ఇఁక నాలస్యమేల? వచ్చినరాజకుమారులతోఁ జెప్పఁద గ్గమాటలు చెప్పుము. స్వయంవరమునకు వేళయైనది.

సుగు:—చిత్తము. (అనివెళ్ళి లీలావతితోఁ బ్రవేశించును.)

1రాజు:—(స్వ)ఆహా! యీవన్నెలాడి మిఱుమిట్లుగొలుపుమెఱుపువ లె నాకన్నుల కగపడుచున్నది. ఇట్టిసుందరాంగిని నేఁజూచి యెఱుఁగను.

2రాజు:—(స్వ) ఆడిన నిట్టిసౌందర్యవతిని బెండ్లాడవలయును. ఏమి యీమెమోహనమూర్తి!

3రాజు:—(స్వ)ఈమెవాలారుఁజూపుల కుపాయనముగ నారాజ్యము నంతయు నర్పించుకొన్నను గొదవగనేయుండును. ఈమెన న్ను వరించెనా నావంటిధన్యుఁడీలోకముననుండఁడు.

4రాజు:—(స్వ) ఈపడంతి సర్వాంగసుందరి. నన్నెవరించునని యే టికి నిశ్చయింపఁగూడదు? ఏమోనాయదృష్ట మెవ్వరెఱుం గుదురు?

సుగు:—(లేచినిలిచి) పరాక్రమపూజ్యులరగు నోనరేంద్రనందను లారా! నావిధేయాహ్వానమునుమన్నించి శ్రమమెంచక మీ రెల్లరింతదూరమువిచ్చేసి నన్నుగౌరవించినందుల్కై నేనుమీ యెడఁ గృతజ్ఞుఁడనగుచున్నాను. ఆజన్మశ్రీమంతులరై మహా ధికారసంపన్నులరగు మీరు నన్నుగౌరవించుటలో మీయు

దారహృదయము వెల్లడియగుచున్నది. మిమ్ము దర్శించి నేను మిక్కిలి ధన్యుఁడనైతిని. ఓసకలదేశాధీశకుమారకులారా?

ఉ॥ మాజననాయకుండు గుణ ♦ మాన్యుఁడు విక్రమసేనుఁడల్లకాం
భోజనరేంద్రునిన్ సమర ♦ భూమిని సేనలతోడఁ గూల్చి వి
భ్రాజదనూనశౌర్యవిభ ♦ వంబునఁ బుష్పపురంబు చేరి య
వ్యాజకృపారతిన్ బ్రజల ♦ నందఱ నేలుచునుండెవాసిమై.

శత్రురాజ్గర్భనిర్భేదకంబుగఁ బ్రజలనిజపుత్రాధికప్రీతినేలుచుఁ గొంతకాలమునకు వ్యాధిపీడితుఁడై యాకస్మికముగ దివికేగుట యందఱకు విదితమే. విక్రమసేనమహారాజుగారి యానతి నాయనయనంతరము సూర్యునిపరోక్షమున మిడుఁగురుఁబురువుఁబోలె నీరాజ్యకార్యముల నేనుజూచుకొనుచున్నాను. మాయేలికకుఁ బుత్రసంతానములేక యీలీలావతీదేవి మాత్రమొకకూఁతురున్నది. యౌవనవతియై యీమె పరిణయయోగ్యయయినది. ఈనాఁడు స్వయంవరోత్సవముజరపఁదలంచితిని. మీరెల్లరును దయతో విచ్చేసితిరి. మహారాజుగారి భద్రగజము నలంకరించి తెప్పించియున్నాను.

తే॥గీ॥ సకలరాజకుమారక ♦ సమితిలోన
భద్రగజరాజ మేమహా ♦ భాగ్యరాశి
కంఠసీమ హారమునిడి ♦ గారవించు
నతఁడె లీలావతిగ్రహింప ♦ నర్హుఁడయ్య!

స్వయంవరమున విజయోపేతుఁడై నిలిచిన రాజకుమారునకీ పుష్పపురరాజ్యముగూడ సమర్పింపఁబడును. మీరందఱను మతింతురేని భద్రగజమును రప్పించెద.

1 రాజు:— కానిమ్ము.

2 రాజు:— చేయవచ్చును.

3రాజు:—ఆలస్యమేటికి? శీఘ్రముగఁ దెప్పింపుము.

4రాజు:—దంతావళమింతకే వచ్చియుండవలసినది.

సుగు:—యిప్పుడువచ్చుచున్నది. (గజమువచ్చును. సుగుణసారుఁడే నుఁగుదిక్కై.)

ఉ॥ శ్రీనరవర్ణినీ రుచి హ ♦ సించెదు నీమనరాజపుత్రి లీ
లావతి పెండ్లియాడ గుణ ♦ లక్షణశౌర్యధనాఢ్యుఁడైన క్షో
ణీవిభుపుత్రు నొక్కని గ ♦ ణించి తదుజ్జ్వలకంఠసీమ నీ
పావనపుష్పదామమిడు ♦ భద్రగజంబ! యుదారబుద్ధివై.

(హారముతొండమునకందిచ్చును. శుండాలమునడచును.)

1రాజు:—(స్వగతము) ఏనుఁగు సూటిగా నాకడకువచ్చుచున్నది. నేనుమహాభాగ్యోదయుఁడను. (కుంజరముదాఁటిపోవును.) ఛీ! యీగజమునన్ను దాఁటిపోవుచున్నది. ఇఁక నేనిందేటి కుండవలెను?

2రాజు:—(స్వగతము) నాయొద్దఁదప్పక నిలుచును. నాకడనీకళింగ రాజు యోగ్యుఁడుగాఁడు. నాగళమున హారముపడిన లీలావతిచేసికొనినదే పుణ్యము. (హస్తి మూడవరాజు సమీపమున కేగుచున్నది.) ఛీ!ఛీ! యిది నడువరానిపని. గొప్పపొరపాటు. నన్నుదాఁటిపోవచ్చునా? ఏమిది?

3రాజు:—(స్వగతము) నాయొద్దనిలుచునో లేదో. నడకకొంచెముత గ్గించినది. నావంకనేచూచుచున్నది. నిలుచును. నిలుచును. ఏనుఁగులు మిక్కిలి తెలివిగలజంతువులు. త్వరితముగవచ్చి హారము నాగళ్ళమునవేయరాదా? (గజమువలికినడుచును.) ఛీ! యాకారమునఁ బెద్దజంతువేకాని దీనికిబుద్ధి కొంచెమైన లేదు. నన్నుదాఁటిపోయినప్పుడే లీలావతికిమంచి మగఁడు లభింపఁడని నిశ్చయింపవలసినదే. కరిరాజమా! తెలివిమాలి యవలికిఁబో

ఫ్రుచున్నావు. వెనుకకు మఱలుము. మఱలుము.

4 రాజు:—అదృష్టమనఁగా నాది. రాజకుమారులలో నెల్లఁ బరాక్రమగౌరవమున నగ్రగణ్యుఁడనయినను నేను గడపటఁగూరుచుంటిని. అదృష్టదేవతకటాక్షమున్న నెచ్చటఁగూర్చుండిన నేమి? నేను కడపటివాఁడ నగుటఁ గుంజరము నన్నుదాఁటిపోదు. తప్పక హారము నామెడనునైచును. ద్విరదమా! యాలస్యమేల? హారమునిట్లిమ్ము. (వారణము దాఁటిపోవును.) అయ్యో! ఏమినామందభాగ్యము! చీ!చీ! స్వయంవరములకు వచ్చునంతటి బుద్ధిహీనపుఁ గార్యమే లేదు. ఇందఱిలో నింతటి యవమానము పొందవలసివచ్చెను. అయ్యో! భద్రగజమా! వెనుకకువచ్చియయిన నాగళమున హారము నిడరాదా?

(ఏనుఁగు కదలిపోయి జనసమూహమునఁ బురుషగూపమున నున్న పద్మావతికంఠమున హారమునువేయును. జనులు జయజయధ్వానములొనరింతురు.)

పద్మా:—(హారమునుగ్రహించి స్వగతము) ఇదియునొకవిధమున ననుకూలముగనున్నది. దైవికముగ లభించిన యీయవకాశమును ద్రోసివేయరాదు. భగవంతుఁడేదియో మేలు నుద్దేశించి యుండును.

సుగు:—అయ్యా! మీనామధేయాదులను వివరింపుఁడు.

పద్మా:—నేనొకరాజాపత్యంబను. నన్నుఁబూర్ణచంద్రుఁడందురు. కారణాంతరమున నింతకన్న నెక్కుడుగఁ జెప్పఁజాలను.

సుగు:—చెప్పినంతయేచాలును. గుణరత్నాకరులరగు నోసభాసదులారా! భద్రగజము పుష్పహారము నీపూర్ణచంద్రుని గళమునవైచినది. కావున లీలావతీదేవి యితనినివరించును. (లీలావతితో) తల్లీ! యీమహాపురుషునిసుమమాలాలంకృతునిజేయుము.

(లీలావతి సిగ్గునఁదలవంచుకొనిపుష్పహారము వేయును.)

సుబ్ర:—తదేవలగ్నం సుదినంతదేవ తారాబలంచంద్రబలంతదేవ విద్యాబలందైవబలంతదేవ లక్ష్మీపతేతేంఘ్రియుగంస్మరామి.

సుగు:—పూజ్యులారా! లీలావతీదేవిని బుష్పపురరాజ్యలక్ష్మినిబూర్ణచంద్రుని వశముచేయుచున్నాను. (రాజకుమారులు నిష్క్రమించుచున్నారు.) పూర్ణచంద్రా! పట్టాభిషేకాదికార్యములు మీయిరువుర యిష్టముననుసరించి జరపఁబడును.

పద్మా:—మంచిది. (లీలావతితో) దేవీ! సౌందర్యవతి వగు నీవును విశాలమగు నీపుష్పపురరాజ్యము నీదినము హఠాత్తుగాలభించినందులకు నేనుమిక్కిలి యానందించుచున్నాను. నీతో నొకించుక మాటాడవలసియున్నది.

లీలా:—నేను నీదానను. వలసినవిధమున నాతోఁబనిగొనుము.

పద్మా:—నాతండ్రి యొక విశాలదేశమునకుఁ బ్రభువు. కాని కాలమించుక యనుకూలముగలేనందున స్వదేశమున నిలువనిష్టములేక నేనును నాప్రాణమిత్రుఁడు చంద్రసేనుఁడను నొకరాజకుమారుఁడును దేశాంతరమునకు వచ్చితిమి. విదేహపురముననుండుతఱిఁ గార్యబద్ధులమై యొకరును గాలబద్ధులమైయొకరును వేఱుతావులకుఁబోవఁదటస్థించి యొకరినొకరెడఁబాసితిమి. ఇప్పటికొక మాసముగావచ్చినను మాకిరువురకును బునస్సమాగమభాగ్యము చేకుఱలేదు. అది యెప్పుడులభించునో చెప్పఁజాలను. నేనిప్పుడిచ్చట దేహమాత్రముతో నున్నాను. నా హృదయము నన్నెడఁబాసిన మిత్రునియెడ వర్తించుచున్నది. ఆయన దర్శనముతోడ మనముసర్వసౌఖ్యములే ననుభవింపవచ్చును. అంతపఱకు మనము కేవలము మిత్రులవలెమాత్రము వర్తింతము.

లీలా:—ప్రాణమిత్రునెడఁబాసి హృదయతాపమునకు లోనయిన నిన్నుఁజూచి నేనుమిక్కిలి చింతించుచున్నాను. నీబహిఃప్రాణము వచ్చిచేరువఱకు నిన్నునేను సర్వవిధముల సేవించుచుండెద. నీమైత్రియే పదివేలని సంతసించెద.

పద్మా:—లీలావతీ! సహజముగ్ధమగు నీమధురహృదయము నాకమితానందమును గూర్చుచున్నది. నాబహిఃప్రాణము వచ్చువఱకు మనము సామాన్యవిహారములఁ బాల్గొనుచు నేకీభావముతో మెలఁగవచ్చును.

లీలా:—నీపదసేవయే నాకుమహాభాగ్యము. నీమైత్రి మహోత్సవము.

పద్మా:—లీలావతీ! యింతలేఁబ్రాయముననే. నీకు దండ్రిలేనివిచారము గలిగినందులకు నామనంబెరిసెడు. ఆఱుమాసములుగ నీవు మంత్రిపోషణమున నుంటివికదా!

లీలా:—మంత్రిసుగుణసారుఁడు మిక్కిలి మంచిస్వభావముగలవాఁడు. నాతండ్రి విక్రమసేనుఁడు శరీరముతో లేఁడనుటయేకాని యీయమాత్యశిఖామణి సదా సహస్రనేత్రములతో నన్నుఁగాపాడుచుండును. ఈకాలమున నిట్టిసహృదయశిఖామణి లభించుట యరిది.

పద్మా:—దేవీ! యితనిచరిత్రము శ్లాఘనీయము. మనమంతఃపురమున కేగుదమా?

లీలా:—పోవుదము.

సుగు:—ఇటుదయసేయుఁడు.

పద్మా:—మంత్రివరా! నాకొఱకొక చిన్నకార్యము చేయవలెను.

సుగు:—(నవ్వుచు) చిన్నకార్యముచేయుటకు నేనలవాటుపడలేదు.

పద్మా:—(నవ్వుచు) ఏమియులేదు. నేనొకచిత్రపటమునొసంగెద. అద్దానిని నగరద్వారముకడఁ గట్టించి తెలివిగలయుద్యోగినొ

కనిని గాచియుండ నియమించి యెవ్వరయిన వచ్చి దానిని గాంచి కోపించినఁగాని, శోకించినఁగాని వారలఁదోడ్కొని వెళ్ళి యొకభవనమునఁజేర్చి యెప్పటికప్పుడువచ్చి నాకు వార్త దెలుపునట్లు కట్టడచేయవలయును.

సుగు:—అవశ్యము చేసెద. మీకు భోజనమునకు వేళయైనది.

పద్మా:—పోవుదము. (అందఱు నిష్క్రమించుచున్నారు.)

ప్రథమరంగము.

ద్వితీయరంగము. రాజసభాభవనము.

పూర్ణచంద్రుఁడు, సుగుణసారుఁడు, పురోహితుఁడు, సామంతరాజులు, ప్రజలు నుందురు.

సుగు:—దేవా! విన్నవించెద.

సీ॥ చిలుకరామాష్టిని ♦ చెలువీసడించెడు
సామంతు లుభయపా ♦ ర్శ్వముల వెలయఁ
గనుఁజెప్పవెట్టక ♦ కాలంబుకనుపెట్టు
కాలజ్ఞులొక్కప్ర ♦ క్కను వసింప
మంగళాశీర్వాద ♦ మహితమంత్రములు ప
ల్కెడు భూమిసురులొక్క ♦ ప్రక్కనుండఁ
బూర్వరాజచరిత్ర ♦ ములు వేయినోళులఁ
బలుకు భట్టులునొక్క ♦ వరుస నిలువఁ

తే॥గీ॥ ప్రజలు గోటానఁగోట్లువా ♦ ర్షమునఁగొలువ
సకలకల్యాణవాద్య ఘో ♦ షములు వెలఁగఁ
బుష్పపురరాజ్యలక్ష్మి యో ♦ పూర్ణచంద్ర!
నిన్ను వరియింప నున్నది ♦ నిశ్చయముగ.

సముద్రోదకము సిద్ధముగనున్నది. వలసిన మంగళవస్తుసముద యమంతయుఁ జేరియున్నది. పట్టాభిషేకోత్సవమున కాలసింప నేల?

పూర్ణ:—మంత్రిశిరోమణీ! నీమంచిమనస్సు నేనెంతయునభినుతించుచున్నాను. నీకార్యనిర్వాహణము స్తుతిపాత్రము. కాని (నవ్వును)

సుగు:—దేవా! యానతిమ్ము.

పూర్ణ:—ముహూర్తమున కెంతవ్యవధియున్నది?

సుగు:—రెండు గడియలుమాత్రమే.

పూర్ణ:—అంతలో.........నీవిటురమ్ము.

సుగు:—ఏమియాజ్ఞ? (అనిసమీపించుచున్నాఁడు.)

పూర్ణ:—(రహస్యముగనేమోచెప్పును.)

సుగు:—చిత్తము. (నిష్క్రమించుచున్నాఁడు.)

పూర్ణ:—పరాక్రమవిశారదులరగు నోసకలసామంతరాజవరేణ్యులారా! వేదవేదాంగపారంగతులరగు బ్రాహ్మణ ప్రవరులారా సుగుణఖనులరగు పౌరులారా! యీపుష్పపురరాజ్యమునకు నన్నును లీలావతిని బట్టభద్రులజేయఁ మీరందఱును జేరియున్నారు. మీకోరిక నానాతిగాభావించి శిరమునధరింప నేనుసిద్ధముగనున్నాను. లీలావతీస్వయంవరకాలమున నేనొకరాజాపత్యంబననియుఁ బేరు పూర్ణచంద్రుఁడనియుఁ జెప్పియుంటిని. ఇప్పుడు పట్టాభిషేకసమయమగుట నాచరిత్రమంతయు మీకు నివేదించుకొందును. ముందుగ నీకుడ్యముననుండు చిత్రపటమును మీరు తిలకింపుఁడు. ఈమెనామము పద్మావతీదేవి యని యందున్నది. ఈమెనుగూర్చి మీరిప్పుడు కొన్నివిశేషాంశములెఱుఁగఁగలరు.

ప్రవేశము మధురవాణీజయకేతనులు

పూర్ణ:—(లేచి స్వగతము)వీరిపావనపదారవిందసందర్శన మెంతకాలమునకుఁ గలిగినది! ఇరువురు నెంతవృద్ధులయియున్నారు! (ప్రకాశము) పార్వతీపరమేశ్వరులఁ బోలిన వృద్ధదంపతులకు నమస్కరించుచున్నాను. వచ్చి యీపీఠములనలంకరింపుఁడు.

జయకే:—(కూర్చుండి) అయ్యా! దినమ్మొకపురముగా సంచరించు మమ్మీయూరనేలనిలిపితివి?

పూర్ణ:—పూజ్యహృదయా! నగరద్వారమున నుంపఁబడిన యీపద్మావతి రూపపటమును జూచి యేలసంతాప పడితిరి? ఈమెను గుఱించి యెఱిఁగినంత వచింపుఁడు.

జయకే:—పూర్ణచంద్రా! నేను మాళవదేశనృపాలుఁడను. పేరుజయకేతనుఁడు. ఎనిమిదివత్సరములక్రిందట నేనును నాభార్యయుఁ గూఁతురు పద్మావతియుఁ గొందఱుబంధువులును గలసి సరయూనది దాఁటుతఱిఁ బైనుండి వఱదవచ్చి ప్రవాహ మొక్కపెట్టున విజృంభింప మేముపయనించుపడవ బోరగిలఁబడి యందఱము నదిలోఁబడితిమి. ఇట్లు ప్రవాహమునఁబడి పోవుచుండఁ గొందఱుజనులువచ్చి మమ్మిరువుర గట్టుచేర్చి మా ప్రాణములు రక్షించిరి. మాముద్దులకూఁతురు పద్మావతి యేమయ్యెనో తెలియరాదు. ఆత్మగర్భమున జనించిన పుత్రికను జలగర్భమునఁ గోలుపోయి మేమిరువురమును రాజ్యమును వదలి దేశాటనమొనరింప నారంభించితిమి. తిరుగరానిచోట్లు తిరిగితిమి. పడరానిపాట్లు పడితిమి. మొన్న నీపురమునకువచ్చి యీపటమును జూచితిమి. నాకుమారిక బ్రదికియుండిన నిప్పుడీపద్మావతీదేవియున్న ప్రాయముననుండి యిట్లేరూపవతిగ నుండునని తలంచి మేమిరువురము దుఃఖించుచుంటిమి. ఇంత

లో మీయుద్యోగియొకఁడువచ్చి మమ్మొకభవనమునకుఁదీసి కొనిపోయెను. నీవు పిలిపింప నిటువచ్చితిమి. ఈపటమునఁ జిత్రింపఁబడిన పద్మావతీదేవి యెచ్చటనున్నది?

పూర్ణ:—ఇంచుకతాళుఁడు. విన్నవించుకొనెద.

జయకే:—కానిమ్ము.

ప్రవేశము యశోవతీజయసింహులు.

పూర్ణ:—పరమపూజ్యులరగు మీకు నమస్కారము. దయచేయుఁడు. (ఇరువురు గూర్చుండుదురు.)

జయసిం:—అయ్యా! మమ్మేటికి రప్పించితివి?

పూర్ణ:—మహాశయా! యీచిత్రమునుజూచి మీరేలచింతించితిరి?

జయసిం:—నేను లలితపురరాజ్యాధీశ్వరుఁడను. నాకుమారుఁడు చంద్రసేనుఁడు బాల్యమున వివాహమాడనొల్లనని పట్టుపట్టియుండి తుదకుఁ దనతల్లిబోధనమున నంగీకరించి కన్యనుస్వయముగఁ జూచివచ్చి పెండ్లాడెదనని వెడలి యనేకదేశములు తిరిగి వెనుకకువచ్చువాఁడై మారాష్ట్రమందలి సోమపురోద్యానమున విశ్రమించియుండుతఱి నాయూరి వైశ్యునింటఁ బెరుఁగుచుండిన పద్మావతినిజూచి యామెపై ననురాగమూని యింటికివచ్చి యావార్త నాకెఱిఁగించెను. నేనావైశ్యునిబిలిపించి నాకుమారునకుఁ బద్మావతినిచ్చి పెండ్లిసేయింపుమని కోరితిని. అతఁడందుల కంగీకరించుచు నొకవత్సరము లలితపురరాజ్యము దనయధీనముచేయఁగోరెను. కొడుకొకయింటివాఁడైనఁ జాలునని నేనట్లొనరించి కుమారునకుఁ బెండ్లిచేసి మగధకువెళ్లి యచట నాతోఁబుట్టునింట మేమందఱము వసించుచుంటిమి. కాని నాకుమారుఁడును గోడలును మాత్రము మగధయందుండక యేదేనిదేశమునకువెళ్ళి యీవిషమా

ద్దమును గడపి లలితపురమునకు వచ్చెదమని చెప్పివెళ్ళిరి. ఇప్పుడు సంవత్సరముగడచి రెండుమాసములైనది. కాని వారింకనురాలేదు. నేను రాజ్యభారము మంత్రిపైమోపి దేశసంచారమొనరింప వచ్చితిని. ఇచ్చటనీరూపపటమునుజూచితిమి. సకలాంగసౌందర్యములయందు నీమె మాకోడలే. ఈచిత్రము గని మేమిరువురము చింతించితిమి. ఈపద్మావతీదేవి యిపుడెచ్చటనున్నది?

జయకే:—అయ్యా! లలితపురాధీశ్వరుఁడవగు జయసింహమహారాజ వానీవు? నీవీరనామములెన్ని మాఱులో వినియున్నాను. నేను మాళవదేశ నృపాలుఁడను. జయకేతనుఁడనువాఁడను. నీకోడలుపద్మావతి వైశ్యునింటఁ బెరుఁగుచుండెనంటివే. అట్లేటికుండినది?

జయసిం:—బాల్యమునఁ బద్మావతీదేవియు నామెతలిదండ్రులును గొందఱుబంధువులును బ్రయాణమొసరించుతఱి నొకనదిలో నావబోరగిలఁబడి యందఱుఁ బ్రవాహమునఁబడిరట. ఆమె మాత్రమెటులో దరిఁజేరిన సోమపురవైశ్యుఁ డప్పుడామార్గమునఁబోవువాఁడీమెను జూచి తనయింటికిఁ బిలిచికొని పోయి పెంచుచుండెనట.

జయకే:—అయ్యో! యట్లయిన నామె నిశ్చయముగనాకూఁతురే.

జయసిం:—ఆలాగా? యట్లయిన మనమిరువురమును సమానదుఃఖభాగులము.

మధుర:—తల్లీ! నీకేగతిం గలిగెనో కదా?

యశో:—వీరు మావియ్యపువారేమో?

పూర్ణ:—మహారాజులారా! యూఱడుఁడు.

ప్రవేశము మదనుఁడు.

మహారాజా! నమస్కారము.

పూర్ణ:—అయ్యా! నీవీపద్మావతి రూపపటమునుజూచి, యేలచింతించితివి?

మద:—(అందఱినజూచి) సత్యమువచించిననన్ను మీరుశిక్షింతురు.

పూర్ణ:—భయపడక యున్నదున్నట్లువచింపుము.

మద:—నేను దీనుఁడ. శరణన్నవాఁడ. నన్నురక్షింపవలెను.

పూర్ణ:—సందేహింపకుము. నీప్రాణమునకు భయములేదు.

మద:—దేవా! నేను విదేహపురసేనాధీశుని కుమారుఁడను. పేరు మదనుఁడు. నేనుబాల్యమునఁ జక్కఁగా విద్యనేర్చికొనక దుర్మార్గుల సహవాసమునఁ ద్రిమ్మరీఁడనయి తిరిగితిని. ఒకదినమునసాయంకాలము విదేహపుర బహిఃప్రదేశమునఁ గాళికాలయమునకుఁ బోవుమార్గమున నిలిచియుండఁ బద్మావతీదేవిదుర్గాలయమునకు వచ్చుచుండెను. కన్నుగాననిమదమున నేనామె నొండొకవిధమునఁ బలుకరించితిని. ఊరకపలుకరించుటయేకాదు. బ్రతిమాలితిని. ప్రార్థించితిని. భయపెట్టితిని. ఎన్నియో చేసితిని. కాని యామె యేమియుఁజలింపక దుర్గాలయముఁ బ్రవేశించి దేవిని బూజించి బయటికివచ్చి నన్నులోనికంపెను. నేనులోనికేగి మ్రొక్కుచుండుతఱి నామె గర్భాలయద్వారములు మూసెను. నేను లోనిఁజిక్కికొంటిని. ఆమె నిమ్మళముగ నింటికివెళ్ళెను. ఉదయమునఁ బూజరివచ్చి తలుపులు దీసిన వెలికివచ్చితిని. అంతటితో సిగ్గుదెచ్చుకొనియుండిన బాగుగనుండియుండును. కాని నాకామెయెడ నీసుగలిగి విదేహపురమున వేపకోనలోనున్న భిల్లులకు ద్రవ్యమునొసఁగి యెట్లయినఁ బద్మావతిని వేపకోనకుఁ దెమ్మని వేఁడుకొంటిని. ఇంతలో నామెభర్త దేశాంతరమున కేగెను. అతిబలాఢ్యులగు భిల్లు

లిరువురొకనాటి యర్ధరాత్రమున మంచముతో నీమెను దెచ్చుటకు సిద్ధపడిరి. నేనామెకొఱకు ముందుగవెళ్ళి వేపకోనలో నుంటిని. భిల్లులారాత్రి యామెను వేపకోనకుఁ దెచ్చియుందురు. కాని యేకారణముననో వారలు సకాలమునఁ గుటీరములకు రానందునఁ గాచి కాచి వేసరి వారి నెదుకుచు నేనరణ్యములోనికివచ్చితిని. కొంతదూరముపోగా నొకమంచముచటఁగనఁబడెను. సమీపమున భిల్లులు తెగిపడియుండిరి. పద్మావతి మాత్ర మచటలేదు. ఆమెను దెచ్చుచుండ బలవంతులెవరో యాదారినివచ్చిచూచి భిల్లులను సంహరించి యామెనువిడిపించియుందురని తలంచితిని. ఆక్షణమ విదేహపురమునకుఁబోయితిని. పద్మావతి యింటలేదు. పురమునఁ నెందును గానరాదయ్యెను. అంతట స్వపురముననుండ నిష్టములేక రిక్తహృదయుఁడనయి యిట్లుత్రిమ్మరుచున్నాఁడను. ఈనగరమునఁ బద్మావతీదేవి రూపపటమునుగాంచి దుఃఖించితిని. దేవరయానతి కాఁగా నిటువచ్చితిని. ఇది నడచినసత్యము. నన్ను రక్షింపవలెను.

పద్మా:—మదనా! నీవుచేసినదుండగము క్షమింపరానిది. దారినొంటిమెయినడచుస్త్రీలనుజేరి నీతిలేనివిధంబునఁ బలుకరించి చెడుత్రోవలకుఁ దీయ యత్నించుట మహాపరాధము. స్త్రీజాతికన్నఁ బురుషజాతి యెక్కుడు బలశౌర్యములుగలది. అట్లగుటఁ బురములయందుఁగాని యరణ్యములయందుఁగాని స్వస్త్రీలకుఁగాని పరస్త్రీలకుఁగాని కడకుఁ బరదేశస్త్రీలకుఁగాని యుపకారంబొనరింపఁ బ్రయత్నింపవలయునేకాని ద్రోహముచేయ యత్నించుట యెప్పటికిని భావ్యముకాదు. పరస్త్రీలను మాతృభావమునఁ జూడవలసియుండుట పురుషులకగ్రధర్మ

ము. అట్టిధర్మమును నీవుల్లంఘించితివి. నీయపకృతికయి యెంతకాలమయినను బశ్చాత్తాపమునఁ బరితపింపవలసియుండును.

మద:—నాకిప్పుడు బుద్ధివచ్చినది. ఇఁక నెప్పుడునట్లు ప్రవర్తింపను.

ప్రవేశము చంద్రసేనుఁడు.

పూర్ణ:—(ఎదురేగి) ఉదారచరిత్రా! యిటువచ్చి కూరుచుండుము.

చంద్ర:—(దృష్టిమరల్చి) ఏమి యీావిశేషము! (నడచి) జననీజనకులారా! నమస్కరించెద.

జయసిం:—(కౌఁగిలించుకొని) నాయనా! యెచ్చటనుంటివి? ఒంటిమెయివచ్చితివే. పద్మావతీదేవియేది?

యశో:—బిడ్డా! రమ్ము. (చుంచుదువ్వి చుబుకము పుడుకును.)

పూర్ణ:—(స్వగ)హృదయమా! తొందరపడకుము. (ప్రకాశము) ఆర్యపుత్రా! యీాపద్మావతీదేవి చిత్రపటమునఁజూచి యేల చింతించితివి? దయతో నానతిమ్ము.

చంద్ర:—మాతండ్రిరాజ్య మొకవత్సర మన్యునియధీనమగుట నేనును నాభార్య పద్మావతియు మధురాపురమునకు వచ్చితిమి. కారణాంతరమున నందుండనొల్లక విదేహాపురముఁ జేరితిమి. ఆపురమురాజునొద్ద విదేశాంగముల విచారించుమంత్రినై నేనునునాపత్నియు సుఖమునఁగాలముగడపుచుంటిమి. కొంతకాలమైనపిదప నేలికయానతిమెయి నేనంగదేశమునకేగితిని. పద్మావతి విదేహాపురముననేయుండెను. నేనుమఱలివచ్చునప్పటికామె యందులేదు. ఇల్లునుసమస్తవస్తువులు నెప్పటివిధముననుండెను. ఆమె యెందరిగినదియు నేమైనదియుఁ దెలియక నేనువిదేహాపురమువిడిచి యిట్లుసంచరించుచున్నాను. ఈపురమున నీచిత్రపటమును వీక్షించి నాభార్యయు నిట్లేయున్నందునఁ జింతించితిని. ఈచిత్తరువునందలి స్త్రీరత్నమెచ్చటనున్నది?

పూర్ణ:—పురుషభూషణా! నీయర్ధాంగియు మధురవాణీజయకేతను లారా! మీపుత్రికయు యశోవతీజయసింహులారా! మీకో డలునగు పద్మావతీదేవి యిచ్చటనేయున్నది. ఇదె నేనువెళ్ళి యామెవచ్చునట్లుచేసెద.

మధుర:—అంతటిభాగ్యమా!

జయకే:—మిక్కిలి కృతజ్ఞుఁడనయ్యెద.

యశో:—కనులుచల్లఁగ నామెనుజూచెద.

జయసిం:—త్వరితముగ వెళ్ళుము.

పూర్ణ:—నిమిషమునవచ్చెదను. (నిష్క్రమించుచున్నాఁడు)

చంద్ర:— తే॥గీ॥ కనులయందంబు రుచిరాంగ ♦ కములపొందు
ధ్వనివిధంబును మోముచం ♦ దంబుఁ జూడ
నితఁడు పద్మావతియె; భేద ♦ మింత లేదు
తెల్లముగఁ గొంతవడికంత ♦ తెలియఁగలదు.

అప్పుడు పద్మావతీలీలావతులు ప్రవేశించుచున్నారు.

పద్మా:—దేవా!

సీ॥ ననునెడఁబాసి దీ ♦ నతనొంది శోకించు
నినుఁగనులారఁగాఁ ♦ గనుచునుండి
ప్రాణనాధా! నేనె ♦ భవదీయసేవామ
హాభాగ్యమున ధన్య ♦ నైనదాన"
నని విన్నవించి పా ♦ దాంభోజయుగళంబు
పైవ్రాలి మన్నన ♦ వడయఁబోక
పురుషరూపంబున ♦ గరువంపుఁదనమున
నిందఱముందు నీ ♦ యెదురనిలిచి
తే॥గీ॥ ప్రేలుచుండినపెద్దగ ♦ య్యాళియనుచు
నెమ్మదినిగోపమూనక ♦ నెవరుగలిగి

తప్పులన్నియు సైరించి ♦ త్వత్పదాబ్జ
సేవదయచేసి నన్నుర ♦ క్షింపుమిపుడు.

సీ॥ సఖులులేకయొకర్తె ♦ చనుదెంచెవనులలో
నీనాతిమర్యాద ♦ లేనిదనక
కత్తినిబట్టి సం ♦ గరమొనరించెనీ
కంజాతనయన రా ♦ క్షసియెయనక
తగుసిగ్గులేక పె ♦ ద్దలతోఁబ్రసంగించె
నీలతాతన్వి గ ♦ య్యాళియనక
హితముతోనుండి త ♦ న్నెఱఁగింపదయ్యె నీ
కాంతామణియు మోస ♦ గత్తెయనక
తే॥గీ॥ వర్తనమునఁ గొండంతలో ♦ పంబులున్న
నన్యథాయెంచఁబోక ప్రే ♦ మాన్వితంబు
భక్తిపూర్ణంబు నామనో ♦ భావమెఱిఁగి
లాలితాకార! ననుఁగూర్మి ♦ నేలుకొనుము.

(నమస్కరించుచున్నది.)

చంద్ర:—సఖీ! లెమ్ము. (అనిలేపి)

తే॥గీ॥ చందురునిరాకఁ జీకటి ♦ జాఱునట్లు
తరుణి! నీరాకఁజింతయుం ♦ తయునుదీఱెఁ
బండువెన్నెల జగమెల్ల ♦ నిండునట్లు
నుల్లమున మోదపూరంబు ♦ వెల్లివిరిసె.

పద్మా! నిన్నుఁజూచుటచే నాకుఁబరమానందము గలిగినది.

పద్మా:—(యశోవతిని. సమీపించి) అత్తగారికి నమస్కారము.

యశో:—దీర్ఘకాలము సుమంగలివయి సుపుత్రులఁబడయుము.

పద్మా:—(మధురవాణినిసమీపించి)జననీ! యభివాదనమొనరించుచున్నాను.

మధుర:— బిడ్డా! రమ్ము. (చేరఁదీసి) ఎంతగాఁ గృశించితివమ్మా!

పద్మా:— దేవా! నీవంగదేశమునకు వెళ్ళినపుడు నేనొకనాఁటిరాత్రి నిదురించుచుండఁగా నిరువురుభిల్లులు మంచముతోడ నన్నర ణ్యమునకుఁ గొనిపోయిరి. నేనుమేల్కాంచి వారల నదల్చి తిని. వారు మంచమును దించిరి. దించినన్నుఁజూచి యసద్వా క్యములాడి వారినివాసములకు రమ్మ్మని తొందరచేసిరి. నీతిబో ధనములును సామవాక్యములును వారలయెడ నిరర్థకములయ్యె ను. "ఇరువురు యుద్ధమొనరించిన నందుజయమొంది వచ్చి నవాని నివాసమునకు నేనువచ్చెద" ననిచెప్పితిని. అంతవారు పోరనారంభించి కొంతవడికిఁ బరస్పరఖడ్గాఘాతముల నిరువు రు మడిసిరి. అంతట లభించినమార్గమున వెడలి కొన్నిదినము లకీపుష్పపురమునకు వచ్చితిని. పురుషవేషమును ధరించితిని. నేవచ్చునప్పటికీపురమున లీలావతీస్వయంవరము జరగుచుం డెను. ప్రేక్షకులలో నిలిచిన నన్నుసమీపించి భద్రగజమునా గళమునఁ బుష్పహారమువైచెను. ఈలీలావతినినేను బరిగ్రహిం చితిని. నీకొఱకై విదేహపురమునకును మఱియనేకపురములకు ను భటులను బంపితిని. నాచిత్రపటమునొకదాని నీనగరద్వా రమునఁగట్టించితిని. దినదినము నీరాకకయి యెదురుచూచు చుంటిని. నేటికినీదర్శనభాగ్యమొదవె. నేనుధన్యనయితిని. నా విన్నపమొండు గలదు.

తే॥గీ॥ కలితసౌశీల్యసౌందర్య ♦ గరిమలందు
దేవ! నన్నుమీఱు లీలావ ♦ తీలతాంగి
పుష్పపురరాజ్యలక్ష్మితోఁ ♦ బూవుఁబోఁడిఁ
బ్రేమతో నేలుకొనుము నా ♦ విన్నపమున.

లీలావతీ! యీమహాపురుషుఁడే మత్ప్రాణనాథుఁడు.

లీలా:— తే॥గీ॥ నాథుఁడగుచుఁబద్మావతి ♦ నన్నుఁదొలుత
నేలుకొనియెః సపత్నినై ♦ యిప్పుడేలు
నామెతోఁగూడనన్నునీ ♦ వాదరించి
సౌఖ్యమున నేలుకొనుమింకఁ ♦ జంద్రసేన!

చంద్ర:— పద్మా! నాసంపూర్ణహృదయముతో నిను బ్రేమించుచున్నాను. నీకల్యాణవిగ్రహమును దప్ప నానేత్రము లితరకాంతల దర్శించి యెఱుఁగవు. అయినను నాయర్ధాంగివగు నీవు ముందుగ నీమెను బరిగ్రహించి యుండుటను నీవలెనే యీమె గుణవతియని నీవు చెప్పుచుండుటను నేనీలీలావతిని జేకొనవలసియున్నది.

పద్మా:— మాకిరువురకును వెలలేని సంతోషమును గూర్చితివి.

లీలా:— (హారమునువైచి నమస్కరించుచున్నది.)

చంద్ర:— లీలావతీ! లెమ్ము.

లీలా:— (లేచి పద్మావతితో) అక్కా! మన్నింపుము. (హారము వేయుచున్నది.)

పద్మా:— నాకేటికి? చెల్లెలా! నిన్నుఁ బ్రాణాధికముగఁ బ్రేమించెద.

లీలా:— మహాభాగ్యము.

మద:— తల్లీ! పద్మావతీదేవీ! నీకిదె నమస్కరించుచున్నాను. (నమస్కరించి లేచి) నీచరిత్రము మిక్కిలియద్భుతమును గొలుపుచున్నది. నీయప్రతిమాన పాతివ్రత్యమును ధైర్యసాహసములును జగద్వందనీయములు. నీదర్శనము కాముకులకు గుండెగాలము. నీనామము కుజనుల కుచ్చాటనమంత్రరాజము. నీపలుకు దుర్మతులకు గర్వనిరాసనహేతువు. కన్నుఁగానని మదమునవర్తించు దుర్మార్గులకు నీదక్షిణబాహువు కాలునిదండము. గార్హపత్యాగ్నివలె నీవు నిష్కలుష పావనమూర్తివి. నీ

ధమున నిన్నుఁ బలుకరించి ప్రబలాపరాధము గావించితిని. దు
దుమారులునా దుండగములకై నీవెంతయుశ్రమపడితివి. వలసి
నవిధమున నన్ను శిక్షింపశక్తియుండియు స్వభావకరుణార్ద్రి
హృదయవగుట నాతప్పులనెల్ల సహించితివి. నాకుజ్ఞానమును
బ్రసాదించితివి. నీనామము గురునామమని సంస్మరించుచుండె
ద. నీమూర్తి కాళికాదేవిమూర్తియని కొలుచుచుండెద. పర
కాంతలయెడ మాతృభావము నెఱపెద. నీకతమున నాజీవిత
ము మార్పునొందినది. నీహితబోధనమున నేనొకమర్త్యుఁడ
నని నలుగురిలోఁదలయెత్తుకొని తిరుఁగగలను. ఆజన్మము నీ
యెడఁ గృతజ్ఞుఁడ నగుచున్నాను.

పద్మా:—సద్బుద్ధిగలిగి మనిన మేలుపడుదువు.

మద:—చిత్తము. ఇదినాకు గొప్పవరము.

సుగు:—తల్లీ! పద్మావతీదేవి' లగ్నమాసన్నమైనది.

పద్మా:—నాథుఁడు మంగళస్నానమొనరించి వచ్చియున్నాఁడు. మే
ముసు సిద్ధముగనున్నాము.

సుగు:— దేవా చంద్రసేనప్రభూ! సింహాసనమునధిరోహింపుము.
లీలావతీదేవి గోడఁ బుష్పపురరాజ్యలక్ష్మిని నేఁడుపరిగ్రహిం
పుము.

జయకే—నాయనా! యాలస్యమేల? కానిమ్ము.

చంద్ర:—మీయంచఱయానతిని దిరస్కరింపలేక విధేయుఁడనగు
చున్నాను. (సింహాసనము నెక్కును. పద్మావతీలీలావతు లిరు
ప్రక్కలఁ గూర్చుండుదురు.)

సుబ్ర:—ధ్రువం తేరాజావరుణో ధ్రువం దేవోబృహస్పతిః
ధ్రువంతఇంద్రశ్చాగ్నిశ్చరాష్ట్రంధారయతాంధ్రువం.

శతావధానిపంచానన, కవిసింహ.

డి. రాజశేఖరకవిగారిచే

రచియింపబడిన గ్రంథములు.

# వీరమతి

ఘూర్జరదేశ నాయికయనియు, సుత్తమ పతివ్రతా తిలకమనియు, బ్రఖ్యాతిగాంచి, తన మానసంరక్షణకై యొకగంటలో 12 మందిని ఖడ్గమునకర్పించిన రాజపుత్రస్త్రీ చరిత్రము. 900 పద్యములు హృద్యములు. శైలి నూతనము. మనోహరము. తిరుపతి వెంకటేశ్వరులలో నొకరగు బ్ర॥ శ్రీ॥ చెళ్లపిళ్ల వెంకటేశ్వరశాస్త్రి శతావధానిగారు విపులమైన యుపోద్ఘాతమువ్రాసియున్నారు. భాషాభిమానులు తప్పక చదువదగినది.

వెల. 1—0—0 క్యాలికో. 1—8—0

## శరన్నవరాత్ర పద్యావళి.

గ్రంథకర్తలు: విఖ్యాత కవిపండితులును, కవిసింహ శతావధానులగు, రాజశేఖర-వేంకటశేషకవులు

ఇది బృందావనమున జరిగిన కవుల పోటీసభలో ప్రథమ బహుమానమందిన యుత్తమ గ్రంథము.

వెల. 0—2—0

---

జ్ఞానోపకారిణీప్రెస్సు, ప్రొద్దుటూరు.

# పండితాభిప్రాయములు.

వీరమతి:—ఇదియొక వనితామణిచరిత్రయని యీపేరే చెప్పుచున్నది. ఇదినిర్వచన ప్రబంధము. షష్ఠ్యంతాదులులేక యిది నవీనపద్ధతిననుసరించి వ్రాయఁబడినది. చరిత్రము పవిత్రము. పద్యములు హృద్యములు. రసము సుస్వాద్యము. కల్పనలో యనల్పశేముషీపరిణామములు. వర్ణనములు స్వభావోక్తికిఁ దావలములు. ఇట్టి రసవంతమైనశైలిలో నిట్టికావ్యమువ్రాయఁగలవారాంధ్రదేశమున నీకాలమునఁ గొలఁదిమందిమాత్రమే కలరు. ఈగ్రంథముఁ గొన్నివత్సరములకుముందు వ్రాఁతప్రతిగానుండుతఱిఁ గవిసింహాము చదువఁగావినియుంటిని. ఈయది ప్రథమప్రయత్నమైనను ఆఱితేఱిన కవితవలె జగిమిఁజిమియున్నది. ఇట్టి యుత్కృష్టగ్రంథరత్నము నొనరించి కవి తనపాండిత్యమును సార్థకముచేసికొనుచు నాంధ్రలోకమునకు మహోపకారమొనరించి తనయశోనిర్మలచంద్రచంద్రికల శాశ్వతముగ నలరారఁజేసెను. భగవంతుఁ డీగ్రంథము నాచంద్రతారార్కముగ వెలయఁజేయుఁగాక.

జిల్లు పన్నవిచు. బు, జనవిధేయుఁడు

కడప. శాస్త్రి. జమ్మంచి. శేషాద్రిశర్మ.

---

బ్రహ్మశ్రీ దువ్వూరి రాజశేఖరకవిగారు తమమిత్రులతో రాజమహేంద్రవరమునకువిచ్చేసి వారురచించిన "వీరమతి" యను పద్యకావ్యము నాకుఁగొంతభాగము వినిపించినారు. వారిశైలి మార్దవమాధుర్యగాంభీర్యాదులు గలిగి మనోహరముగానున్నది. వారికిది ప్రథమప్రయత్నమైనను బూర్వకవులకవిత్వముఁబోలె గవిత్వమనర్గళధారాప్రవాహమై సుగమంబుగనున్నది. వీరిపద్యములు వినుచున్నప్పుడు నాచిత్తము మిక్కిలి కౌతుకాయత్తమైనదనుటలో

జనోపకారిణీస్టోర్సు, ప్రొద్దుటూరు.

నతిశయోక్తిలవమైనను లేదు. ఇట్టి కావ్యమిప్పటి కాలములో ముఖ్యావసరమైయున్నది. ఇది పండిత పామరజనరంజకమై కరంబలరారుచున్నది. కవిగారిట్టి శైలినిపుడికొన్ని గ్రంథములు రచించి మాతృసేవంజేసి కృతార్థులై వన్నెగాంతురుగాక యని పరమేశ్వరునిఁ బ్రార్థించుచున్నాను.

రాజమహేంద్రవరము. కవిరాజు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి.

---

బ్రహ్మశ్రీ, దుర్గాకి రాజశేఖర కవిగారు రచించిన "వీరమతీచరిత్ర" మను నాంధ్ర ప్రబంధమును వారిముఖమున వినిని మిక్కిలి సంతోషించితిని. ఈయన కవితాధార పరిశుద్ధము. శైలి మనోహరము రసపోషణము శ్లాఘ్యము. కథాకథనము రుచిమంతము. ఇందలికథ పరమపతివ్రతయగు వీరమతీదేవి పావనచరిత్రమగుటచే నాంధ్రస్త్రీలకవశ్యము పఠనీయము. ఈరాజశేఖరకవి, గీర్వాణభాషయందు ననేక కావ్యములను నాటకములను నిర్మించి ప్రఖ్యాతికెక్కిన రాజశేఖరకవివలె, నిరుపమానయశోవిభ్రాజితుఁడగుఁగాక. ఈగ్రంథమాత్మగౌరవము దేశాభిమానము నీతి శాంతము మొదలగు ననేకధర్మములను బోధించుచున్నది. కావున విద్యార్థులు తప్పక చదువఁదగినది. రసవంతములును దేశచరిత్రాత్మకములునగు నిట్టిప్రబంధములఁ గొన్నింటిని రాజశేఖరకవి రచియించి యాంధ్రప్రపంచమునకు మేలుసేయుఁగాక.

రాజమహేంద్రవరము. చిలుకమర్తి. లక్ష్మీనృసింహము పంతులు.

---

ఉ॥ శ్రీకరమై జగంబునకఁ ♦ శేషఫలప్రదమైవెలార్చు ర
త్నాకరతుల్యమైన కవి ♦ తాలహరిన్ దనరారునీవు దు
ర్గాకకులప్రదీప! గుణ ♦ భావధురంధర! రాజశేఖరా!
ప్రాకటరీతి వీరమతి ♦ వ్రాసితివార్యులుమెచ్చునట్లుగన్.

---

జనోపకారిణీస్టోర్సు, ప్రొద్దుటూరు.

ఉ॥ వీరులసచ్చరిత్రవిన • వేడుకయై విలసిల్లునట్లు సొం
పారఁగ రాజశేఖరుఁడ • వై కవిరాజులు మెచ్చునట్లు భా
షారచనాచమత్కృతి ర • సంబులు చేరలతోడజుర్రఁగా
వీరమతిన్ రచించితివి • వీనులవిందులు సేయునట్లుగన్.

ఉ॥ పూర్వకవిప్రయోగముల • పోలికకొంత నవీనసత్కవుల్
నేర్వనిసోయగంబులు న • నేకమువ్రాసిననేర్పుకొంత యే
పర్వముచూచినన్ నయన • పర్వముసేయును రాజశేఖరా!
సర్వమునీదువీరమతి • సత్కృతికిన్ దగి యుండునెంతయున్.

తే। గీ॥ దీనిబాలురు బాలికల్ • జ్ఞానవిదులు
కోవిదులు వీరవరులు వి • ద్యావిశార
దులు నిరంతరము పఠించి • తొడరిదేశ
మెదనుసేవించి వీరుల • య్యెదరు గాక.

ఇట్లు,

పిఠాపురము. ఉమర్ అలీషా.

---

బ్రహ్మశ్రీ, డి. రాజశేఖరమయ్యగారికి, వందనములు.

ఉ॥ ప్రాతిగనీతి మంతమగు • వ్యక్తిచరిత్రమువ్రాసి యాంధ్రులం
దీతఱిశీలసంపదకు • నింపుగఁబ్రోది యొనర్చి మాతృభూ
ప్రీతిగ వాఙ్మయంబునకు • పెంపొదగూర్చుచుఁ బర్చిమాంధ్రవి
ఖ్యాతినిబైకిఁ దెచ్చిచరి • తార్థము నీచడువయ్యమిత్రమా!

తే। గీ॥ కవనగుణముచుగూర్చి మా • గణపయేల?
శతశతవధానసామ్రాజ్య • చక్రవర్తి
చిత్రమిగుగొత్తఁ దీశికఁ • జేతులార
వ్రాసి పెట్టిన వేంకటే • శ్వరుఁడెసాక్షి.

తే। గీ॥ రాజశేఖరకవి! కవి • రాజశేఖ
రుండనుపదంబుమీకు ద • వ్వుండఁబోదు

---

వీరమతి ధీరచరిత గర్వ ♦ ధీరసరణి
విరచితంబయ్యె సరసులు ♦ శిరసులూప.

తే॥ గీ॥ వీరమతివంటితల్లులు ♦ వెలయవలయు
వీరమతివంటిబిడ్డలు ♦ వెలయవలయు
భవ్యసంతానసముపేత ♦ భరతమాత
విశ్రుతానంద బాష్పముల్ ♦ విడువవలయు.

ఇట్లు,

పర్లపాడు. (బాలకవి) వసిరెడ్డి వేంకటసుబ్బారెడ్డి

---

బహ్మశ్రీ డి. రాజశేఖరమయ్యగారికి, వందనములు.

శా॥ నీదౌవీరమతీచరిత్రకవితల్ ♦ నేవింటినాద్యంతమా
హ్లాదంబయ్యెను రాజశేఖరకవీం ♦ ద్రా! సంతతోజస్సమ
త్వాదిశ్లాఘ్య గుణోత్తరంబునుపమా ♦ ద్యాలంకృతిస్తుత్యమై
యాదిప్రౌఢకవీంద్రసాంద్రకవనా ♦ త్యంత స్ఫురచ్ఛైలియై.

శా॥ నీదౌవీరమతీచరిత్రకవితల్ ♦ నేవింటి సౌఖ్యస్ఫుర
త్పాదన్యాసముగల్గి సద్ధ్వనిపద ♦ భ్రాజద్గతిన్బొల్చి మ
ర్యాదాలంకృతిభావలక్షణరసా ♦ ఢ్యంబౌచుఁ బ్రౌఢాంగనా
సాదృశ్యంబయి మెప్పుగాంచెనుకవీ ♦ శా! కాళహస్తీశ్వరా!

శా॥ నీదౌవీరమతీచరిత్రకవితల్ ♦ నేవింటిఁ బూఁదేనియ
న్గాదేనిన్ సుధఁబంచెఁ గామగవివె ♦ న్నన్ నించెఁదద్రాక్షతో
వాదుల్ పెంచె శిరీషపుష్పమృదుతల్ ♦ స్పర్శించె సాయంస్ఫుట
శ్రీదివ్యన్నవమల్లికాసురభి న ♦ ర్పించెన్ జమీమామిత్రమా!

ఉ॥ వింటినిరాజశేఖరక ♦ వీ! తమవీరమతీచరిత్రమున్
గంటినిశైలియద్భుతపద ♦ గౌరవమాచితి, శీర్షమూఁచిబే
సంటిని, దేవవాఙ్మయము ♦ నందునఁ దొల్లిఁటిబేసికంటివా
ల్గంటికిదాసుఁడైన కవి ♦ గండఁడ వీవనియంటిఁ దెల్గుకున్.

C. CHENNA REDDY,
Parlapad.

---

జనోపకారిణిప్రెస్సు, ప్రొద్దుటూరు.

**Veeramati is a telugu work, purely in verse narrating the thrilling incidents of the heroine of that name.**

The author is a Versatile poet with an extraordinary ease of expression, and ready command of language. The style is free from pedantry and ostentatious display of words and jugglery in words with which most of modern productions are replete. The narrative rums flowing in gentle manner without any turgidity or break and it reads like a romance recalling the history of Rajput queens who fought in battle or who boldly sacrificed themselves avoiding the clutches of sinners by committing "Hari-Kari." The name of the famous Padmini springs easily into our memory. Viramati's attack upon the villain who wanted to ensnare the lady in his grasp and compel her to yield to his passions has been described in the most telling manner. The poet has given many a touch of poetic impression when he, for example, in the second chapter describes in delightful language the tank from which she was enticed, the appearance of the charming bunds of the same, looking like green carpets lighted by the dazzling eyes of the agile deer folk, the fragrance of the plant world felt by the heroine while being carried in the Palanquin, the comparison of the motion of the palanquin to that of the swans on the crest of the waves of the tank etc. There is real delicacy of imagination in the description of the pastimes in the royal house, a lesson to modern educationists and to the graces of the gentler sex in that of the white clouds floating in the dark firmament. The poet has also sound Psychology in his mental frame as evidenced by the description of the absent-mindedness and the wavering consciousness compared to water drops on the lotus leaves. It is a beautiful description indeed.

---

జనోపకారిణీప్రెస్సు, ప్రొద్దుటూరు.

Chivalry to womankind and due appreciation and regard paid to them are also another feature of the work. The ideal love that is, love to one only and no other, of the fair sex is also hinted at in the work.

The flood of emotion when the prince was about to be sacrificed to appease the wrath of the village goddess displayed and described in 36th stanza [3 chapter] is excellent. In short the book contains many poetical ideas and it is worthy of being prescribed for the High school classes.

(Sd) P. PARTHASARATHI IYENGAR. B.A.B.L.,
*District Munsiff.*

# పద్మావతీవిజయము.

ఇది మహోదాత్తగుణస్ఫురణముగలిగి వీరరసమహావతార మగు నొక కాంతామణిదివ్యచరిత్రము. పద్మావతీదేవి పురుషుల దుర్గుణములఁగుఱించి వివరించుతావులు కేవలము రససంఘటనములు. ఈమెబుద్ధి నిరుపమానము. పతిభక్తి సకలజన స్తవనీయము. పాతివ్రత్య మనన్యసాధారణము ఔదార్య మప్రతిమానము. ఈమెనామము కుజనులకుచ్చాటనమంత్రరాజము. ఈమెదర్శనము దుర్మార్గులకు మృత్యుసందర్శనము. అర్ధరాత్రమునఁ గ్రొత్తయూర నన్యగృహమున జగన్మోహనునంతవానిని దలదీసిన యుదాత్తనాయికారత్నము. సద్గుణరత్నములకు రత్నాకరము. ఇట్టినాటకరాజ మిదివర కాంధ్రభాషలో లేదు. శైలిమనోహరము. పద్యములుహృద్యములు. గద్యములుత్సాహరసపూరితములు.

స్త్రీపురుషులందఱు తప్పక చదువఁదగినది.

వెల 1—0—0

---

జనోపకారిణిస్టోర్సు, ప్రొద్దుటూరు.

# సీతాకల్యాణము

(౫ అంకములు నాటకము.)

గ్రంథకర్త కవిసింహ. డి. రాజశేఖర శతావధానిగారు.

బాలసరస్వతీ, కావ్యతీర్థ, అభినవ వాల్మీక్యాది బహుళ బిరుదాంచితులగు బ్రహ్మశ్రీ జనమంచి శేషాద్రిశర్మగారీ నాటకమున కుపోద్ఘాతము వ్రాసియున్నారు.

శ్రీరామజననము మొదలు సీతాకల్యాణము వఱకుఁగలకథ యిందు రమ్యముగఁ బొందుపఱుపఁబడి యున్నది ప్రథమాంకమున విష్ణునితో దేవతలు మొఱపెట్టుకొనుటయు, ద్వితీయాంకమున దశరథ విశ్వామిత్ర సంవాదమును, తృతీయాంకమున విశ్వామిత్ర చరిత్రమును, చతుర్థాంకమున స్వయంవరమును, పంచమాంకమున దశరథరామ భార్గవరామ సమావేశ సంవాదములును, మిక్కిలి రుచిమంతములై యుండును. [illegible]క్షత్రియరాముల సమావేశములు ఏ తరహ విధానములతో నడుపఁబడి మిక్కిలి హృద్యంబుగను నాటకరంగమున నుండును. శైలి శ్రేష్ఠము. వచనములును, పద్యములును రసపూర్ణములు. భావములు హృదయంగమములు. రామాయణమును దెలియఁగోరువారు తప్పక చదువఁదగినది.

వెల రు. 0—8—0

జనోపకారిణీస్టోర్సు, ప్రొద్దుటూరు.

